# సాహిత్యమీమాంస



శ్రీ పండిత రామదహీనమిశ్ర కావ్యతీర్థుని
హిందీ గ్రంథమునకు తెనుగు.

గ్రంథకర్త:
శ్రీపాద కామేశ్వరరావు

ప్రకాశకుడు:
చెఱుకువాడ వేంకటరామయ్య
అభినవాంధ్రగ్రంథమాలా కార్యాలయము
రాజమండ్రి

1926



మేలుప్రతి 1-8-0
సాదా ,, 1-4-0

# పీఠిక

ఆంధ్రవాఙ్మయమ్మున సాహిత్యవిమర్శనపద్ధతుల వివరించు గ్రంథములు చాలా తక్కువ. విమర్శకులకు కొదవ లేదు, గాని ఏ నియమముల ననుసరించి గ్రంథముల మంచి చెడ్డలు నిర్ణయించవలెనో ఉదాహరణములతో చర్చించే గ్రంథములు తగినన్ని లేవు; ప్రాచ్యప్రతీచ్యాదర్శముల తారతమ్యము కన్పర్చున వసలే లే వనవచ్చును.

అట్టి గ్రంథమును రచించవలె నను కోరిక మా మదిలో రూఢమైన పిమ్మట బొంబాయి హిందీగ్రంథరత్నాకరసంపాదకు లీ గ్రంథమును ప్రచురించిరి. తోడనే దీనిని తెనుగుచేయ సంకల్పించి వారి అనుమతి వేడగా అచిరకాలమున వా రనుజ్ఞ నిచ్చినందుకు వారికి చిరకృతజ్ఞులము.

ఈ గ్రంథమునకు మూలము శ్రీయుత పూర్ణచంద్రవసు గారిచే "సాహిత్యచింత" అను పేర వంగభాషలో వ్రాయబడెను. దానిని కొంత కుదించి మరికొంత పెంచి శ్రీమాన్ పండిత రామదహినమిశ్ర కావ్యతీర్థులు హిందీభాష ననువదించిరి. మేము దీనిని కొంచెము పెంచి తెనుగు జేసితిమి.

శ్రీయుత వసుగారి అభిప్రాయము లందరికీ నచ్చకపోవచ్చును, కాని వారు చర్చించిన విషయములు ముఖ్యము

లనుట సర్వజనసమాదరణీయము. మన సనాతనధర్మమందు విధింపబడిన ఆదర్శములు, ఆచార వ్యవహారములున్నూ పాశ్చాత్యాదర్శాచారవ్యవహారములతో పోల్చి చర్చించడము ప్రస్తుతమున అత్యావశ్యకము-ఏలయన పాశ్చాత్యాచారముల తోటి సంసర్గము మన కనుదినమూ హెచ్చుతూంది. అవి క్రొత్త వౌటచేత షేక్స్పియరు చెప్పినట్లు—

..............................New customs
Though they be never so ridiculous,
Nay, let ' em be unmanly, yet are followed,

అనుసరింపబడు నూత్నాచార మపహా
సనకరము నపౌరుషంబును నైన.

ఉభయ జాతుల బాగోగు లీగ్రంథమున కొంతవరకూ వివరింపబడినవి కావున చదువరులదృష్టి మన సనాతనధర్మ వాఙ్మయముల దెస కాకర్షింపబడి మన ఆత్మగౌరవము, ఉన్నతాదర్శములు, అధ్యవసాయము, దేశభక్తి, భాషాభిమానమూ ఏ మాత్రమైనా వృద్ధిపొంది, యోగ్య విమర్శజ్ఞానము ఆంధ్రుల కలవడితే మా యత్నము సఫలమవుతుంది.

పద్యములను తర్జుమా చేసేటప్పుడు కొంద రాంధ్ర కవుల అనువాదము లిం దుల్లేఖించినాము; ఈ విషయమున బ్రహ్మశ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారి "నవరస తరంగిణి" మా కమితోపకారి యైనది. షేక్స్పియరు పద్యముల ననువ

దించుట సాధారణప్రజ్ఞావంతులకు సాధ్యము కాదు. దాసు గారికిన్నీ తదితరకవులకున్నూ మేము వందనము లర్పిస్తూ న్నాము.

ఈ గ్రంథమున కొన్ని వ్యావహారిక పదములు యథేచ్ఛముగా వాడినాము. అవి సత్కవులు వాడినవి కావున ప్రయోగార్హములని అచిరకాలమున రుజువు కా గలదు.

చివర నున్న పట్టిక ప్రకారము సవరణలు చేసుకొందురు గాక!

ప్ర కా శ కు డు.



# విషయసూచిక



పుటలు

# A GLOSSARY OF TECHNICAL TERMS



| | | |
|---|---|---|
| అంతశ్శత్రువులు | = | The enemies of mankind. ఉ॥ కామ, క్రోధాదులు. |
| అపరసృష్టి | = | Creation *sui generis.* |
| అమానుషికము | = | Non-human, either sub-human or superhuman. |
| అలౌకికము | = | Extra-ordinary (అసాధారణము, లోకోత్తరము) |
| ఆదర్శము | = | Ideal. |
| ఆశ్రమములు | = | Stages of life. |
| 1) బ్రహ్మచర్య | = | Life of a student. |
| 2) గార్హస్థ్య | = | ,, ,, house-holder. |
| 3) వానప్రస్థ | = | ,, ,, anchorite. |
| 4) సన్యాస | = | ,, ,, beggar. |
| ఉచ్ఛ్వాసము | = | preponderance, (ఉద్వేగము) |
| ఐకాంతికము | = | Univergence, |
| కామానురాగము | = | Lust, Sensuality. |
| కాలక్షేపములు | = | హరికథలు. |
| గుణములు | = | Principles of Existence or Being. |
| 1) తమస్సు | = | Inertia. |
| 2) రజస్సు | = | Activity. |
| 3) సత్వము | = | Equipoise, Sublimation. |
| ఘటనలు | = | Incidents. |

| | | |
|---|---|---|
| చిత్రణము | = | The act of artistic production such as a painting, a piece of poetry, an air of music &c., |
| చిత్రము | = | An artistic product. |
| చిత్రకారుడు | = | Artist. |
| జాతి | = | General (Class) Universal. |
| తత్తుల్యరూపము | = | Natural form or colour. |
| ధర్మము | = | Eternal law, Duty, Righteousness, Merit, Justice, Virtue, The Good. |
| ధార్మికుడు | = | A virtuous person, one who follows the rules of caste and stages of life. |
| ధృష్ట | = | A bold, intrepid woman. |
| నిగ్రహము | = | Control, Subjugation. |
| నిర్వచనము | = | Definition. |
| నివృత్తి | = | Resignation of the pleasures of this world. |
| పరమావధి | = | The highest end, the goal. (ఆదర్శము) |
| పరార్థపరము | = | Altruistic, other-regarding. |
| ప్రకృతి | = | Nature, integrity. |
| ప్రత్యాఖ్యానము | = | Rejection (పరిత్యాగము) |
| ప్రేమ | = | Love, Affection. |
| 1. పాశవ | = | Brutal or Carnal love. |
| 2. మానవ | = | Human love. |
| 3. దివ్య | = | Divine love. |
| ప్రేయసులు | = | Lovers. |
| భావము | = | Mentality, Idea, Feeling or Emotion. Nature. |

భావన = The act of imagining, comprehension.

మైత్రి = Love of Humanity, Brotherhood of man.

రసము = Sentiment.

1. శృంగారము = The Erotic sentiment.
2. వీరము = ,, Heroic ,,
3. రౌద్రము = ,, Furious ,,
4. కరుణ = ,, Pathetic ,,
5. బీభత్స = ,, Odious ,,
6. అద్భుత = ,, Wonder ,,
7. శాంత = ,, Tranquil ,,
8. భయానక = ,, Terrific ,,
9. హాస్య = ,, Comic ,,

రుచి = Taste (figurative)

1. సురుచి = A refined taste (నాగరిక)
2. కురుచి = A low taste (పామర)

లాలస = Lust, Sensuality.

వాత్సల్యప్రేమ = Parental love.

వివిక్తి, వివేచన = Sagacity.

విశిష్టి = Distinguishing Characteristic, differentia.

వీరత్వము, వీర్యము = Heroism.

1. అసుర ,, = Brutal heroism.
2. మానవ ,, = Human ,,

బ్రహ్మ ,, = Heroism of Self-control (ధర్మ)

క్షాత్ర ,, = ,, ,, strength & skill (బల, కౌశల)

3. దివ్య ,, = Divine heroism.

వ్యక్తి = Individual, particular.

వ్యాప్తి = Pervasion.

వ్యాప్తము = All-pervading.

వ్యాపకము = Partial-pervasion.

సంయమము = Control (నిగ్రహము, వశిత్వము).

సంసారము, సంసృతి = Worldly life, the wheel of birth and death.

సఖ్యప్రేమ = Companionship, comradeship.

సతీత్వము = Wifehood, Womanhood.

సత్యపాలనము = Redemption of a virtuous pledge.

సమరము = Struggle.

1. బాహ్య = External strife.

2. అంతరంగ = Internal struggle or conflict of motives.

సమాలోచనము = Critique, Criticism (మీమాంస, చర్చ, విమర్శ)

సహృదయులు = The learned, cultured people of refined tastes.

సాంఘాతికము = Fatal.

సాధ్యము = The end or ultimate purpose.

సాధనము = The means.

సాహిత్యము = Literature, Literary Art.

స్థాయి = Abiding.

స్వార్థపరము = Egoistic, Egotistic.

స్త్రైణత = Dotage.

# సాహిత్య మీమాంస

## ఉపోద్ఘాతము

### సాహిత్యమన నేమి

సాహిత్యశబ్దార్థము జటిల మైనది. దీనిని పలువురు వేర్వే రర్థముల యందు వాడుచున్నారు గావున దీని యర్థ నిర్ధారణ మావశ్యకము. అది తెలియకపోతే సాహిత్యమీమాంస మెట్లు చేయగలము?

"సాహిత్య గ్రంథములు" అను పదము వినినతోడనే సాహిత్యదర్పణము, కావ్యప్రకాశము, రసగంగాధరము మున్నగునవి స్ఫురించును. రఘువంశము, కుమారసంభవము కావ్యములని పరగుచున్నవి. ఇవి సాహిత్యగ్రంథములు కావా? అని ప్రశ్నించిన ఉత్తరము తక్షణ మాలోచనీయమగును. మొదట వివరించిన మూడు గ్రంథములయందూ ప్రతిపాద్యమైన విషయ మొక్కటే అయినా వాటిపేళ్ళలో సాహిత్యము, కావ్యము, రసము నను మూడుశబ్దములు వాడంబడియున్నవి. రఘువంశాదులు కావ్యములుకదా వాటిని సాహిత్యగ్రంథము లనంగూడదా? సాహిత్యమూ కావ్యమూ వేరయితే భేదమెట్టిది? దీనికి జవాబిది:—సాహిత్యశబ్దము రసము, గుణము, రీతి, అలంకారము మొదలగు విషయము

లను నిర్ణయించు (లక్షణ) గ్రంథములపట్ల రూఢిగా ఉప యోగింప బడుటచేత రఘువంశాదికావ్యములకు సాహిత్యశబ్ద మును వాడరు.

కావ్యశబ్దమునకున్నా ఈదశయే పట్టినది. కావ్యము నగా ప్రాయికముగా పద్యగ్రంథ మని తలంతురు. కొన్ని కావ్యములయందు గద్యపద్యములు యథేష్టముగా వాడఁ బడుచున్నా కేవల గద్యమయగ్రంథమును కావ్య మనుట లేదు. ఇంకొక విశేషము. ఏవో కొన్ని పదములుచేర్చి పద్యము లల్లినట్టయినా దానియందు భావము శూన్యమైనా దానికి కావ్య మనుపేరు చెల్లుతుంది. ఇక గద్య మెంత రసవంతము, సుందరము ఎంత భావభరిత మైనా దానిని కావ్య మనరు. అది రచించినవారిని కవులనరు.

ఈ సంప్రదాయముచిరకాలీనమై వస్తూన్నది. వస్తుతః కావ్య మన్నను సాహిత్య మన్నను ఒకటే, భేదము నామ మాత్రమే. భావ మెట్లున్నను, శైలి యెట్లున్నను, గద్యము కానీ, పద్యముకానీ, గీతముకానీ రసవంత మైనచో దానిని సాహిత్యమనికాని కావ్య మనికాని అనవచ్చును.

ఇక సాహిత్య మెట్టిదో విచారింతము. "సహిత" శబ్దమునకు ష్యఞ్ (అ) ప్రత్యయము చేర్చితే "సాహిత్య" అను పదము సిద్ధమవుతుంది. ఈశబ్దమునకు ప్రకరణానుసార మీక్రింది యర్థములు ఏర్పడినవి.

౧ సాహిత్యం మేలనమ్.

౨ పరస్పరసాపేక్షాణాం తుల్యరూపాణాం యుగప దేకక్రియాన్వయిత్వమ్. (శ్రాద్ధవివేకః)

3 తుల్యవ దేకక్రియాన్వయిత్వం, వృద్ధివిశేషవిషయి త్వం వా సాహిత్యమ్. (శబ్దశక్తిప్రకాశికా)

౪ మనుష్యకృత శ్లోకమయగ్రంథవిశేషః సాహిత్యమ్ (శబ్దకల్పద్రుమమ్)

సాహిత్యశబ్దమున కిన్ని యర్థములున్నా ప్రాయిక ముగా నిర్దోషశబ్దార్థగుణ రసాలంకారరీతివిశిష్టవిషయమునే సాహిత్య మని వాడుతారు. దీనికే కావ్యమని యింకొక పేరు. మొదటి తరగతికి చెందినవి కావ్యప్రకాశాదులు, రెం డవదానికి చెందినవి రఘువంశాదులు; అవి అనుశాసకములు, లక్షణగ్రంథములు, ఇవి అనుశిష్టములు లక్ష్యగ్రంథములు. మొదటివాటికి సాహిత్యశబ్దమున్నూ, రెండవవాటికి కావ్య శబ్దమున్నూ, ఉపయోగింపబడుతూన్నవి.

సాహిత్య శబ్దమునకు సర్వసాధారణముగా నీయర్థము స్ఫురించును. "సహితస్య భావః సాహిత్యమ్" అనగా వెను వెంట నున్నవాని భావము "సాహిత్యము." అనగా సంయు క్తుడై, మిళితుడై, పరస్పరాపేక్షితుడై, సహగామియై యున్నవాని భావము "సాహిత్యము." "సహిత" శబ్దమున కొక యర్థము "సహగమనము" అని గ్రహించితిమి.

కాని యింకొక అర్థము కలదు. హితేన సహావర్తతే

సహిత:—అనగా హితము కోరువాఁడు, హితము చేయు వాఁడును "సహితుఁడు" వాని భావము "సాహిత్యము." ఇందు 'సహిత' అను శబ్దమునందలి ఉపసర్గము వేరు చేయ బడినది. (స+హిత,) ఈయర్థమును గ్రహించితి మేని మనకు హితము చేయువాని భావము సాహిత్యమగును. హితము చేయువస్తువు (గ్రంథము) అనికూడా అన్వయించుకోవచ్చును. అలాగైతే కావ్యములు, ఇతిహాసములు శాస్త్రములు, కోశములు, మొదలగు నవన్నియు సాహిత్యమున చేరును. ఇతిహాసములం దీయర్థమే కనబడుచున్నది. అప్పుడు "వాఙ్మయ" మనునది "సాహిత్య" పదమునకు పర్యాయ మగును.

ఇక సాహిత్యమును గూర్చి యించుక చర్చింతాము. మన ఆత్మ చిదానందస్వరూపము. ప్రీతి, స్నేహము, దయ, భక్తియు సాత్వికభావావస్థలు. ఈభావములను వ్యక్తీకరించుట యందు కావ్యములు మనకు సాయము చేయును. వాటిని పఠించి తద్గతభావములను హృద్యము చేసుకొని కోశత్రయాత్మకమగు సూక్ష్మశరీరమునందు సద్భావములను సంగ్రహింతుము. కావ్యములు లోకోత్తరానందము నిచ్చును. దర్శనాదులచే మనము జ్ఞానోపార్జనము చేయఁజాలిననూ మన కానందము గలుగఁజేసి సౌందర్య సామ్రాజ్యమునకు దారి చూపేవి కావ్యములే.

దర్శనములూ, శాస్త్రములూ సాహిత్యగ్రంథములలో చేరినా సాహిత్యశబ్దము వాటియందు వర్తింపదు. ఎందు

కంటే, జ్ఞానబోధకన్న ఆనందోత్పాదనమే సాహిత్యగ్రంథము లకు విశిష్టధర్మముగా గణింపబడుతూన్నది. సత్యమే భావరూపమున హృదయమున ప్రస్ఫుట మవును. సత్యము, శివము, సుందరమూ ఐనదానిని అంతఃకరణమున మానవుఁ డనుభవించును. జ్ఞాన మానందానుభవోపాయములు జూప గా భావములే దాని ననుభవించును. మనకు లోకోత్తర జ్ఞానప్రాప్తికి సాధనములు భావములే కాని జ్ఞానము కానేరదు. "ఆనందమే జ్ఞానమందలి సారమ"ని వేదవాక్యము. ఆనంద మయకోశము విజ్ఞానమయకోశములోపల ఉండును. అట్టి యానందమునకు మూలకారణము భావము. భావవ్యంజకము లగుటచేతనే మనకావ్యముల కగ్రస్థానము దొరికింది. దర్శన ములూ, శాస్త్రములూ, ఇతిహాసములూ, కావ్యములకు వెనుక బడవలసినవే. శ్రేష్ఠభావములే మనసూక్ష్మశరీరములను పోషింప గలవు. భావముల మూలాన జ్ఞాన ముత్పన్నమగును, వాటి మూలానే జ్ఞానము పరిణత మవుతుంది. భావప్రాప్తికి భావన ఆవశ్యకము; చూడండి.

" యాదృశీ భావనాయస్య సిద్ధి ర్భవతి తాదృశీ "

" ఎవరి కెరీతి భావన లెసగుచుండు
వారి కారీతి తగుసిద్ధి వఱలుచుండు

శ్రేష్ఠ భావములే మనల వెన్నంటియుండి శ్రేయోదా యకము లవును. సుందరభావము లెందు సంగ్రహింపఁబడునో అట్టివే కావ్యములు, అవే మనకు సాహిత్య మగును. ఆభావ ములే మనకు హితకరములు. సుకవుల గ్రంథములు సద్భావ

రత్నగ్రథితములు. తదుపాదేయము లగు ఆధ్యాత్మిక భావములను సంగ్రహించి మన సూక్ష్మశరీరములను పోషించుకొందుము; కావున అట్టి గ్రంథములే సాహిత్యమగును.

ఏయే భావములు సంగ్రహించి ఉత్తమపథానువర్తులమై ఉన్నతపదవిని సాధింపగలమో, వేటి నవలంబించి పరమపురుషార్థదాయకమగు త్రోవను ముందంజ వేయగలమో, వేటిని పూనుకొనియుండుటవల్ల మనుష్యకర్మములు మన కలవడునో, అట్టి భావసంచయము మనచిత్తమున కానందమూ, నైర్మల్యమూ, చేకూర్చి క్రమముగా ఉత్కృష్టలాభము నొంద జేయును. దీనికే సాహిత్య మని పేరు. అట్టి సాహిత్యమే మన కిప్పు డావశ్యకము.

ఒక జాతి సాహిత్యముతో నింకొకజాతి సాహిత్యమున కెట్టి సంబంధము నుండదు. ఒకవేళ ఉన్నా అది నామమాత్రమే. ప్రతిజాతిజ్ఞానమును, ప్రతిసంఘభావభాండారమును భిన్నముగా నుండును. జాతినిబట్టి సాహిత్యము సంఘటితమవును. ఒకజాతి నీచోన్నతుల నెఱుంగవలె నంటే దాని సాహిత్యము చదివితే తెలియును. ఈగతులకూ సాహిత్యమునకూ దృఢమైన సంబంధ ముండును. సాహిత్యగ్రంథముల యందు జాతియొక్క సుఖదుఃఖములు, ఉచ్చతావనతులు మంచిచెడ్డలూ స్పష్టముగా ప్రతిబింబితము లవును. మన జాతీయభావములు నశింపకుండా ఉండవలెనంటే మన జాతీయ సాహిత్యరక్షణ చేయవలయును. జాతీయజీవనమునకు జాతీయ సాహిత్యరక్షణ మత్యంతావశ్యకము.

---




## మొదటి ప్రకరణము.

---

### సాహిత్యాదర్శము

#### ఆర్యసాహిత్యప్రకృతి

ధర్మమే ప్రాణమని యెంచు ఆర్యజాతివారు తమ సాహిత్యమున ధర్మజయఘోషణమే కావించిరి. మహాభారతమున వేదవ్యాసుఁడు పతివ్రతాశిరోమణియగు గాంధారిచే నిట్లు పలికించెను.

"యతో ధర్మస్తతో జయః"

ధర్మముండెడు చోటనే తనరు జయము

ఆమెయే శ్రీకృష్ణుని స్తుతించుచు నిట్లనెను:—

"జయోస్తు పాండుపుత్రాణాం యేషాం పక్షే జనార్దనః"

వాసుదేవుండు తమప్రక్క నరలుగాన

విజయమగు గాతమా పాండవేయులకును *

---

* క. ఎక్కడ ననఘుఁడు సత్యం బెక్కడ ధర్మంబు పరగు నెక్కడ గలుగుం
ఒక్కటి నిలుచుం గృష్ణుం డెక్కడ నతఁడున్న కతన నగు జయ మధిపా॥

..తిక్కన—ఉద్యో॥ పర్వ॥

భగవంతు నాశ్రయించు వారికి జయము తప్పదని ఇందలి సారాంశము. ఇది మాటవరుస కన్నదికాదు, ఇందలి యాథార్థ్యమందరికీ తెలుసును. భారతయుద్ధమున ధర్మపక్షము అనగా భగవదాశ్రితులపక్షమే ప్రబలెను. భారతమున కౌరవపక్షరూపమున మానవులపాపచిత్రము అతివిశదముగా ప్రకటింపబడెను. సాక్షాద్భగవత్స్వరూపుడైన శ్రీకృష్ణు నాశ్రయించి ధర్మాను సారము ప్రవర్తించిన పాండవపక్ష మంతకన్న నెక్కువగా విశదీకరింపబడినది. ఈచిత్రమందలి సముజ్జ్వలప్రభముందు ఆచిత్రమందలి పాపాంధకారము పటాపంచమగును. వెలుగు ముందర చీకటివెలయునా? అందుకే ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమున పాపము భస్మీకృత మాయెను.

వాల్మీకి రచించిన మహాకావ్యము శ్రీమద్రామాయణము భక్తిరసపూరిత మహాసముద్రము. అందున్నా ధర్మమునకే జయము ప్రాప్తించి తద్విజయపతాకము అయోధ్య మొదలు లంకవరకూ ఎగురుచుండెను.

రాక్షసకులము ప్రబలమే కాని భగవద్భక్తిస్రోతమందలి తరళతరంగములలో లీనమయి, శ్రీరాముపక్షమందలి పుణ్యావంతమగు రాజ్యము అయోధ్యనుండి లంకాపురమువరకు ప్రతిష్ఠితమయ్యెను. రాముని రాజ్యపాలనమున హిమాలయము నుండి కన్యాకుమారివరకు లంకాద్వీప మందున్నా పుణ్యము స్థాపింపబడెను. దండకారణ్యమున రాక్షసభయము మాపు మాసెను, ఏమూలనో తపము జేయుచున్న శూద్రుడును

రామచంద్రుని పుణ్యశ్రేష్ఠస్పర్శచే నిష్పాపుడై ముక్తుఁడయ్యెను. *

పౌరాణికము లగు ఈగ్రంథములను వీడి సాహిత్య క్షేత్రమున కవతరింతము. దానికధ్యక్షులగు కాళిదాసు, భవభూతి, మాఘుడు, శ్రీహర్షాదిమహాకవు లందరూ తమగ్రంథము లందు ధర్మసూక్ష్మములనే బోధించి యున్నారు. కాళిదాసు తన అపూర్వరచనా కౌశలమున కుమారసంభవమందు ధర్మమయమగు చిత్రమునే రచించెను—పార్వతి తపమూ హిమవంతుని శివానురాగమూ అసాధ్యసాధనలు కావా? వీటి యుజ్జ్వలాభాసముచే ఆకావ్య మలౌకిక మగుచున్నది. ఇక శకుంతల-భువన విఖ్యాతనాయకి- గూర్చి చెప్పే

* శ్రీమద్రామాయణము మహాభారతమును కేవల ధర్మోపదేశమునకై రచించినగ్రంథములేకావు. వాటియందు రాజనీతి, సాంఘికనీతి, ధర్మనీతి, లోకనీతియు గానవచ్చుచున్నవి. ఇవి కేవల మహాకావ్యములే యనరాదు, యుగయుగాంతరములనాటి సమాదరణీయసామగ్రి అందున్నది కావున వీటిని భారతవర్షేతిహాసము లననొప్పు. పితరులయెడ సంతానమున కుండదగిన అణకువ, సోదరులయెడ జూపదగు ఆత్మత్యాగము, ప్రజలయెడ రాజులగల కర్తవ్యము, భ్రాతృవిరోధమున ఘటిల్లు దుష్పరిణామము, రాజ్యైషణ, అసాధారణాధ్యవసాయము, ఉచితమార్గానుసరణము మొదలగునవి దృష్టాంతసహితముగా కన్పడుచున్నవి. వీటిప్రభావమున వేయిసంవత్సరములక్రిందట భారతవర్షమున ఎట్టిశాంతి నెలకొల్పబడెనో యిప్పటికీ అట్టిశాంతియే పరిఢవిల్లుతూంది. గ్రంథకర్తల ధర్మవిషయికోపదేశము లచ్చటచ్చట పొడగట్టుచుండుటచేత ఇవి కేవల ధర్మోపదేశగ్రంథములని పొరఁబడి యూహింపరాదు.

దేమి? జగన్మోహన మగు ఆనాటకమందు ఋష్యాశ్రమము చిత్రింపబడెను. అందలి పశుపక్షిసముదాయములు శకుంతలయెడ ప్రేమపూరితములాయెను. ఏమి ఆశకుంతల సహృదయత! ఆమెప్రేమ ప్రబలి పతిభక్తిగా పరిణమించి ఆమెను తపస్వినిగా పరిపక్వమొనర్చెను. ఇక దుష్యంతుని ధర్మాసక్తి వీక్షింపుడు. ధర్మమందలి అనురాగముచేతనేకదా తన యెదుటపడి పతిభిక్ష నిమ్మని యాచించిన శకుంతలను ఆతడు ప్రత్యాఖ్యాన మొనర్చెను. అసమలోభనీయుడగు నామెయెడ నిట్టి ఆచరణము అన్యులందు సంభవ మగునా? తరువాత ఆమె వృత్తాంతము జ్ఞప్తికిరాగా ధర్మకాతర దగ్ధహృదయముతో నాతడు పెట్టిన మొర లెవరి హృదయమును కరిగింపజాలవు? ఈధర్మానుతాపమును "చిత్రదర్శన" ♦ అంకమున ఉజ్జ్వలరూపమున కవి రచించెను. ఇంతకన్న ఉజ్జ్వలతరమగు ధర్మానుతాపమును గాంచవలెనన్న భవభూతిరచితమైన ఛాయాదర్శనా * ంకమున లభింపగలదు. అందుశ్రీరాముని భగ్నహృదయము ప్రతిబింబించును. ఇట్టి చిత్రముల నవలోకించినవారు ఆర్యసాహిత్యమును పఠించుటచేత వారి హృదయములు ధర్మానురాగ పరిపూరితము లగునో కావో యించుక తెలియచేయుదురుగాక. మానవహృదయము లెక్కలేని కళంకములచే కలుషిత మయినను ఆర్యసాహిత్యపఠనము

♦ శాకుంతలమున అఱో అంకము.

* ఉత్తరరామచరితమున మూడో అంకము.

కానియందు ధర్మానురాగము నుత్పన్నము జేయకుండునా? ధర్మముదెస ఆహృదయ మించుకేని ప్రసరింపదా? * ఆర్య సాహిత్యాధ్యయన ఫల మెంత సుందరమో, ఎంత ఉత్కృష్టమో,ఎంతశాంతిదాయకమో ఎంతవిశుద్ధమో చూచినారా?

ఆర్యాంగ్లేయ సాహిత్యములు.

ఆంగ్లసాహిత్యమును కాని తదితర ఐరోపీయ సాహిత్యములనుగాని పఠించిన ప్రాప్తించు ఫలమిదేనా? ఆర్యసాహిత్యమునకు శిరోభూషణములై సర్వాంగసౌందర్యమును సమకూర్చు తత్ప్రాణపదములు గౌరవదాయకములూ ధర్మనైతిక సుందరములునగు నున్నతాదర్శములు ఆంగ్లేయ సాహిత్యమున లభించునా? లభింపవు. అందు మానవసంఘముల యొక్కయు మానవవ్యక్తులయొక్కయు చిత్రములు లేకపోలేదు, కాని అవి ఆర్యసాహిత్య చిత్రములవలె ధర్మగౌరవపూర్ణములుకావు. ధర్మగౌరవ మందందు చిత్రింపబడెనేకాని ప్రస్ఫుటితముగాక ప్రచ్ఛన్నముగానున్నది. నిబిడారణ్యమున నేమూలనో కుసుమితమగు మాలతీలత తనసౌరభ్యమును వ్యర్థపరుచు నట్లూ కంటకిత కాననమున సహకారము తన మనోహరతను ప్రకటింపజాలనట్లూ, హింస్రమృగముల భయా

---

*కేవలము ధర్మము దెసకేగాదు, వర్ణాశ్రమమర్యాదవంక కూడా ప్రసరింపగలను. సంయములూ ధీరులూ సచ్చరితులూ అగు పురుషులనూ, దయ. వాత్సల్యముమున్నగు మధుర భావావేశులగు స్త్రీలనూ అనుసరించుకొర్కె, తప్పక చదువరుల హృదయముల నెలకొనును.

నక్షత్రవభాసితమగు వనస్థలిని గండుకోయిల తనమధురగాన మును వినిపించజాలనట్లూ అచ్చటచ్చట విరళముగా వర్ణింప బడిన ధర్మసౌందర్య మాంగ్ల సాహిత్యమున వన్నెకెక్కలేదు, దానిమర్మమువిస్పష్టము కాలేదు.

ప్రకృతి చిత్రకారులమని ఐరోపీయుల కొక అహమిక కలదు. ప్రాచ్యసాహిత్యమున మెచ్చదగు ప్రకృతిచిత్రణమే లేదని వారియూహ. ఆచిత్రణము రెండింటియందును కలదు గాని వాటిలో కొంత భేదమున్నది. ఆంగ్లసాహిత్యమున నగ్నరూపము ధరించిన ప్రకృతిమూర్తి ఆర్యసాహిత్యమున సాలంకృతయగు చున్నది. మానవప్రకృతి యందలి పాశవ ఆసుర ప్రవృత్తులకు ఆంగ్లసాహిత్యమున గౌరవము చెల్లుచుండ ఆర్యసాహిత్యమున దైవికభావములకే గౌరవము కల్గుచున్నది. దైవికప్రవృత్తిసమున్నతిచే మానవజాతికి చెందదగు మాన నీయత ఆర్యచరితములందు వర్ణింపబడుటచేత ఆసౌందర్య ప్రభలలో ఆసుర ప్రవృత్తులు ప్రచ్ఛన్నము లైనవి.

ఆంగ్లేయ సాహిత్యమున నీవిషయమున వైపరీత్యము గానవచ్చుచున్నది. అందు మానవప్రకృతి యందలి పాశవ భావములు, ఇంద్రియ ప్రవృత్తులును ప్రధానవర్ణనీయాంశము లగుటవల్ల దైవభావములు దాగియుండును. విదేశసాహిత్య మున ప్రధానపదమునొందిఆంగ్లజాతికి గర్వోన్నతినాపాదించు షేక్స్పియర్ నాటకవిమర్శనమున ఈవిషయము స్పష్టమగును. ఇతరాంగ్లేయ కావ్యసమాలోచన మనవసరము. ఆనాటకరాజ

ములను పఠించుటచే నెట్టిభావము లుత్పన్నములవునో యిందు వివరింపబడును.

మానవప్రకృతి—షేక్స్పియర్.

పాశ్చాత్య జగమునందలి జనసంఘముల యొక్కయు మానవ వ్యక్తులయొక్కయు ప్రవృత్తులు అద్వితీయప్రతిభతో చిత్రించిన మహాకవి షేక్స్పియర్. అచ్చటి ఆచారవ్యవహార ములు రీతినీతులు మొదలుగాగల విషయములను పురస్కరించు కొని ఆతడు రచించిన సజీవచిత్రములు ప్రశస్తములు, యథా ర్థములు, మనోల్లాఘాటనము ఒగుటచే రూపగ్రహణయంత్రమున (Photographic Camera) తీసిన పటములవలె తోచును. అతని నాటకములందలి పాత్రములన్నియు సజీవములు, అట్టి చిత్రణ మసాధారణశక్తి కలితమనుట అతిశయోక్తికాదు. ఆకవి కీర్తియంతయు వియోగాంతనాటకము (Tragedy)*ల యందు నిక్షిప్తమై యున్నది. అందాతని అలౌకికప్రజ్ఞ విశదము కాగలదు. ఆతడు కేవల చిత్రకారునివలె అనుకారికాక, జాజ్వల్యమాన సృష్టివిభవ సంపన్నుడనికూడా స్పష్టమగును

ఆనాటకములు కావ్యనాటక రసనిష్యందములూ సృష్టి చాతుర్య ప్రదర్శకములూ అగుటచేతనే పాశ్చాత్య సాహిత్య గ్రంథములలో మేలుబంతులై కవికీర్తిస్తంభములై, పృథ్వీతల మున నెల్లకడల నాటుకొనియున్నవి. సంయోగాంతనాటక

---

*ఈపదమున కర్థము దిగువ వ్యక్తీకరింపబడును.

(Comedy) రచనయందున్నూ అతడు సిద్ధహస్తుడే, అంతవాడు ఐరోపీయ కవివరులలో లేడు.

జగద్విదితములు సర్వమాన్యములగు నాతని వియోగాంతనాటకములే విమర్శింతాము. మానవప్రకృతిని చిత్రించుటలో నాతడెంతవరకు కృతకృత్యుడాయెనో, అన్నివిషయముల నాతడు సఫలీకృతుడాయెనో లేదో చర్చింప తలపెట్టలేదు. తత్ప్రకృతి చిత్రణమున నాతడనన్యసామాన్యప్రజ్ఞావంతుడని మొదటనే చెప్పితిమి. ఆతని కౌశలమును ప్రశంసిస్తూ విమర్శకుడొకడిట్లనియె—

O Nature! O Shakespeare! Which
of ye drew from the other?
ప్రకృతిదేవత! షేక్స్పియర్! పలుకరాదా?
ఎవ్వరెవరికి ప్రతిబింబ మిట్టి సృష్టి?

మానవప్రకృతిని తత్తుల్యరూపమున చిత్రించినాడు గాన ఆతని చిత్రములెట్టివో పరిశీలింతాము. ఈప్రకృతి గుణావగుణ సంకలితమని అందరెరుగుదురు. ఇందు పశుత్వమూ, మానుషత్వమూ, దేవత్వమూ అని మూడుప్రవృత్తులున్నవి. ఆహారము, నిద్ర, రోగము, శోకము, కామక్రోధాద్యరివర్గముతో కూడియుండుటచే మానవుడు పశుతుల్యుడు; బుద్ధి, విద్య, వివేచన, మొదలగు శక్తులచే సంపన్నుడగుట నాతనికి మానుషత్వము సిద్ధించెను; దయ, దాక్షిణ్యము, భక్తి మొదలగు గుణవిభూతి గల్గుటచే నాతడు దేవసమానుడవుతున్నాడు. ఈమూడు గుణములు—తమస్సు, రజస్సు, సత్త్వము కలిసి

యుండుట చేతనే మానవప్రకృతి మిశ్రప్రవృత్తి సంఘటిత మయింది.

క్రైస్తవమత సిద్ధాంతములు మానవులయందు పాపాంశ మెక్కువగానున్నదని ఘోషిస్తూన్నవి. "జనసమాజమందు ప్రాయికముగా పాపాంశమెక్కువగానున్నది. శ్రేష్ఠగుణములు తక్కువ, తామసిక రాజసిక ప్రవృత్తులు బలవత్తరములు, అందుచే చాలామంది సిర్మలచరిత్రులుకారు" అని వాటి వాదము. అందుచేత ఆసామాజిక చిత్రములూ వ్యక్తిచిత్ర ములూ రచించు కవులు ఆ రెండు గుణములకూ ప్రాధాన్య మివ్వవలసి ఉంటుంది. అట్లుచేయకున్న ఆచిత్రములు వారి మతధర్మానుసారము తత్తుల్యములు యథార్థములును కానే రవు. కావున ఐరోపీయకవివరేణ్యుల చిత్రములయందు దాయా జాతులయం దెట్టి గుణవిశేషములుండునో వాటియందు రజ స్తమోగుణంబులెట్లు వికాసము చెందెనో తెల్పబడును. షేక్స్ పియర్ రచించిన చిత్రములు ప్రకృతికి యథార్థప్రతిబింబములే ఐనచో పాశ్చాత్యమానవవ్యక్తిప్రకృతియందూ జనసంఘము నందూగల ఆలోకాంధకారములు దోషములున్నూ వాటి వాటి పరిమాణమున ప్రతిబింబితములై యుండితీరును; హెచ్చు తగ్గు లుండనేరవు అనగా యూరోపీయ జనసంఘములందును తల్లోకచరిత్రమందును విశిష్టదోషము లేతీరున నుండునో వాటికి షేక్స్పియర్ రచన ప్రతికృతియై యుండును. ఆ మత సిద్ధాంతముల చొప్పున మానవ ప్రకృతి ఎంతపాపకలితమని

యెంచబడెనో ఆమూలిస్యమూతని రచనయందు గన్పట్టవలెను. కాని అతడు కేవలానుకారికాడనియు సృష్టికర్తయగు మహా కవి యనియు చెప్పియుంటిమికదా, అతని సృష్టియెట్టిదో పరి శీలింతాము.

ప్రాచ్యపాశ్చాత్యకవుల సృష్టిలోని భేదము.

జనసమాజమును తుత్తునియలుగ చేసి పర్యవేక్షణ మొనర్చి దాని ప్రకృతిరూపమును ప్రతిబింబింప సమకట్టువారి కందలి దోషములే ఎక్కువ పొడగట్టును. ప్రపంచమునకు సద్బోధ మొనర్చువారిలో కవి యొకడు, కావున జనసంఘ మందలి వృక్షులదోషభావములను తగ్గించి సత్వగుణమును సంక్రమింపజేయు ప్రక్రియల నిర్ణయించి వాటిని తన బోధనచే జగమున వ్యాపింపజేయువాడే మహాకవి; కావుననే కవులు జగద్గురులని భావింపబడుచున్నారు. ఈయుపా యోపదేశమున ప్రాచ్యులకూ పాశ్చాత్యులకూ చాలాభేదమున్నది. ఆకవుల సృష్టి వారివారిబోధన కనుగుణముగ నుంటుంది, కావున సృష్టి మూలమున బోధనజేయుటలో—"ప్రాచి ప్రాచి, ప్రతీచి ప్రతీచి" అను కవివాక్య మన్వర్థము. పాశ్చాత్యులు సృజించిన తీరున ప్రాచ్యులు సృజింపలేదు. ఒకరు సంఘమందలి రజస్త మోగుణముల నుజ్వలరీతిని గన్పరచి వాటి ఫలములు ఘోర భయానకము లని దృష్టాంతములతో వర్ణింప, ఇంకొకరు సత్వగుణమును సముజ్వల రూపమున చిత్రించి దాని నవలం బించినవారి జీవితము సుఖాగారమౌనని దృష్టాంతములతో

బోధించి మానవమానసముల నావంక కాకర్షింప యత్నిం చిరి. ఒకరు నరకయాతనల సృజించి, అవి నిర్భరములని నిరూ పించి, జనసమూహముల పాపదూరులుగ జేయ సమకట్ట, రెండవవారు స్వర్గసుఖముల సౌందర్యము నభివర్ణించి, సుఖ లిప్సయెడ నందరి దృష్టుల నాకర్షించి ఇహమున పరసుఖము ననుభవింపజేసిరి. పాశ్చాత్యకవిశేఖరు డగు షేక్స్పియర్ నరకమూ దాని యాతనా సృజింప ఆర్యకవిశేఖరులగు వ్యాస వాల్మీకులు పుణ్యావంతము పవిత్రమునగు స్వర్గమును సృజిం చిరి. అసాధారణ కౌశలమున ఇరు తెగలవారూ ఇట్టి సృష్టి చాలాకాలము క్రిందట నొనర్చిరి. అందెవ రెక్కుడు కృత కృత్యులో తత్ఫలాఫలముల వీక్షించినచో నిశ్చయింపవచ్చును. హిందూసంఘమునను యూరోపీయ జనసంఘములయందు నెవ్వరధికతరధర్మశీలురు ఎవ్వరధికతర సాత్వికభావసంపన్నులు —ఎవరు దయ, దాక్షిణ్యము, క్షమ, భక్తి మొదలగు సుగుణో పాసకులు? వారిలో నెవరియందు ధర్మప్రవృత్తి ప్రబల ము?—ఈప్రశ్నలకిచ్చే సమాధానములబట్టి తత్కవుల సృష్టి ఫలాఫలములు చదువరులు నిర్ణయించుకొందురు గాక.

షేక్స్పియర్ సామగ్రి యాతని సృష్టి కనుకూలముగ నున్నది. వియోగాంత నాటకములే ఆతని ప్రధానసాధనసంచ యము. అందలి రచనాప్రణాళి నరకమును సృజించి తద్దుఃఖా గ్నిని యాతనానిచయమును కన్నులకు కట్టునట్లు చేయగలదు. ఆసురసృష్టి కా నాటకము లుపచరించునట్లు దైవీసృష్టి కుపచ

రింపవు. మానవులయందలి ప్రచండ పాశవప్రవృత్తుల ప్రబల రూపమున చెలరేగనిస్తే రక్తపాతము పరిణమించి తీరును, ఈప్రవృత్తులు పెరిగి పెరిగి తుదక మానుష చర్యలగుటకూడా సహాజము. ఈలోకమున వైరమెంత ప్రబలినా ఎక్కడో కాని రక్తపాతమున పరిణమింపదు, అదీ అతివిరళముగా గన్పట్టు చుండును. రక్తపాతమున కనువగు నవస్థలు జనులలో చాలా తక్కువ; జనసంకులములగు ప్రదేశములందుగూడా సాలుకు మూడో నాలుగో హత్యలు జరుగుచుండును. అట్టి బీభత్సకర్మ లకు లోభమో, ద్వేషమో, వైరనిర్యాతనమో, స్త్రీయెడ సందేహాజనిత క్రోధమో కారణమగుచుండును. ఇట్టి లౌకికా వస్థలజూచి షేక్స్పియర్ వియోగాంతనాటకములు రచించెను. * మేక్‌బెత్, ఒథెలో, ఇయాగో, రోమియో, బ్రూటస్, మూడవరిచర్డ్, జూలియట్, మేక్‌బెత్ రాణి మొదలగు అమా నుషపాత్రముల సృష్టించి వియోగాంతనాటకముల నాతడు రచించెను. ఈపాత్రముల యందు యంత్రణ దుఃఖాగ్నియూ కలవు, తద్రచనయం దంతశ్శత్రుప్రాబల్యము మానవప్రకృతిని దాటి అసురసీమకు దాపగును.

శ్లెగెల్ అను జర్మను విమర్శకుడు మేక్‌బెత్ రాణిని "రంపెలాడి" అని నిర్వచించెను; అట్టి సాహసము, కృతఘ్నత నిర్దయా రాక్షసులకు చెల్లునుకాని మానవులందు కానరావు,

* ఇవి షేక్స్పియరు నాటకములలో ముఖ్యపాత్రములు – ఈకథ లన్నియు ఆంధ్రమున ననువదింపబడినవి కావున వానిచదువుట అవశ్యకము.

ఆమె ఒకానొకచోట—"అవసరమైనచో నేను పాలిచ్చి పెంచిన పసిపాపశిరము ముక్కముక్కలుగ చెక్కగల" ననెను. మన భాగవత మందలి పూతన యిట్టిదేకదా! ఆమెకూడ శ్రీకృష్ణుని పాలిచ్చి చంప నుద్యుక్తురాలు కాలేదా? ఇద్దరియందును కృతఘ్నత, ధర్మద్రోహమును సమానమే. ఆసురీప్రేమ పిచ్చియెత్తించ జూలియట్ అనేకవిధముల వాక్యములమున తన అంతరంగమును, యవ్వనలాలసయు రోమియో కెరిగించెను. అదే శ్రీరామునివంటివాని ప్రేమాల కావించెనేని రెండవ శూర్పణఖ అవతరించి యుండును. ఇద్దరికీ అనురాగ భేదము లవమైన కానరాదు. ప్రత్యాఖ్యానమున శూర్పణఖా విధిప్రేరితమున జూలియటూ విఫలమనోరథ లైరి. ఆమె సమరాగ్నిని ప్రజ్వలింపజేయ ఈమె ఆత్మఘాతకావించుకొనెను. సామాన్యకారణముచే ప్రేరితుడైన ఇయాగో చాతురి మానవసీమను దాటి అన్నదాతయు ప్రభువునగు ఒథెలో హస్తములను స్త్రీహత్యాపాపమున పంకిల మొనర్చెను. ఇక మూడవరిచరిత్రెట్లనెను:—

Since I oannot prove a lover .........I am determined to prove a villain.

వలపుజనియింపజేయగ బడుగునాట
అసురగుణముల తప్పకే నభ్యసింతు.

అతని యనంతరచర్య యీవాక్యమును స్థిరపరుచునట్లు కవి వాని నసురునిగా సృజించెను.

ఇట్టి యాసురికాదర్శ మొక షేక్స్పియరు నాటకములందే కాక ఆంగ్లశ్రవ్యకావ్యములకు తలమానికంబన జెల్లు Paradise Lost అను గ్రంథమున మహాకవి మిల్టన్ రచనయందుకూడ రాజిల్లుచున్నది. ఈగ్రంథమున కొంత భాగమేని చదువని ఆంగ్లభాషాభ్యాసకు లుండరు. అట్టివా *రాగ్రంథమును చదివినపిమ్మట సైతాను (Satan) ఆసురిక భీమప్రకృతి వారిహృదయములం దచ్చుపడినట్లు ఇంకొక చిత్రము నాటుకొనజాలదు. ఆకావ్యమున కాతడు నాయకునివలె సర్వశక్తుడై అన్ని కార్యములూ నిర్వహించుచుండును. స్వర్గమర్త్యపాతాళము లాతని కర్మక్షేత్రములు. అతనిబలము కౌశలమును అపరిమేయములై పరమేశ్వరుని సృష్టియందు ఘోరవిప్లవమును జనింపజేసెను. సర్వజ్ఞుడు సర్వశక్తుడని పేరు వడసిన సర్వేశ్వరు డేమూల దాగియున్నాడో ఎఱుగజాలము. సైతానుని ప్రచండవిక్రమము, ఆసురశక్తి, భీషణదేవద్వేషమును కావ్యమందెల్ల ప్రాదుర్భవించును. దేవద్రోహి యగు సైతాను చేతి కీలుబొమ్మలయి, అతని ప్రలోభనమున బడి ఆదము అవ్వయు పాపానురక్తులై తత్ఫలమె ట్లనుభవించిరో, పాపపరిణామ మెంత విషాక్తమో చూపుటకే మిల్టనీరచనకు గడంగెనందురు. ఆకవివరుని మానసమున మానవప్రకృతియం

*ఈమహాకావ్య మత్యద్భుతము, అమితరోచకము; కథ విచిత్రము; ధర్మవ్రతులగు ఆదము అవ్వయూ (Adam-Eve) అందు ప్రధానపాత్రములు; సృష్ట్యాదియందలి మానవవ్యక్తులందు వర్ణింపబడినవంశరు.

జలి తమోమయ మలినభావములు సాక్షాత్కరించిన తెరగు ప్రకటించుట కా కావ్యము నాతడు రచియింప సమకట్టెను. అట్టిచో దేవభావముల నాత డేల చిత్రింపబూనును? ప్రబల మగు నాసురప్రవృత్తిని పెంపొనర్చి నైతికశాసన ప్రభావమును దరిజేరనీయని దుర్దమనీచ ప్రవృత్తియగు పాపమయప్రకృతి నామహాకవి చిత్రించెను.

మహాభారతమున గదాధారియగు నాసురప్రకృతి దుర్యోధనరూపమున నంతట తానైప్రబలి, తన యావేగమున మహాత్ములగు ద్రోణకర్ణులను లోభవాగురులలోని కీడ్చి వారి ప్రతాపమంతయు సమరమున సమయజేసి, నైతికశాసనమును గానీ ఉత్తమపరామర్శమును గానీ చెంతజేరనీయక—గాంధారి, విదుర, భీష్మ, ధృతరాష్ట్రుల హితబోధనను పూరికైన గొనక—కురుపక్షమున దేవద్రోహముచేయ కంకణముగట్టి, కురుక్షేత్రమందు ధర్మవిరుద్ధముగా ఘోరసంగ్రామము కల్పించి పృథ్వీతలమంతయు నెట్లు గడగడలాడించెనో, అట్టి ఆసుర బలమే మిల్టను తనకావ్యమున సైతానురూపమున చిత్రించెను. ఈరెండును బింబప్రతిబింబము లనజెల్లును.

ఆర్యసాహిత్యమున సృష్టిసంపూర్ణత.

పాపపూరితమగు ప్రపంచమును చిత్రించుట ప్రయాసజనకముకాదు. ఎటుజూచినా అదే ప్రత్యక్షము; కనబడు దానిని చిత్రించుట కష్టముకాదు. కావున షేక్స్పియర్ ఇట్టి

చిత్రిముల నచ్చొత్తుటతోనే తృప్తిపొందలేదు. తద్రచన యందు సొంతనేరుపుకానితనము కూడా చూపెను. అతడు చిత్రించిన మేక్‌బెత్ రాణివంటి స్త్రీ అలౌకికపాత్రమే,అనగా పృథ్వియందట్టి వ్యక్తి పొడచూపదు.

ఆర్యకవు లీమార్గమునకు వ్యతిరేకముగా తమరచనను సాగించి ధార్మికులలో అసాధారణ మూర్తులు నిరూపించిరి. ఎల్లెడ బరగుచున్న ధార్మిక మూర్తుల చిత్రించుటవలన ప్రయోజనమేమి అని యడుగవచ్చును; కాని ధార్మికవ్యక్తులంతటా కుప్ప తెప్పలుగా నున్నారని యెంచవద్దు. అదీకాక సాహిత్యమున చిత్రింపబడిన వ్యక్తివిశేషములు స్థిరరూపమున నిల్చిపోవును, కావున కవి వాటియందసామాన్య రూపసమావేశ మొనర్చుచుండును. అట్టి రూపసృష్టి చేయునపుడు సర్వసామాన్య చిత్రిరూపములు మదిలో నుంచుకొనవలయు. ఆర్యకవులు అసామాన్య శరీర సౌష్టవమునకు తిలోత్తమ నాదర్శముగా కల్పించి, బాహ్యసౌందర్యమున నామె యెట్టి అసామాన్య సృష్టియో, అందు కనుగుణముగ మానసికసౌందర్యముగల పాత్రములు కూడా తమ సాహిత్యము నందు చిత్రించిరి. తిలోత్తమవంటి అనుపమ శారీరకరచన షేక్స్పియర్ చేయక పోలేదు. ఆతని యాదర్శములు మిరాండా (Of every creature's best= రత్నము) *రోసలిండ్, పోర్షి

* జాతౌ జాతౌ యదుత్కృష్టం తద్రత్నమితి కథ్యతే
జాతికెల్లను మిన్నయై చనెడుదాని రత్నమందురు........

యోన్; .. కాని తత్త్వ్యల్యమానసిక సౌందర్యాదర్శమును సృజించుటలో నాతడార్యకవివరులకు వెనుకబడెను—అతని మిరాండా శకుంతలకు తీసిపోయినది; రోసలిండ్, హెర్మియోన్, ఇసబెలా, హెలీనాలు అసామాన్య సౌందర్యమూర్తులు కాజాలరు. వియోగాంత నాటకములయం దాతడు తిలోత్తమ వంటిదాని చేయబూని మేక్ బెత్ రాణి వంటి అసురసృష్టి నొనరించెను. రోమియో, ఇయాగో, మేక్ బెత్ రాణి, మూడవ రిచర్డ్ వంటివారు లేకుంటే భయంకరచిత్రసమన్వితములూ రక్తపాతపరిణతములూ అగు నాటకము లెట్లు వెలువడగలవు?

ఆర్యసాహిత్యమునా ఇట్టి భయావహమగు సృష్టి లేక పోలేదు, కాని అట్టివారి కసురులనియే పేరు; వారి వ్యక్తులు మానవేతరములు. ధర్మద్వేషమందును దేవద్రోహమందును వారు సుప్రసిద్ధులు. మిల్టన్ కావ్యమందిట్టి ప్రచండ రాక్షస సృష్టి సైతానొక్కడే కలడు, కాని ఆర్యసాహిత్యము నం దట్టివారు లెక్కలేనంతమందికలరు. వృత్రాసురుడు, హిరణ్యకశిపుడు మొదలగు వారెందరో దేవద్రోహులై అనేకము లగు నుత్పాతముల కాధారభూతులైరి. వారితోకూడా అసురనాశకులగు దేవతలూ గంధర్వులే కాక ఎందరో ధర్మవీరులున్నూ సృజింపబడుటచేత చదువరుల దృష్టి అసురుల వంకకు బోకుండా దేవతలయందే నిలుచును. తుట్టతుదకు ధర్మమునకే జయము తనరుచుండును; అందుచేత ఆర్య సాహిత్యము ధర్మజయమునే ప్రశంసించును.

అంతశ్శైవ్యోన్మాదము, పాపరాక్రమము నూ మూర్తిమంతములగునట్లు రచించుట మహాకవులకు చక్కని రాజమార్గ మగునేని దీనికి తోడుగ జితేంద్రియత్వము, ధర్మవీర్యమును మూర్తిభవింపజేసిన వారిప్రకర్ష వాడిపోవునా? మానవప్రకృతి కొకప్రక్క సముజ్జ్వలరీతిని చిత్రించుట ఉచితమైతే, రెండవప్రక్కకూడా చిత్రించుట అనుచితమగునా? అదీకాక ప్రపంచమును ప్రతిబింబించువల్ల అసురప్రవృత్తి మాత్రమే వ్యక్తీకరించిన లాభమేమి? దానికితోడు పరమేశ్వరుని * అష్టవిభూతుల నమర్చి శోభావంతమగు ఆతని సౌమ్యమూర్తిని కూడా చిత్రించుట యుక్తము—అప్పుడు సమగ్రబ్రహ్మాండమున్నూ జాజ్వల్యమానశోభాయుతము భీషణమునగు మూర్తిద్వయము దాల్చును. ఆర్యసాహిత్యమున నిట్టి సంపూర్ణమూర్తి చిత్రింపబడినది. ప్రకృతికి ప్రక్కనే పురుషుడుండును కావున మూర్తిద్వయము సమానోజ్జ్వలభావమున రాజిల్లుచుండును. శరీరమం దంగ ప్రత్యంగములు తత్తత్సమాన పరిమాణములతో వికాసమానములగుట చూస్తున్నాము. శిరస్సులేని మొండెమును కానీ అంగప్రత్యంగములులేని శిరస్సునుగానీ చిత్రిస్తే ఆప్రతిమ సంపూర్ణమగునా?

షేక్స్పియరున్నూ అసురనాశకధర్మవీరుల చిత్రము

---

* అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశత్వ వశిత్వములు అష్టవిభూతులు.

లను రచించెను. కాని అవి ఉజ్జ్వలరూపమున పెంపొందక పోవడముచేత అసురచిత్రములను మించలేకపోయెను. మేక్‌బెత్‌కు ప్రతిగా మేక్‌డఫ్ బాంకోలున్నారు, కాని వారసమర్థులు- రిచర్డ్, జాగ్ మొదలగువారికి ప్రతియోగులే లేరు. కావున ఆ నాటకములందు ఆసురిక చిత్రములు ప్రబలమై తత్ప్రతియోగి చిత్రములు నడగ ద్రొక్కినవి. *

పుణ్యాదర్శముల ఆవశ్యకత, ఉత్కర్ష—

గర్హ్యమైనపాపమూర్తి తద్భీషణపరిణామమున్నూ ప్రత్యక్షమయ్యేటట్లు రచియించి మానవుల దుర్మార్గదూరుల జేయు నుపాయ ముత్తమము గనుక ఐరోపీయ వియోగ నాటకముల యందలి ఆసురసృష్టిని కొంతవరకూ సమర్థింపవచ్చును. అలాగే కానీ. వాటిమూలమున పాప మెంతవరకు నివారింపబడినదను వాదమును విడిచి వియోగాంతనాటకములు చదివి రంగస్థలముపై వాటిని చూడడమువల్ల మంచి ఫలము చేకూరుననే ఒప్పుకొందాము. అంతమాత్రాన ఏమగును? మానవులను పాపమార్గమునుండి నివృత్తుల జేసినంతమాత్రమున పూర్ణసిద్ధి అయిందా? వారి చిత్తముల యందలి పరమార్థతృష్ణను పరిమార్చ నక్కరలేదా? పార

* ఇది లోకమర్యాదననుసరించి చేసిన సృష్టిగాని లోకోత్తరము కాజాలదు—సర్వసాధారణముగా అధర్మమునకు ధర్మమూ పాపమునకు పుణ్యమూ అసురులకు దివ్యులూ అణగియే యుందురు. పాపజీమూతము ధర్మకాంతి నాచ్ఛాదించును.

మార్థికచింతచేతనే కదా మానవుడు ప్రపంచమును పెద్ద జేయును; అట్టి చింతచేతనేకదా శాంతివృష్టిని కల్పించి అమృతధారల ప్రవహింపజేయును. ఈలాలనేకదా మానవప్రకృతికి ప్రబల మగు నిధానము-దయ, దాక్షిణ్యము, ప్రేమ, స్నేహము, భక్తి మొదలగు వాటి కాటపట్టు మానవాంతఃకరణ మేకదా? దీనిని పరితృప్తి చేయుటయుందే మానవుడెల్లప్పుడును వ్యగ్రుడై యుండును. అట్టివానికి నరకయాతనా ప్రదర్శన మెట్లు లాభకారి కాగలదు? పాపభీతి కల్గినంత మాత్రాన పుణ్యప్రవృత్తి అలవడునా? మానవులయందు ధర్మాసక్తి వెలయింపవద్దా? సద్వృత్తుల తృప్తిచేయు సాధన మేది? ధార్మికాదర్శముల సృష్టింపవద్దా? ఒకపుణ్యాత్ముని పవిత్రచరితమును పఠిస్తే అది మనమానసముల నాకర్షించును, తన్మూలమున పరమానందము కల్గును. ఇట్టి యానందము పాపచరితముల పఠించి తద్భీషణపరిణామములకు భయపడు నప్పుడు కల్గునా? పుణ్యఖనులయొక్కయు మానధనులయొక్కయు ఉదారత, దానవీరుల మహాత్త్వమున్నూ మన మానసముల నలరించి అంతఃకరణముల యందు సత్స్ఫూర్తి పరిఢవిల్లజేయును. ఇట్టి కార్యసిద్ధి యింకొక తెరగున నెటుల్గునా? పాపకంటకములు దూరమునకు త్రోసి పుణ్యబీజములు మానవమానసములయందు నాటుటకు పుణ్యాత్ముల సౌశీల్యమున్నూ ధార్మికుల ఆదర్శోన్నతీ చిత్రించుటే పరమసాధనము.

పాపమూర్తులు పలుమారు చూస్తే మానసము పాపావిల మవునట్లు ధర్మజ్యోతిని పలుమారు చూస్తే పాపము దూరమగుటే కాక మన హృదయములందు పుణ్యము నెలకొనును. ధర్మమూర్తులగు యుధిష్ఠిరశ్రీరాముల చరితములు పలుమారు పరిశీలనము చేస్తే మన మానసము పవిత్రమవుతుంది. అందరియందు నట్టి సౌశీల్య ముండదు. మానవుల చిత్తవృత్తు లెంత పుణ్యమయములై అసాధారణసౌందర్యమున విలసిల్లుచున్నా, శ్రీరామయుధిష్ఠిరుల వృత్తములు వారి కున్నతి చేకూర్చునే కాని అవనతి కల్గింపవు. పుణ్యాత్ముల ఆకర్షణశక్తి, పవిత్రశీలుల సౌందర్యము, ధార్మికుల ప్రభావము, మానవమానసముల నాకర్షింపకయుండ లేవు; కావున అందు కనుకూలమగు తీరున సంఘములను కవులు చక్కజేయపలయును. ప్రకృతిచేతనే మానవులయందు దైవీప్రవృత్తిబీజము లున్నవని చెప్పియుంటిమి. అందుకే అనేక శతాబ్దములక్రిందట ఆర్యసాహిత్యమందు సంచిత మొనర్చిన ధర్మబలము ఇప్పటికిన్నీ హిందూసంఘముల నడిపించుచూ, అందలి పవిత్రప్రవృత్తుల రక్షణ చేయుచూ, అసాధారణ ధార్మికప్రవృత్తుల నతిశయింపజేయుచున్నది. చూచితిరా పుణ్యాదర్శముల ప్రభావము!

సాహిత్యమున అలౌకిక సాధన—

సర్వసాధారణము కానిది అలౌకికము. అసామాన్యములు అలౌకికములు కాకుండుటచేతనే సాధారణమానవుల

జీవితము లూరూ పేరూ లేక నశించును, వారచిరకాలమున మరపు వత్తురు. ఎప్పుడూ కన్నులయెదుట నుండే వాటికి చిత్తాకర్షణశక్తి యులవడదు—"అతిపరిచయమున అవజ్ఞ." అనన్యసమానులు, అద్భుతవ్యక్తులున్నా చిత్తము నాకర్షించి అందు నెలకొని స్మృతిపథమునుండి. త్వరలో తొలగరు. కవుల సృష్టిలోనివా రిట్టివారే, కావున తత్సృష్టి అద్భుతావహ మగును. ఇట్టి అద్భుతవ్యక్తులను చిరస్మరణీయుల చేయడముకోసము కవులు తమ రచనయందు ప్రకృతిసీమను కొంచెము దాటవలసి వచ్చును. అంతట నాచిత్రములకు అలౌకికత అలవడును. మేక్ బెత్ రాణి యిట్టి అలౌకిక చిత్రముల కొక దృష్టాంతము. ఒథెలో, రిచర్డ్, గోనరిల్, జాన్ మొదలగు పాత్రము లన్నియూ ఇట్టివే. ఇట్టి యమానుషకల్పనలు మహాకావ్యములం దావశ్యకములు; అత్యంతాద్భుతములు కాకపోతే అవి చిరస్మరణీయములు కాలేవు.

మిల్టన్ రచించిన సైతానుపాత్ర మత్యంతాద్భుతరసపూరితము కావుననే కల్పనాజగమున సర్వాధికారము చలాయిస్తూన్నది. ఆదము అవ్వల సరళతయు పవిత్రతయు నద్భుతములే. అతడు రచించిన నరకచిత్ర మత్యద్భుతమూ సువిస్తృతమే కాని ఆతని స్వర్గసృష్టికిమాత్ర మాగుణ మబ్బలేదు; అందుకే ఆస్వర్గముకన్న ఆనరకమే చిరస్మరణీయమైంది.

అమానుషిక పాపచిత్రములం దొక దోష ముంది.

మిల్టన్ సైతాను పాత్రమువలె వాటి విశాలత, ఉన్నతి, గాంభీర్యమూ మన హృదయములందు వెరగు విస్మయమును పొడమజేసి అనురాగము సంకురింపజేయుటచేత పూర్ణభావమున దానియెడ రోతపడము. ఎందుకంటే పైనుదహరించిన గుణసమృద్ధిచేత ఆపాత్రమందు లేశమైనా అనురక్తియు, సానుభూతియు ప్రభవింపకతీరవు. దానిని జూచి యెంత రోయుదామనుకొన్నా చిత్త మాదెసకే పారుచుండును. పాపకలిత మని మన మెఱిగినా ఆపాపము మన కగుపడదు. అలౌకికపుణ్యచిత్రముల కీమచ్చయుండదు. పుణ్యచిత్రము స్వాభావికముగా మనోరంజకము, అందద్భుతరసము మేళవించినచో ఫలము ద్విగుణించును. అట్టి చిత్రమును జూచి యానందించువారు అది లౌకికమో అలౌకికమో చర్చింపనేలేరు. తత్పవిత్రాంబుధిపుణ్యవీచికల దూగుచూ, తద్దివ్యకథాసుధారసము గ్రోలుచూ, ఆశ్చర్యవిహ్వలత వారి మానసములు తథ్యమిథ్యావివిక్తిని కోలుపోవును. ముగ్ధుల కట్టి వివేకముండునా? తత్పవిత్రగంగాప్రవాహమున సంశయపంకము తుడుచుకొనిపోవును.

కామక్రోధాదులు పశుప్రవృత్తిబీజము లనియూ దయాదాక్షిణ్యాదులు దైవీప్రవృత్తిబీజము లనియూ చెప్పినాము కదా? మొదటివి చేర్చి రచించిన అద్భుతకల్పన ఆసురము, రెండోవి జేర్చి రచించిన అద్భుతకల్పన దైవీకల్పన. పాశ్చాత్యసాహిత్యమున ఆసురసృష్టి సమృద్ధిగా నున్నందున దాని ఆధి

క్యమువల్ల దైవీకల్పన ప్రచ్ఛన్నమూ మలినమూ ఆయెను. ఆర్య సాహిత్యమున దివ్యప్రకృతియుం దక్రప్రభాచ్ఛలలమధ్య అందలి పాశవప్రకృతి ప్రజ్వరిల్లను. శ్రీరాముని పుణ్యచిత్రప్రభావమున రావణుని పాపచిత్రము పాతుకొనెను; శ్రీరామభరతుల గాథ స్నేహప్రభావమున కైకేయీ మందరల పాపచిత్రములు రూపుమాసినవి. ఆపాపకల్పన శ్రీరామభరతచిత్రములను కౌసల్యాసీతల చిత్రములనూ ఉజ్జ్వలప్రభాభాసమానములుగ జేసి తాను నిబిడాంధకారమున నిలీన మైనది.

శ్రీరామయుధిష్ఠిరులందు అలౌకికధర్మాదర్శము లుండిన లాగున తక్కిన రాఘవులయందునూ పాండవులందునూ అలౌకిక భ్రాతృప్రేమ కద్దు; భృగు పరశు రాములందు అలౌకిక పితృభక్తి కద్దు. పరశురాముడు పితృభక్తి ప్రేరితుడౌటనే కదా తండ్రియాజ్ఞను మన్నించి తల్లి తల ద్రెవ్వనేసెను? ఆమెను తిరిగి జీవింపజేయు సామర్థ్య మాతనియందు లేదు, అట్లు జరుగునను ఆశయు నున్నట్లు తోచదు. ఆతని చరితమును విన్నవారి హృదయములందు పితృభక్తిగౌరవ మినుమడింపదా? కవి యుద్దేశము సఫలము కాలేదా? మహాకావ్యరచనాచాతుర్యము చూపుటకిట్టి ఘటనాసమావేశ మొనర్పవలయును, అట్లు చేయకున్న రసస్ఫూర్తి గాంభీర్యమున్నూ జనింపవు. పితృభక్త్యావేశముననే కదా ఇరువదియొకసారి యాతడు క్షత్రియకులనాశ మొనర్చెను. పితృదేవతలను సుఖపెట్టుటకు భగీరథుడెంత కష్టసాధ్యమైన కార్యమొనర్చినాడు! పంచ

పాండవులు మాతృభక్త్యవతారము లనవచ్చును. అలౌకికపతి భక్తికి నుదాహరణములనేకములుకలవు. సతి, పార్వతి, గాంధారి, ద్రౌపది, సీత, సావిత్రి, కౌసల్య, దమయంతి, అరుంధతియు ఆర్యసాహిత్యమున ఆదర్శపతివ్రతలు. వారి అలౌకిక ప్రేమ పతిభక్తిగా పరిణమించింది. కర్ణుడు, బలి, హరిశ్చంద్రుడును దానవీరులు; శ్రీరాము డలౌకికసత్యపాలకుడు; లక్ష్మణు డసామాన్య బ్రహ్మచారి,

ఇట్టి పవిత్ర ధర్మాదర్శము లొకవంకను అసురప్రతిమ లింకొక వంక ఆర్యసాహిత్యము నలంకరించుచున్నవి; రెండు నలౌకికములే. పాపపథమున నొకవంక పుణ్యోదయ మొకవంక పరిఢవిల్లుచుండ, ద్వివిధసంపదచే ఆసాహిత్యము పాపనివృత్తి నొనర్చుటేకాక పుణ్యపథప్రవృత్తి నాపాదిస్తూ న్నది. ఇంతకన్న ఉన్నతాదర్శములు భావనాతీతములు.

ఇందలి దుర్మార్గ్యమునకు చిన్నదృష్టాంతము నవ లోకింతాము—భీమసేనుని గదాప్రహారమున దుర్యోధను డూరుభంగ మాయెను. దృష్టాద్యుమ్నుల బాణపు దెబ్బలచేత శరీరము రక్తసిక్తమై రారాజు అడవి నొఱలిడుచుండ అశ్వత్థామ చేరవచ్చి, అనునయించి, ప్రభువునకు సంతసము గూర్ప పృథ్వి నపాండవ మొనర్తునని నమ్మించి, ప్రతిన జేసి సేనాధిపతి అయ్యెను. పిమ్మట నిశీథమున పాండవ శిబిరము జొచ్చి ఆత్రమున పాండవులను భ్రాంతిచే ఉపపాండవులైదు గురి కంఠములను కోసెను. అట్టి అసురకార్యనిర్వహణము

విని ఆపాదమస్తకము అడలనివాఁడూ ఆఘోరమ్మునక్కు నేవ గింపనివాఁడూ ఉండునా! దుర్యోధనుఁడుమాత్రము సంతసించెనా? పాండవులు చావరైరికదా అని పల్లటిల్లి ప్రాణములు విడిచెను. కౌరవవీరుల ఈభయానకబీభత్సపైశాచిక ప్రవృత్తిని గాంచి రోఁతపడనివాఁ డెవఁడు? దీని యనంతరసృష్టిని తిలకింపుఁడు—పుత్త్రశోకోపహతచిత్తయై ద్రౌపది కన్నీరు మున్నీరుగా నేడ్చుచుండ ఆదుఃఖమునపనయించి ఆమెకు సంతసము చేకూర్ప "దేవీ, నీపుత్త్రఘాతకుని శిరము ఖండించి నీ కుపాయనముగాఁ గొనివచ్చెదను; ఇదే యీఘోరపాతకమునకు తగిన ప్రతీకారము" అని అర్జునుఁడు ప్రతిన జేసి శ్రీకృష్ణ సహాయుఁడై అశ్వత్థామను కట్టితెచ్చి ద్రౌపది మ్రోల బడవైచెను. పుత్త్రశోకాతురయగు ఆసాధ్వీమణి యీసందర్భమున శ్రీమద్భాగవతమున వ్యాసభట్టారకు డిట్లు వర్ణించెను:— పశువువలె త్రాటం గట్టబడి తానొనర్చిన ఉత్కటపాపమునకు ఫల మిహముననే లభించెఁగదా అని బాలవధజనిత పరమలజ్జాపరాఙ్ముఖుఁడైన అశ్వత్థామకు నమస్కరించి పరమసాధ్వి యిట్లనియె. "నాథా! ఈబ్రాహ్మణకుమారుఁడు గురుతుల్యుఁడు మీరు సాంగధనుర్వేదమూ నిస్తులాస్త్రవిద్యాగూఢమర్మములునూ ఈమహాత్ముని జనకు లగు ద్రోణాచార్యులయొద్ద నభ్యసించి జగదేక శూరులైతిరి కాదె? భగవత్స్వరూపుఁ డగు ఆమహాత్మని కేకపుత్త్రుఁ డీతఁడు—పతివ్రతాతిలక మగు నీతని జనని వీరమాతకృపి యీతని కొఱకు కాదె సహగమన మాచ

రింపలేము. అట్టి లోకోత్తరమగు గురుకులమును పూజించి తత్ప్రతిష్ఠ లోకమున వ్యాపింపజేయుట న్యాయము కాని, దాని కవమానము సంధింపజేయుట మీవంటివారి కర్తవ్యము కాదు. గౌతమపుత్రి సాధ్వీమణియైన మీ గురుపత్నికి పుత్త్రశోకము తెచ్చిపెట్టినానన్నట్టు నాకేల? దాన నాపరితాప మారునా? మనతోగూడ ఆమె పుత్రశోకానలమున మడియనేల? ఇప్పటికే బంధువియోగానలమున సంతప్తము గుచున్న మనకులము గురుకులతిరస్కారశోకదవానలమున దహింపబడ నేల? ఇతడు చిరజీవియై యుండి ఈతని తల్లి నావలె కడుపుదుఃఖమున కమలకుండుఁగాక" అని పల్కి అశ్వత్థామను విడిచిపుచ్చెను.

1. భూసురుఁడవు, బుద్ధిదయా। భాసురుఁడవు; శుద్ధవీరభటసందోహ
ప్రేసరుఁడవు, శిశుమారణ। మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ?
2. ఉద్రేకంబునరారుశస్త్రధరులై। యుద్ధావనిన్ లేరు, కిం
చిద్రోహంబును నీకుఁజేయరు బలో। త్సేకంబుతో చీఁకటిన్
భద్రాకారుల, చిన్నపాపల, రణ। ప్రౌఢక్రియాహీనులన్,
నిద్రాసక్తుల సంహరింప నకటా! నీచేతులెట్లాడెనో?.. ...
3. ద్రోణునితో శిఖింబడక। ద్రోణకుటుంబిని యున్నదింట, న
క్షీణతనూజ శోకవివ। శీకృతయై విలపించుభంగి, నీ
ద్రౌణి చెరల్చి తెచ్చుటకు। దైన్యము నొందుచు నెంతపొక్కెనో,
ప్రాణవిముక్తుడైన నగు। పాపము బ్రాహ్మణహింస మానరే.

పుత్త్రశోకోద్వేగావిలమానస యగు ఆమానినీమణి ధర్మానురక్తి ఎవరిమనము నక్కజపరుపదు? ఇట్టి అలౌకిక సహృదయత, క్షమ, ధర్మప్రీతిగుంఫితచిత్రము అశ్వత్థామ నింద్యచిత్రమును మరుగుపరచి, ఉదారమూ శాంతము నగు

5

రసముచే చిత్తము నార్ద్రీ మొనర్చి, ధర్మానురాగ మంద యింపజేయుటచే ఎట్టి పాపచిత్రమైనా చిత్తమునుండి తొలగి అంతఃకరణమున ధర్మబల ముద్భవించును. అట్టి బలసంపద చేతనేకదా అబలారత్నమగు యాజ్ఞసేని గర్భశత్రువగు అశ్వత్థామను గాంచినతోడనే శోకతాప మార్చుకొనజాలెను.

సాహిత్యమున రసక్షేత్రములు—

వియోగాంత నాటకములగొప్ప భయానక కరుణా రసములం దున్నది; కాని పరిణామము రక్తపాత మయినచో బీభత్సరస ముత్పన్నమై పెచ్చుపెరిగి పైరెండు రసముల నణగ ద్రొక్కి తానే రాజవుతుంది. రక్తపాతము చూచినా, విన్నా, తుదకు స్మరించినా కూడా బీభత్స ముదయించి గుండె తట తటలాడి, తనువెల్ల కంపించి చిత్తము క్షోభజెందును. ఆభావము రూపుమాసేదాకా దయాదాక్షిణ్యములు పొడచూప జాలవు. ఎవరిపైదయ? చంపబడినవానిపై సాధారణముగా దయపుట్టదు. ఒకడు మఱొక పాతకఘాతకుని జంపినచో పురాతనమారకునియెడ జాలిపుట్టక నవీనుడే దయకు పాత్రుడగును. ఎట్లన, పినతండ్రిని హేమ్లెట్ పిల్కుమార్చనే, ఇం దెవరిపై దయ పుట్టును? నిస్సంశయముగా అందరూ చిన్న హేమ్లెట్ నే మెచ్చుకొందురు. మేక్బెత్ ప్రభువు మ్రుందిక పిదప దయకు పాత్రుడవునా? కీచకదుశ్శాసనుల హత్యానంతరము వారియెడ అనుకంప జనించునా? ధార్మికులు నిగ్రహింపబడిననూ నిహతులయిననూ వారియెడ దయపుట్టునో

సహజము—సావిత్రి, సీత, దమయంతి, శకుంతల, ఉత్తర, డెస్‌డెమొనా, కానిస్టెన్స్, ఒఫీలియా, పాండవులు, లియర్ మొదలగువారే ఇందుకు ప్రమాణము. వియోగాంతనాటకముల సంకీర్ణక్షేత్రము పాపపూరిత నరకకుండము; అందు పాపము కాలక్రమమున భయానకమై దుర్నిరీక్ష్యావస్థల బొందుతుంది; దాని చిత్రించుటకు కావలసిన ఉపాయము లన్నియూ అందు సంచితములగును-అటులనే పుణ్యమేయే అవస్థలయం దేలాగు విజృంభించునో చూపడమున కందవకాశము లేదు. లియర్ నాటకమున ఇట్టి రచనకు వీలులేక పోవుటచే నిగృహీతుడైన కథానాయకు డొకడే దయకు పాత్రుడయ్యెను. ఒకవంక కార్డీలియా ఇంకొకవంక నామె అక్కలు-వీరి జీవితవైషమ్యములు నిరూపించుటకే రాజుగారి పాత్రము కల్పించబడింది. శ్రీరామ యుధిష్ఠిరుల చరితము లెట్టి దురవస్థయందున్నా తామరమొగ్గలవలెవికసించి క్రమముగా నూర్ధ్వవహించి ఉన్నతధర్మాదర్శముల కునికిపట్టులై శాంత రసమును ప్రసరింపజేయును. అట్టి ఉపాయసంచయము ఆర్య సాహిత్యాంతర్గత మహాకావ్యములయం దమరింది కాని వియోగాంత నాటక సాహిత్యమున నట్టి దనువుపడదు. దుష్యంతుకు ధర్మానురక్తిని శ్రీరామధర్మతనయుల కోడిపోవును. షేక్స్‌పియరు నాటకములందే కాక ఇతర ఆంగ్లసాహిత్యగ్రంథములందున్నూ ఇది అసంభవ మాయెను. లాటిన్ గ్రీకు సాహిత్యములందు కూడా ఇట్టి చిత్రములు మృగ్య

ములు; అందు శౌర్యవీరుల చిత్రములు కరవుతీర కలవు. ధర్మవీరుల ప్రతిమ లెందునూ కానరావు. శ్రీరామ ధర్మనందనులు మానవ కల్పనాసీమనెల్ల కప్పియున్నారు; ఇంకేది చేర్చుటకూ సూదిముల్లు మోపు చోటైనా లేదు. వారిచరిత మందలి అనల్పకల్పన మానవ హృదయములందు భక్తిశ్రద్ధల పుట్టించి వాటిని శాంతరస ముద్రితముల జేయును.

డెస్డెమోనాపాత్ర మనల్పకృపాపాత్రము; లియర్ తన అవివేకముచే తెచ్చిపెట్టుకొన్న కష్టములు పాషాణ హృదయము నైనా కరిగింపగలవు. పతివియోగమున ఉత్తర వలె సుతవియోగమున కాన్‌స్టెన్సు మనోవైకల్యము చెంది ఊరడిల్లుటకు ఉపాయాంతరము లేనందున పిచ్చియెత్తి తానేడ్చి యితరుల నేడ్పించినది. అంతతో ఆమెపని సరి. వియోగాంత నాటకనీరంధ్రనిబిడాంధకారమున డెస్డెమోనా చిన్న నక్షత్రమువలె మినుకులాడుచున్నది. చండభానుడు కేతుగ్రస్తుడైనప్పుడు దివసమంధకారమయమై మట్టమధ్యాహ్నమున చీకటి గ్రమ్మును. అప్పుడు కొన్ని నక్షత్రములు గగనమున పొడచూపును; డెస్డెమోనా అట్టిచుక్క. నాటకబీభత్సాంధకారమామె స్వచ్ఛజ్యోతి నాచ్ఛాదించినా, దయకించుక తావుంచినది. వియోగాంతనాటకములందిదే వరుస-ధర్మజ్యోతి ఆ నాటకముల పాపాంధకారమున బడి వెలుగుదామని ఎంత యత్నించినా, సముద్రమున బడు వర్షధారలవలె స్వీయనిర్మల రుచిని నిల్పుకొనజాలదు. ఆనాటకములందు ధర్మాభాస

మంశమునే కాని ధర్మవ్యాప్తికి తావుండదు. ఇది ప్రబలెనా నాటకము వియోగాంతము కానేరదు. అట్టి నాటకములందు స్థాయీభావము నొందదగినది భయానకరసము; పరిణామమున నుండదగినది కరుణారసము. ఈ రసోద్రేకములందు ధర్మవికాసమునకు వీలులేదు. ఒకవేళ ధర్మవిన్యాస మొనర్ప యత్నిస్తే వెంటనే శాంతరస మవతరించవలెను, అప్పుడు వియోగాంతమునకు రసభంగము కల్గును. అందుచేతనే వియోగాంతనాటకములు శాంతరసముజోలికి బోవు. శాంతరస ప్రాబల్యము చూడవలెనంటే ఆర్యసాహిత్యమందలి మహాకావ్యములూ నాటకములూ చదువవలయును.

సాహిత్యమున వీరత్వము—

ఆంగ్లవియోగాంతనాటకములలో పాపచిత్రణ మెట్లు ప్రబలెనో, పాపగతి యెట్లౌన్నత్యము వహించెనో, అట్లే ఆర్యసాహిత్యమున ధర్మచిత్రణము ప్రబలి ధర్మగతి యౌన్నత్యము నొందెను. మిల్టనుకృతియందు పాపవీర్యము తద్విజయము ను ప్రకటింపబడినరీతిని ఆర్యకృతులయందు ధర్మవీరత్వము తద్విజయమును ప్రకటింపబడెను. ఆవీరత్వమును పెంపొనర్చుటకు దానితో నింక రెండు తెరగుల వీరత్వము జోడింపబడి వికాసము నొందెను. అందొకటి బలవీరత్వము, రెండవది చాతురీవీరత్వము—భీముని బలవీర్యము ధర్మాధీనము; దుర్యోధనుని దట్లు కాదు. భీము బాహాబలమును మహాశక్తియు దుర్యోధనునందూ కలవు; కావున వారిద్దరూ ప్రతియోగులు.

అర్జునునకు ప్రతియోగి కర్ణుడు; ధృష్టద్యుమ్నుని ప్రతియోగి ద్రోణుడు; కర్ణుని ఆసురవీరత్వమునకు ప్రతియోగి ఘటోత్కచుడు; భీష్మునకు పాండవులందరూ ప్రతియోగులైనలాగున నభిమన్యునికి కురువీరు లందరును ప్రతియోగులు—యుధిష్ఠిరునకు ప్రతియోగి యెవరు? భీమార్జునులవలె దేహబలమున గాని సమరచాతురిని గాని అతడు ప్రధానవీరుడు కాడు. సమరమున రాధేయుని కోడి కాందిశీకుడు కాలేదా! అతని యందు ప్రధానవీరత్వము ధర్మవీరత్వము; ఈవిషయమున భీమార్జును లాతని యెదుట తలవంచుకొనవలయును. కురుపక్షమున ధర్మవీరత్వము భీష్మునియందును విదురునియందును కలదు. పాపపక్షమున నుంటచే వారివీరత్వము ప్రస్ఫుటితమగుటకు పూర్ణావకాశము చిక్కింది. పాండవపక్షమున ధర్మతేజోతిశయము మెండుకొన్నది; ప్రశాంత ధర్మాదర్శమన్న నిదే.

ఇంకొక విలక్షణమగు ఆదర్శము శ్రీకృష్ణుడు. అతని చరితమును విమర్శిస్తే తేలే సారాంశ మిది—పాపపక్షమునందలి బలము కౌశలమూ ఎంతఉన్నా దైవబలకౌశలములకు చాలదు. దైవబలమే సర్వోన్నతమగు బలము, తత్పక్షమే ఉత్కృష్టబలిష్ఠము, మానవపరాక్రమముకన్న దైవపరాక్రమమే దృఢము; అందుచే దైవబలమే సర్వదా విజయమొందును, ధర్మము దైవబలము నాశ్రయించి యుండును. పార్థివబలమునాధారముచేసుకొన్న కురుపక్షముధర్మబలముకూ

దైవబలమునూ నమ్ముకొని యున్న పాండవపక్షమునకు సమకక్షియై నిలువ గలదా? కురుపక్షమున ధర్మవీరులు లేరు; దైవసహాయము లేదు; కనుకనే దానికి సర్వనాశము సంభవించెను.

సాహిత్యమున దేవత్వము—

మహాభారతమునకు నాయకు డెవడు? భీముడా? అర్జునుడా? వారిరువురూ యుధిష్ఠిరుని యధీనమందలివారు కావున నాయకులు కాజాలరు. యుధిష్ఠిరుడా? ఆతడు శ్రీకృష్ణు నధీనమున నుండెడి కావున అతడూ కాజాలడు. శ్రీకృష్ణునే నాయకునిగా నెంచవలయును. విశ్వమున కంతకు అధీశ్వరుడై బ్రహ్మాండమున కెల్ల నాయకుడై, సర్వశక్తుడు, సర్వవ్యాపియు నగు భగవత్స్వరూపుడు శ్రీకృష్ణుడే భారతకథానాయకుడు. అతడు ధనస్సు ధరింపకున్నా అందరి యంతఃకరణములందును, అన్నిచోటులను అతనిశక్తియు కౌశలమును అఖండరూపమున తేజరిల్లు చుండెను. అయుతసంఖ్యాకులు అస్త్రశస్త్రధారులగు వీరులు నిరస్త్రుడగు నాతనికి సాటిరారు. అతని శక్తి కౌశలములకు ఇరువీరుల వీరశిఖామణులు "జితోస్మః" అనవలసినవారే. మహాభారతమున అడుగడుగున ఆతని ప్రభావమున కచ్చెరువు పడుచుందుము. ఇట్టి చిత్ర మాంగ్లసాహిత్యమున లభించునా? కల్ల. మిల్టన్ రచించిన మహాకావ్యమున భగవంతుడు నిర్జీవప్రతిమవలె ఏమూలనో నిమిడి యుండును.

శ్రీమద్రామాయణమున కూడా అట్లే, కాని భేదమిది—అందు వీరత్వములకెల్ల ఆధారభూతుడు శ్రీరాముడే. భీము బలము, విజయు కౌశలము, ధర్మజు ధర్మగౌరవమును శ్రీరామునియందు కేంద్రీకృతము లగుటచే వా రందరికన్న అత డధికుడు. ఈ మూడింటికిని తోడు శ్రీకృష్ణుని ప్రభావ మాతనియందు దేదీప్యమానమై వెలుగుచున్నది. శ్రీరాముని యందు సమష్టిచెందిన శక్తులు వ్యష్టిరూపమున శ్రీకృష్ణపాండవుల చిత్రములందు గాంచనగును. శ్రీరాము డాకావ్యమున సర్వశక్తుడు, సర్వవ్యాపి; అతని బోలు వ్యక్తి యింకొకడందు లేడు. అనంతశక్తి, అసమబలము, అద్వితీయవీర్యము నొక్కచోట కూర్చి శ్రీరాముని పాత్రము చిత్రింపబడి యుండనోపు. త్రివిధవీరత్వము శ్రీరామునియందు ముప్పిరిగొన్నది. చూడుడి- ధనుర్భంగ మొనర్చినపుడును రాక్షసుల దునుమాడునప్పుడును భీమబలము, పరశురామ గర్వభంగమున రావణకుంభకర్ణనిధనమందు విజయకౌశలమును, మొదటినుండి తుదవఱకు ధర్మవీరత్వమును ప్రకటితమగును. రాఘవులందరు ధర్మవీరులే; కాని శ్రీరాముడు వారిలో నాయకమణి. నిండోలగమునుండి నిర్జనాటవులకు బోవునప్పుడు, వనవాసులగు మునుల యార్తి తొలగించునపుడు, సుగ్రీవునితో సఖ్య మొనర్చినపుడు, విభీషణునకు శరణు నొసగునపుడును శ్రీరాముని ధర్మాసక్తి ఈరేడుజగముల కెగబ్రాకును. ఇం దాతని తుల్యుడు ఆర్యసాహిత్యము నెల్ల శోధించినా కానరాడు.

మందోదరి తన పతిని శ్రీరామునితో సంధిచేసుకొమ్మని పలుమారు నిరోధించుటకు హేతు వేమి? శ్రీరాముడు లోకైక వీరుడు గాన అతని బలమునకూ చలమునకూ వెఱచియా? కాదు కాదు. ఆతని యందొక విలక్షణమైన శక్తి అనగా దైవబల మున్నదని ఆమహాసాధ్వి గుర్తించింది. అతనియందట్టి తేజు గాంచి తత్ప్రభావము సాక్షాత్కరించుకొన్నది కావున ఆమె "నాథా! శ్రీరాముడు జననమరణ రహితుడు; సర్వశక్తుడు; సర్వాంతర్యామి; ప్రకృతిప్రవర్తకుడు; సనాతనుడు; పరమపురుషుడును కానోపు. శ్రీవత్సాంకుడు; అక్షరుడు; పరిణామ శూన్యుడు; సత్యపరాక్రముడు, అజయుడు; సర్వలోకేశ్వరుడు; లక్ష్మీపతియు నగు విష్ణువు సమస్తజగత్కళ్యాణ సంధాయి కావున తాను మానవరూపముదాల్చి దేవతల నందరిని వానరుల గమ్మని, భూభారనిర్వహణార్థము మహాబలసంపన్నులు అమిత పరాక్రములు, లోకవిద్రావణులు, త్రిలోక భీకరప్రవృత్తులు నగు మిమ్ము సమూలము నశింపజేయుటకు వచ్చియున్నాడని నాకు *పొడగట్టు చున్నద"ని మొఱపెట్టెను.

శ్రీరాముని చరితము పార్థివదైవబలస్ఫూర్తియుతమగు అద్వితీయ వీరత్వ సంపదచే విలసిల్లుచున్నది. ఆతడపరస్ఫూర్తి యని చెప్పియుంటిమికదా వియోగాంత నాటకము

* శ్రీమద్రామాయణము యుద్ధకాండము 113 అధ్యాయము చూడండి.

**అతని యందన్ని రకముల వీరత్వమూ అన్నివిధముల బలమూ పుంజీభూతమై యున్నది. ఇతర వీరులయందివి కొన్ని మాత్రమే ఉండును.

లం దిట్టి సృష్టి అసంగతము. అవి ధర్మమునకు యథార్థ మగు పదవిని కల్పించనేరవు. ఇరుతెరగుల బలవీర్యము కల్పింపజాలిన మిల్టన్ కూడా ఇట్టి రచన చేయ మొదలు పెట్టి గర్భనిర్భేద మగు అసురసృష్టితో ముగించెను. లాటిన్ గ్రీకు సాహిత్యములందు పార్థివబలము ఆసుర వీర్యమూ కలిపి చేసిన కల్పన లెన్నో యున్నవి; కాని వాల్మీకి రచనవంటి సుందర చిత్రణ మెందున్నూ కానరాదు. ఇట్టి ధర్మాదర్శము లకూ వీరత్వసృష్టికీ దివ్యశోభకూ లీలాక్షేత్రములు రామాయణ మహాభారతములే. ఆమహాసముద్రముల యందలి బిందువులగొని కవులు చిన్న చిన్న గ్రంథములను, పెద్ద పెద్ద కావ్యములను రచించి చదలేటిని భూమిపై ప్రవహింప జేసిరి. ఆప్రవాహమున మున్గినవారు తదమృతరసా స్వాదన మొనర్చి సుఖు లయ్యెదరు. ఆ దివ్యసుధ యింకొక సాహిత్యమున లభింపదు, భారతవర్షమునకది అమూల్యనిధి; తదపూర్వ దివ్య సుందర సృష్టి ననుభవించిన వా రెల్ల తద్గాంభీర్యము పవిత్రతయు గాంచి భ్రాన్తుడుదురు.




## రెండో ప్రకరణము

---

### సాహిత్యమున రక్తపాతము

రక్తపాతమును గురించి ఆలంకారికుల మతము.—

ఆద్యాలంకారికులు కావ్యములను దృశ్యము లనియు శ్రావ్యము లనియు రెండు తరగతులుగా విభజించిరి. ఒకరు పఠించగా వినుటకును స్వయముగా అధ్యయనము చేయుటకును రచింపబడిన కావ్యములు శ్రవ్యములు. కావ్యకల్పన మభినయ రూపమున వ్యవహారమున పరిణమింపజేసి పదిమందియెదుట ప్రదర్శింపవలసినవి దృశ్యములు; కావ్యమునకు రూప మారోపించుటచే వీటికి రూపకములని పేరు పెట్టినారు. సాహిత్యదర్పణకారుడు "వాక్యం రసాత్మకం కావ్యమ్" "రసవంతమైన వాక్యము కావ్యము" అని లక్షణము నిరూపించెను. మానసమున ప్రేమకాని ఆనందము కాని జనింపనేరనిది రసము కాదు. సహృదయుల హృదయ

ములయందు కరుణేత్యాది * స్థాయీభావ విభావములచేత పరిపుష్టినొందిన లోకోత్తరానంద జనకము రసము. కావ్యమునకు రస మాత్మవంటిది. కావ్యమును పఠించునప్పుడున్నూ దాని ప్రదర్శను జూచునప్పుడున్నూ కోవిదుల మానసములందు ఆనందోదయ మగునటుల కవి కావ్యమును రచింపవలయును. ఇది కావ్యమునకు ప్రధానగుణము. ఇది గాక యింకేదైనా ఫల ముండిన నుండ వచ్చును.

"శరీరం తావ దిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ" అనగా

---

* విభావానుభావసంచారీభావములచే స్థాయీభావము వ్యక్తము కాగా రసోత్పత్తి యగును.

భావనను విశిష్టముగా స్పష్టీకరించునది ,,విభావము'', ఇది రెండువిధములు:-ఆలంబనము, ఉద్దీపనము. దేనియాశ్రయమున రస ముదయించునో అది ,,ఆలంబనము.'' దేనివల్ల రసము అతిశయించునో అది ,,ఉద్దీపనము'' రసానుభూతిని కావించుభావము ,,అనుభావము'' సాత్త్వీక, కాయిక, మానసికములని అనుభావము మూడురకములు. రసమున సంచరించుభావము ,,సంచారి'' యగును, స్థిర మగుభావము ,,స్థాయి'' అనబడును. వచ్చుచూ పోవుచుండునవి సంచారిభావములు; ఎప్పటికిని స్థిరముగా నుండునది స్థాయీభావము. రతి (అనురాగము) హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, గ్లాని, ఆశ్చర్యము, నిర్వేదము లని తొమ్మిది స్థాయీభావములు—వీటినుండి శృంగారము, హాస్యము మొదలగు తొమ్మిదిరసములూ క్రమముగా పుట్టును. రసములన్నిటికీ ఉత్పత్తి విభావానుభావసంచారీస్థాయీ భావము లుండితీరును. వీటినిగూర్చి విపులముగా నెఱుగ దలచువారు దశరూపకాది ఆలంకారికగ్రంథముల చూడనగును.

ఏదైనా విశిష్టాభీష్టార్థ ముంచిన పదావళియే కావ్యమునకు శరీరము కాదగునని దండి మహాకవి చెప్పెను. అభీష్టము లేక ఏకార్యమూ మొదలుపెట్టము. ఆయభీష్టము విశిష్ట మైనచో అందుకు తగిన పదచయమును కని కూర్చవలయు నని మహాకవి దండి అనుశాసనము. అభీష్టార్థ మెట్టి దంటే "సహృదహృదయవేద్యోర్థః—" పండితులహృదయము లెరుగదగినది. కావ్యమునకు రెండులక్షణము లుండవలెను—మొదట అది ప్రీతి కలిగింపవలెను; పిమ్మట ఇష్టార్థసిద్ధికి సాధనము కావలయును. ఎవరియిష్టము ? సహృదయులది. సహృదయు లెట్టివారు ? సురుచిసంపన్నులు, కావ్యరసాస్వాదనసమర్థులు; వీరే విద్వాంసులు. ఇందుకే కాళిదాసు—

"ఆపరితోషా ద్విదుషాం నసాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్"

తలప నాను ప్రయోగకౌశలము మంచిదంచుపండితుల్ సంతోషమందువరకు

అని చెప్పెను.

కావ్యము శ్రవ్య మైనా దృశ్య మైనా రసమును పుట్టించవలెను. లోకుల రుచులు భిన్నములు కావున కావ్యముల నేకరీతుల రచింప బడవలయును. శ్రవ్యకావ్యము పఠనమునకు వినుటకును నిర్మింపబడినది, కావున సురుచిసంపాదనమున దానికి కావలసినంత స్వేచ్ఛ కలదు. దృశ్యకావ్యమునం దా స్వాతంత్ర్యము చెల్లుబడికాదు. దృశ్య కావ్య మభినయింపదగినది కావున తన్నాటకమున ఆకావ్యమునకు జీవము పోయవలెను— యుద్ధము, రాజ్యవిప్లవము, కొట్లాట మొదలగునవి శ్రవ్య

కావ్యమునఁ యథేచ్ఛముగా జొన్పవచ్చును, కాని దృశ్య కావ్యములం దట్టివి కూర్చరాదు. రంగస్థలమున కత్తివేట్లు కల్పించినచో చూపఱకు ప్రీతి జనింపదు సరేకదా, ప్రమాదములుకూడా ఘటిల్లవచ్చును. ఇట్లే శ్రవ్యకావ్యములకన్న దృశ్యకావ్యములందు ఎక్కుడు నియమములు పాటింపవలయును.

కేవల పఠనముననే ఆనందజనకమగుదానిని కార్యక్షేత్రమున అభినయిస్తే కథ కన్నులకు కట్టును గాని ఆనందము అంతగా కలుగబోదు, కావున ఆనందోదయమునకు విఘ్నమొనర్చు కార్యముల నాటకకర్త లతిజాగరూకతతో విడువవలయును. శిష్టాచారములకు విరుద్ధములు, సహృదయుల రుచులకు ప్రతికూలములు, లజ్జావహములు నగు కార్యములు నాటకకవులు త్యజింప వలయును. ఇట్టి వాటిని "సాహిత్య దర్పణ" కారు డొకచోట చేర్చెను:—

దూరాధ్వానం వధో యుద్ధం రాజ్యదేశాదివిప్లవః
వివాహో భోజనం శాపోత్సర్గౌ మృత్యూ రతి స్తథా
దంతచ్ఛేద్యం నఖచ్ఛేద్య మన్య ద్వ్రీడాకరంచయత్
శయనాధరపానాది నగరాద్యుపరోధనమ్
స్నానానులేపనేచేభి ర్వర్జితో నాతివిస్తరః॥

ఈశ్లోకములభావము సుగమము కావున నిట విస్తరింప పనిలేదు. ఆర్యాలంకారికులు నాటకములయందు హత్య నిషేధించిరి. రంగస్థలమున అది ప్రదర్శించిన నెవరి కానంద ముదయించును? అంతే కాదు, వెగటుకూడా పుట్టును, కొన్ని

వేళల రోతాయు రోషమూ జనించును. అందుచే నాటకము లోని హాత్యకు తోడు బయటకొట్లాటలు జరుగును. హాత్యా విడంబనము ఉద్వేగజనకము కావడముచేత దానిని కన్నులార గాంచినచో ఎవరు ధైర్యము చిక్కబట్ట గల్గుదురు?

షేక్స్పియరు రచించిన ఒథెలోనాటకమందలి యీ దృశ్యమును పరికింపుడు:-

* డెస్‌డెమొనా.........నాథా, నన్ను వెడల గొట్టుము, చంపవద్దు.

ఒథెలో...............చాల్చాలు—జారిణీ!

డెస్...................రేపు చంపుము, ఈరాత్రి ప్రాణములతో నుండనిమ్ము.

ఒథె...................లేదు. అడ్డుచెప్పితివా—

డెస్...................అరగంటసే పోర్చుము.

ఒథె.......................అంతలో నేమగును? ఇప్పు డాగను.

డెస్. .......................ఒక్క సారి దేవుని ప్రార్థింప నిమ్ము.

ఒథె.......,..............ఇప్పటికే జాగయ్యె........

(నులిమిచంపును.)

---

* Desdemona......O,banish me,my lord, but kill me not.
Othello..............Down, Strumpet !
Desdem..............Kill me tomorrow,let me live tonight.
Othllo...............Nay, if you strive'—

రంగభూమిని రక్తపాతము:—

పై నుదహరించిన దృశ్యము డెస్డెమొనా దోష రహిత అని స్పష్టమైన పిమ్మట ప్రదర్శింపబడును. నిరపరాధిని, సరళస్వభావ, విశుద్ధప్రేమమగ్న, పతిపరాయణయునగు సాధ్వీ తిలకమును సందేహ పిశాచా యతచిత్తుడును, అవిశ్వాసి, మూర్ఖుడు నగు పతి అంతశీఘ్రముగా మాటైనా వినుపించు కొనక ముందువెనుకలారయక గొంతునొక్కి ఘోరహత్య చేయుట సహృదయులు స్థిరచిత్తముతో చూడగలరా? వారి కాతనిపై పట్టరాని కోపము రాదా? మొద్దువలె ఎదుట నిలిచిన మోసకుని జూచి ఊరకుందురా? అతడు ప్రతారితుడౌట నిజము, అసూయచే ఆతని మానసము పొరవడినది; స్త్రీస్వ భావము చపలమౌట నిజము, కాని విచక్షణలేక విలయ మొందింపదగునా? ఎన్నివిధముల సరిపుచ్చుకొన్నా నిరపరాధిని యగు స్త్రీ నిధనము నిర్భరము- ఘోరపాతకియైనా మన కళ్ళయెదుట చంపబడుట చూస్తేనే గుండె చెదరును. ఇక స్త్రీహత్య విషయము వేరే చెప్పవలయునా? పత్ని పాపకలిత యైనచో ఆమెను పరిత్యజించుట న్యాయము. హిందువుల ఆద ర్శములయందును, ప్రకృత సహృదయరుచుల ననుసరించియు హిందూధర్మానుశాసన విధానముననను, వారి సంఘుచట్టముల

---

Desdem..............But half an hour.
Oth...................Being done, there is no pause,
Des....................But while I say one prayer.
Oth...................It is too late. (He smothers her)

ప్రకారమును స్త్రీహత్య, అయోగ్యకర్మగా భావింపబడుచున్నది. అట్టియెడ అమాయిక నిరపరాధిని యగు అబలహత్య అత్యాహితముకాదా! అందుమూలమున మానవహృదయముల కానందము చేకూరదు సరేకదా, మాలిన్యముకూడా సంక్రమించును. అట్టి దృశ్యముల నాటకములందు కూర్చుట పాపహేతువు, కావుననే ఆర్యనాటకకవులు వాటిని బహిష్కరించిరి. *

### హిందువుల ఆదర్శము.

స్త్రీహత్యను రంగస్థలమున ప్రయోగించుట అనర్థదాయకము హిందూధర్మాపేతమని వక్కాణించితిమి. వేలాము వెర్రిచే నాటక కవులు దీని నుపయోగించిరా, రంగస్థలము నర

* ఈయభిప్రాయము బొత్తిగా తోసివేయదగినది కాకున్నా కొంత వఱకు అతిశయోక్తి అనక తీఱదు. ఇప్పటి నాటకములలో నిట్టిదృశ్యములు తరుచుగా గుప్పుచుండుటచేత ప్రేక్షకుల గుండెలు దిట్టబడుచున్నవి. కాలగతి మారుచుండుటచే ఇట్టి దృశ్యములు అనుభవ సిద్ధములగుచున్నవి. అసూయావేశమున కదా ఒథెలో నిదర్శన మేదియు లేక నిరపరాధిని యగు కాంతపై నిందమోపి నిధన మొనర్చెను. ఇట్లే యెన్నో హత్యలు ఇప్పుడూ జరుగుచున్నవి. ఈర్ష్య మానవులకన్ను గప్పి కార్యాకార్య విచక్షణను క్రమక్రమముగా తగ్గించును, కనుక ప్రేక్షకులకు ఒథెలోయెడ కొంత సానుభూతి జనింపవచ్చును. సాత్త్వికచిత్తులకును అస్థిరభావులకు, నిర్బోధులగు బాలకులకు ఇట్టి దృశ్యములు గర్భనిర్భేదకము లనుటకు సందియములేదు. నిరపరాధులు బాముల బడుచుండ జూచి యోర్వలేక తత్కారకుల శిక్షింప ప్రేక్షకులు కొన్నివేళల క్రోధావేశులై రంగస్థలమున కురుకుటయు, ఒకరిద్దరు ఉన్మాదు లగుటకూడా తటస్థించును.

కముగా పరిణమించును. అందువలన శోకము మాలిన్యకలిత మగును. కావున ఆర్య నాటక కర్తలు హత్యాలు విసర్జించిరి. యూరపు దేశమందలి వియోగాంత నాటకము*లవంటి నాటకములు సంస్కృతమున లేవు. హిందూధర్మాదర్శములకు విపరీతము లగుటచే అవి మన సాహిత్యాదర్శమునకు ప్రతికూలములు. అట్టివి మన దేశమున పుట్టకుండుటవల్ల వాటియనర్థములు మనల దాపరించలేదు.

యూరోపీయ వియోగాంతనాటకములఉత్పత్తి, వాటి ప్రకృతి.

మనసంస్కృతనాటకసాహిత్యమందలి ఉచ్చాదర్శములన్నియును మన ధర్మానుసారము అనుమోదనీయములు. అవి మనహృద్భావములతోడను సురుచులతోడనూ చక్కగా మేళవించును. యూరోపీయ సాహిత్యమున నిట్టివి వ్యత్యాసములు. సాహిత్యదర్పణమున నుదహరించిన నిషిద్ధకార్యములను బట్టి మననాటకాదర్శము స్పష్టము కాగలదు.

యూరపుఖండమున ప్రప్రథమమున గ్రీసుదేశమందు

* ఇట వియోగాంతశబ్దము Tragedy అనుశబ్దమునకు పర్యాయపదముగా వాడబడినది, కాని రెండునొకటికావు. వియోగము అనేకవిధముల ఘటిల్ల వచ్చును, Tragedy వాటిలోనొక భంగి. ఉత్తరరామచరితము వియోగాంతమే. కాని Tragedy కాదు Tragedy యందలి వియోగము కొట్లాట రక్తపాతము లేక కాబోదు. ఇవిలేకపోయినా నాటకము వియోగాంతము కావచ్చును కదా; అయినను ఈరెండుశబ్దములు సమానార్థమున వ్యవహరింపబడు చుండుటచేత ఈగ్రంథమునకూడ అవిపర్యాయపదములుగానే వాడబడినవి.

నాటకములు వెలువడినవి. ఆ మాదర్శములనే ఇతర దేశస్థులు తమ రుచుల ననుసరించి పరివర్తనములు చేసి వారివారి ధర్మముల కనుకూలించుకొనిరి. అవి మన ధర్మాదర్శములకు సరిరావు. వాటియందు కూడా రుచివైచిత్ర్యము పొడగట్టు చున్నను తద్రుచులు మనధర్మాదర్శములకు బహిర్భూతము లగుట మనసాహిత్యాదర్శములందు కానరావు. ఆజాతులు రుధిరప్రియములు సహజకఠినములు నగుటచే వారి నాటకములు తదనుగుణముగా నుంటవి.

గ్రీసు దేశేతిహాసము చదివినవారికి స్పార్టానగరనియమము లెంతనిష్ఠురములో తెలియును. ఏథెన్సుపురవాసులు గొప్పగొప్ప నాగరికులయెడ నిర్దయ జూపుచుండిరి — పరమ ధార్మికుడగు సోక్రటీసుకు విషమిచ్చి చంపిరి. ఆదృశ్యము వారి కెంత ఆనందదాయక మాయెనో! క్షమాగుణము మచ్చునకైన వారియందు లేకుండెను. తద్దేశీయనియమము లమితనిర్దయాపూరితములు. అట్టి పరిస్థితులలో వ్రాయబడిన నాటకములు వియోగాంతములు కాకున్న వారికి రుచించునా? లోకులయం దట్టి నిర్మమత్వము నిర్దయయు ప్రబలుచుండే కాలమున వియోగాంతనాటకములు ఉత్పన్నము లగుట వింత కాదు.

ఇక నీనాటకము లనుకరించిన వారిస్వభావము లెట్లుం డెనో కొంచెము విచారింతాము. చాలాకాలము క్రిందట యూరపుఖండమున వేండలు లనీ (Vandals) గాథులు

(Goths) నియూ బర్బరజాతులవారు నివసించుచుండిరి. వా రమిత నిర్దయాస్వాంతులు. అట్టివారిర క్తము ఆధునిక ఐరోపీయజాతులర క్తనాడులలో నిప్పటికీ ప్రవహిస్తూంది. క్రూర కర్మములయెడ ప్రసన్నతవహించుట ఇప్పటికిని కొన్ని ఐరోపీయజాతులవారికి సహజము. స్పార్టనుల నిర్దయాచరణములు రోమీయుల కోలీషియమ్ పోట్లాటలు (Gladiatorial fights) నిందుకు ప్రమాణములు.

మధ్యకాలీ (Middle Ages) నేతిహాసములుకూడా భయంకరర క్తపాతముచే నిండియున్నవి. మతయుద్ధములు* (Crusades) మతాంతహత్యలు * (Inquisition) ను విన్న ఒళ్ళు గగురుపొడుచును. యూదుల (Jews) మూల ముట్టుగా నాశనముచేయు ప్రవృత్తి, భూత వైద్యులకు సోడె గాండ్రకు సత్యాన్వేషణపరులకు శాస్త్రజ్ఞులకు ఐరోపీయులు విధించిన మరణశిక్షలూ ఇంకొకజాతివారియందు కానరావు. ఇంతయేల? ఐర్లాండువృత్తాంతము, ఆంగ్లేయులు, ఫ్రెంచి వారు, స్కాటులును కావించిన అన్యోన్యర క్తపరివాహము

* Crusades అనునవి క్రైస్తవులకు మహమ్మదీయులకు జరిగిన మతయుద్ధములు క్రైస్తవుల పుణ్యభూమియగు జెరూసలెమ్ మహమ్మదీయులవశమునుండి తప్పించుటయే వీటి యుద్దేశము. యూరపుఖండ మందలి ప్రతిదేశస్థులు(నిందు పోరాడి మడియు చుండిరి.

* (Inquisition) అనునది క్రైస్తవులయందలి శాఖలలో నన్యోన్యము కలుగుచుండిన హత్యలు. ఇవి అతిభయంకరములు, హృదయ దారకములు.

లును ప్రబల మైనసాక్ష్యము నిచ్చును. అమెరికాఖండము నాక్రమించుకొన్నప్పుడు స్పెయిను దేశీయు లెంతనీచముగా ప్రవర్తించిరి? ఇవన్నీ పరిశీలించినచో యూరోపీయజాతుల పరిస్థితులు క్రూరోపకరణములచే సంఘటిత మైనవని స్పష్ట మగును. అట్టియెడ కోమలప్రవృత్తులు వారి హృదయములం దుద్భవించు టెట్లు? క్రైస్తవధర్మ మున్నతమైనదే కాని యూరపుఖండమందు అది నిష్ఫల మాయెను, తత్ఖండవాసుల క్రూరత డిందు పరిచి సరళప్రవృత్తుల నాటలేక పోయింది.

'What is bread in the bone cannot come out of the flesh'

"శల్యగత మైన నైజంబు చలితమగునె?"

యూరోపీయ జాతులయందు ప్రకృతిమూలక మైన యీదోషము వారి యితిహాసములనే కాక సాహిత్యమును కూడ కలుషిత మొనర్చింది.

వియోగాంతనాటకములు చదివిన ఫలము.

క్రూరప్రకృతులు రక్తప్రియులు నగు యూరోపీయులు గ్రీకువారి వియోగాంతనాటకముల నమితాదరముతో అను మోదించి అనుకరించిరి. వారి ప్రకృతులకూ రుచులకు తగిన వాటిని వా రామోదించుట అబ్బురమా? వీరి మూలమున ఆంగ్లేయ సాహిత్యమున ఆనాటకములు ప్రవేశించెను. అవి వారి కమితానందదాయకములగుట నిస్తుల ప్రతిభావంతుడగు షేక్స్పియరు కూడా ఆయానందవార్ధి నోలలాడుచు, వాటి

యందలి ఆదరమహిమచే దోషమును పెకలింపజాలక తన రచనాచాతురి నందే ఓతప్రోతము కావించెను. అతని వియోగాంతనాటకములు జనవశీకరణ సామర్థ్యమును సంపాదించి ప్రపంచమున అనుపమగ్రంథము లని కొనియాడబడు చున్నవి. అందరూ ఆమహామహుని ప్రతిభాప్రసూతనాటక రాజము లనే బంగారుకత్తిత్తో గొంతుక కోసుకొన నుద్యమించిరి. ఇప్పటికీ మనలో ననేకులు షేక్స్పియరువంటి కవిసార్వభౌముడు వాటిని రచియించె ననుభక్త్యావేశమున తత్పయోముఖవిషకుంభములయందలి అమృతమును మనసార గ్రోలుచున్నారు. సాహిత్యము సర్వగుణసంపన్నముగనూ, తతశ్శోభాయుతముగనూ, అనంతమాధుర్యకలితముగనూ, కావించిన కాళిదాసు కావ్యములు మనవారికిప్పుడు రుచించుట లేదు, భవభూతి రచించిన అనఘ మగు ఉత్తరరామచరితము ఎక్కడో పాతర వడినది, వ్యాసవాల్మీకిరచితము లగు మహాకావ్యములకు వ్యాప్తియే లేదు. ఆంగ్లవిద్య నభ్యసించువారి కాంగ్లకవిత రుచించుట ఆశ్చర్యమా! షేక్స్పియరు నాటకసమాలోచకులే (Critics) మనకు పథప్రదర్శకు లగుచున్నారు. మన రుచులు వారిపాల బడినవి. విన్నన్న చెప్పినదే వేదము- వారి రుచులే సభ్యములు, వారి అభిప్రాయములే ప్రశంసనీయములు, వారి ఆదర్శములే మన కాదరణీయము లగుటచేత మన జాతీయసుకుమారరుచులు జర్జరితములై అత్యుత్కృష్టాదర్శము లడుగంటు చున్నవి, వాటియందు మనకు గౌరవము క్రమ

ము గా తగ్గు చున్నది- ఆంగ్లసాహిత్యమే ఉత్కృష్టసాహిత్య మనియు, ఆంగ్లకవులే ఉత్తమకవు లనియు, వియోగాంత నాటకములే ప్రశంసార్హములు, పఠనీయగ్రంథము లనీ దృఢవిశ్వాసము మనవారి మానసములు నాటుకొను చున్నది.

మనవారిప్పుడు తరుచుగా షేక్స్పియరు రచించిన ఉత్తమవియోగాంతనాటకచతుష్టయము నాడుచున్నారు. కవులు మన దేశభాషలలో వియోగాంతనాటకములను వ్రాయ మొదలుపెట్టుచున్నారు, అస్త్రశస్త్రములను ఇతర ప్రాణాపాయసాధనములను రంగస్థలమున ఝుళిపించి అనాథ లను అమాయకులను నరుకుచు రక్తపాతమునకు ప్రచారము కల్పించుటే సభ్యత అని యెంచు చున్నారు. అందుచే రంగస్థలములయందు రక్తపిపాస నానాటికి హెచ్చు చున్నది. ఇది ఇంతతో నాగునో, లేక బయటికికూడ దుముకునో విచారణీయము.

అట్లగుటయే సంభవమని స్ఫురించుచున్నది. ఆంగ్ల సాహిత్యమున ఏనాటకము గాని, నవలగాని, కావ్యము గాని కథ గాని చదువగా చదువగా వియోగాంతకార్యములు మనచిత్తముల నాకర్షించును. ప్రతికల్పనమునా రక్తము ప్రవ హించు చుండుటయే యుక్తమని తోచుచుండును. ఎప్పుడూ చిత్త మక్కడే జొత్తిలి యుండడముచేత రక్త మన్న రోత పోవును, పాపభీతి తొలగును; బలహీనులే మనమానసముల

నెలకొని యుందురు, రక్తపాతమును పృథులముగా నొనర్చువారే గౌరవమునకు పాత్రు లగుదురు. మన కాదర్శరూపులు వారే అగుటవల్ల మనముకూడా వారి ననుకరింపవలయునను ఔత్సుక్యము జనించి, కలహము, రక్తపాతము, విజయము అను మార్గత్రయమందే పౌరుష మున్నదనే భావన కలుగును, రక్తపాతమున వెగటు పోయి అనురక్తి జనించును. "క్రొత్త వింత, పాత రోత" అను సామెతప్రకారము ఈ మార్గమే గౌరవనీయ మని యెంచబడును. ప్రాచి క్రమముగా ప్రతీచి అగును.

ఇంకొక విశేషము—పాశ్చాత్యులయం దిప్పుడిప్పుడు రక్తానురక్తి శిథిలమగుచున్నది—ప్రతీచి ప్రాచ్యాదర్శముల గౌరవించుచున్నప్పుడు మనవారియందలి రుచివిప్లవము విపరీతముగానే కనబడు చున్నది.

ఆర్యసాహిత్యమందలి వియోగాంతము రక్తపాతశూన్యము.

ఆర్యసాహిత్యమున వియోగాంతఘటనాసంచయము లేకపోలేదు, కాని అందు రక్తపాతము శూన్యము. యూరపునందలి వియోగాంతనాటకముల రెండవ ప్రధానగుణమైన కరుణారసము ఆర్యసాహిత్యమున గానవచ్చు చున్నది. షేక్స్పియరు రచించిన డెస్‌డెమోనా పాత్రము చూచి ఎంత వ్యథ చెందెదమో సీత, దమయంతి, ద్రౌపది, శకుంతల, మహాశ్వేత మొదలగు పాత్రముల చూచిన అంతకన్న నెక్కువ వ్యధకు భాజనుల మగుదుము; ఐనను డెస్‌డెమోనా

వలె వా రెవరును వధింపబడ లేదు. వాల్మీకి అతి సుందర దృశ్యకల్పనమున సీతను అంతర్ధాన మొనర్చెను. సరళస్వభావ పాపవిదూరయగు డెస్‌డెమోనా నిష్ఠురరూపమున నిహతయై స్వర్గముచేర, సీత వాల్మీకికల్పితవిమానారూఢయై, ఆనందధ్వానములు చెలగుచూ పుష్పవృష్టి గురియుచుండ స్వర్గారోహణ మొనర్చెను. కాని జన్మదుఃఖినియగు సీతా లలామదుఃఖము మనహృదయమున పాదుకొని ఆమెయెడ నిరంతర సానుభూతి పుట్టించుచున్నది.

సీతదుఃఖము చూచి గుండె లవిసి ప్రతిఘట్టమున వాల్మీకితో కన్నీరోడ్చి, ఆమె పూతచరిత అని నిశ్వసించి, తచ్ఛీల మాహాత్మ్యము మన హృదయముల నుద్బోధింప తత్సుగుణపుంజమున పక్షపాతము జనించి, అశోకవనమున ఆమె సజీవయై యుండుట ఎరిగి సరమత్రిజటలతో సంతసించి, వనవాస మామె సల్పునెడ లక్ష్మణునితో విలపించి ఆమె జగన్మోహనమూర్తి మన మనోమందిరముల నెల్ల కాలము అచ్చొత్తియుండుటచే ఆమె గుణములనే ప్రశంసిస్తూ సదా జపించుచుందుము

ఈ విషయమున వ్యాసవాల్మీకులతో షేక్స్పియరు సరిరాడు. అతని కవితయందు మఱపురాని గుణము లనేకము లున్నవి. అతడు మహాకవి, కాని శోకరసమును గూర్చి చర్చించునపుడును, సంతాపము స్థాయీభావముగా నుండదగు పట్టులయందున్నూ కవిత్వముమాట తలప పనిలేదు.

క్కది రసస్వా స్త్రివిషయము; కవిత్వము ప్రత్యేకవిషయము.

సీతవిషయమున చెప్పిన దంతయు దమయంతియెడ కూడ వర్తించును. నిరంతరదుఃఖాక్రాంతలగుటచే వారి పతిభక్తి పరమపవిత్ర మయ్యెను. చిరదుఃఖభాజనములు కావుననే వారు మానవహృదయముల బట్టుకొని యుందురు. నిహతులు కాకున్నా వారి వియోగదశ దుర్నిరీక్ష్యమయి చిరసంతాపకారి యగుటచే వారిని చూచి జాలిపడనివా రుండరు. హత్య లేకయే సంతాపమూ శోకమూ స్థాయీభావమొందు చున్నవి.

హత్యయందు బీభత్స సంచారము.

డెస్‌డెమోనా యెడ జాలిపుట్టదా? ఆమెనుచూడ గుండె లవియవా? ఆహా! తప్పక అట్లేజరుగును; కాని ఈ హత్యాకాండమున నుదయించిన అశ్రుధారలకును సీతావియోగమున ప్రభవించిన కన్నీటికాలువలకున్నూ సామ్యమే లేదు. దీనిగూర్చి ప్రత్యేకచర్చ చేదాము.

షేక్స్పియరు నాటకాళియందు ఇమోజన్, డెస్‌డెమోనావంటి ప్రేమపూరితలూ పతివ్రతలూ అరుదుగానున్నారు. డెస్‌డెమోనా ప్రేమ జూలియట్ ప్రేమవలె హృదయోన్మాది కాక అత్యంత గంభీరము, హృదయపూరితము, శాంతమైనా అది యుగ్రము ప్రబలము నగును—దాని యుద్రేకమున కల్లోలపొరలు కప్పవు; దానిచే నలంకృతయై డెస్‌డెమోనా స్వీయ హృన్మాధుర్యప్రభావమున అందరిమన

షులు నలరించును. అట్టి దొండపండును కాకి ముక్కున గట్టి ఒథెలో చరితమునకు మహత్త్వము తేచలెనని పత్నీఘాత యను కుచక్రమును కవి పన్నెను. పాఠకులు ప్రేక్షకులును ఆ కుచక్రమున దగిలి హత్యావ్యాపారమున మగ్నులవుదురు. నిష్కారణముగా నిర్దయుడగు మూరకుడామెను బలవన్మరణముపాలు జేసెను. ఈవ్యాపారమెంత బీభత్సమో యోచించండి. కవి ఆమెను సృజించిన దట్లు చంపించుటకేనా? ఇట్టి హత్యాకాండమును చూడంజూడ కన్నులు నీరుగ్రమ్మవా? కాయమెల్ల క్రోధవశమున కంపింపదా? డెస్ డెమోనా వధానంతరము ఎమీలియా వధింపబడునప్పుడు ఆకత్తి మనగుండెలో పొడిచి నట్లగును. ఎంత భయానకము! ఏమి బీభత్సము!

వియోగాంతమా, కసాయికొట్టమా?

షేక్స్పియర్ రచించిన మేక్ బెత్ నాటకమున ఇంతకన్న బీభత్సమెక్కువ. అది హత్యతో ప్రారంభించి హత్యతో బెరిగి హత్యతోడనే ముగియును. మొదట డంకన్, నడుమ బాంకో, తుదిని మేక్ బెత్ హతులగుదురు. నాటకమంతా కసాయిఖానా! అందును రాణీమేక్ బెత్ వచ్చి "నాచేతి రక్తము వీడునదికాద"ని చెప్పినప్పటి నుండీ రక్తవృష్టి అతిశయించును. ఇట్టియెడ అక్కడక్కడ అనుతాప తుషారము ప్రారంభించును కాని కాలుచున్న యింటిని కన్నీటితో నార్పతరమా? ఆవీచికలు హత్యాకాండ జనితపృథుల రక్తప్రవాహమున నెచటికో కొట్టుకొని పోవును. బిందెడు విషమున నొక పాల చుక్క!

దారుణమగు హత్యాపరంపరను అనుతాపము మఱుగుపరచ గలదా? క్రొత్తనీరు పాతనీటిని గొనిపోవునట్లు రక్తప్రవాహ సంసర్గమున అనుతాపబాష్పస్రవంతి కలకబారి హత్యాకాండమున కే అంతగౌరవము నాపాదించును. అంతట వ్యాపించి యున్నది హత్య, అచ్చటచ్చట పొడచూపునది అనుతాపము; ఇది అంతరించుట అబ్బురము కాదు. మానవ హృదయముల మచ్చిక చేయుటకు హత్యాకాండము పెట్టు మచ్చుమందు ఆ యనుతాపము!

షేక్స్పియరు ప్రసిద్ధ నాటకములందెల్ల బీభత్సజనకమగు నీహత్యావ్యాపారము ఆవిష్కరించియే యుండి. హేమ్లెట్ నాటకమున తుదియంకము కసాయి కొట్టమే. రిచర్డ్ నాటకములు, జాన్, లియర్, కోరియొలేనస్ ప్రభృతులన్నీ రక్తాక్తాంతములు-జూలియస్ సీజర్ నందలి(Beware the ides of March) అను హెచ్చరిక సీజరు మరణానంతరమున గుండె దిగులువెట్టును. ఈనాటకములందు కరుణరస మేదీ? మేక్బెత్ పేరు విన్నంతోడనే ఇప్పటికీ ఒళ్ళు జలదరించునే! మూడవ రిచర్డ్ నాటకమందు రోత ముమ్మరించును. అది చదివినా రంగస్థలమున చూచినా ఇక వియోగాంతములజోలికి పోరా అనిపించును.

### రక్తపాతము, విదేశీయ రుచులు.

ఖడ్గవ్యాపారము షేక్స్పియరు వియోగాంతము లందే కాక ఆతని సంయోగాంతముల (Comedy) యందుకూడా

కాన్పించును, ‹‹వెనిసువర్తకుడు”(Merchant of Venice) నాటకమందు కత్తిపోటుచేతనే కసియు గౌరవమూ కడతేఱుచుండును. నాటకములు కసాయిఖానాలు చేయుట పాశ్చాత్యుల సనాతన ధర్మమా? అట్లనరాదు. యూరపునందు కూడ శిష్టానుసారము అట్టిపని జుగుప్సాహార్యముకాని ప్రశంసనీయముకాదు. సురుచిసంపన్నుడూ సుప్రసిద్ధుడునగు Addison అను విమర్శకుని అభిప్రాయము వినండి:—

Among all our methods of moving pity or terror, there is none so absurd and barbarous, and which more exposes us to the contempt and ridicule of our neighbours, than that dreadful butchering of one another, which is so frequent upon the English stage. To delight in seeing men stabbed, poisoned, racked, or impaled, is certainly the sign of a cruel temper; and as this is often practised before the British audience, several French critics, who think these are grateful spectacles to us, take occasion from them to represent us as a people that delight in blood. It is indeed very odd to see our stage strewed with carcasses in the last scenes of a tragedy, and to see in the wardrobe of the play-house several daggers, poniards, wheels, bowls for poison and many of the instruments of death."

కరుణయు భయమును కల్గింపవలెనన్న మన కనేక సాధనము లున్నవి. అందు భయానకహత్యాకాండ మొకటి. దానిని మన (ఆంగ్లేయ) రంగస్థలమున తరుచుగా ప్రదర్శించు చున్నారు, కాని అది కడునిష్ఠురము, అసభ్యము. దాని మూలమున ఇరుగు పొరుగు జాతులవారిచే మనము ఘృణితులమై

పరిహాసాస్పదముల మగుచున్నాము. భీషణమగు మానవహత్య, విషప్రయోగము, కారావరోధము, త్వగ్విదారణము మొదలగు దృశ్యముల జూచి సంతసించుట క్రూరప్రకృతి ధర్మము. వాటిని ఆంగ్లప్రేక్షకుల ఎదుట కన్పరచుటచే కొందరు పరానువిమర్శకులు మన వినోదము లిట్టివని యెంచి మనల రక్తప్రియులనీ క్రూరకర్మాభిష్టులనీ గేలిసేయుదురు. వియోగాంతనాటకము ముగియుసరికి రంగస్థలమున పీనుగుల పెంట, నేపథ్యమున కత్తులు, కటారులు, బాకులు, పిస్తోలులు, విషపాత్రలు ఇతర ప్రాణాపహారణోపకరణములును జూచుట రోతగా నుండును."

రంగస్థలమున రక్తపాతము హేయమనియు, అసభ్యమనియూ ఆంగ్లవిమర్శకులే వాకుృచ్చుచున్నారు, కావున హత్యాకాండము ఆనందజనకము కాదనే వారి మతము. నాటకము నవరసాశ్రయము; వియోగాంతనాటకము కరుణ భయానకముల నెక్కువగా నుపయోగించును. భయానక రసపరిణామము హత్యయు రక్తపాతము కానక్కరలేదు; రసస్ఫూర్తి కలుగుటకు రస మానందదాయకము కావద్దా? ఆనంద జనకము కానిచో రసము స్ఫూర్తిచెందడ మెట్లు? తళతళ లాడుచున్న కత్తిని తనువున గ్రుచ్చుటచూచి తనియువారుందురా? దానివలన జుగుప్స ఆవహిల్లునా? లేక సంతసముదయించునా? హత్యాపరంపర అమర్చినచో భయానక రసమునకు భంగము వాటిల్లును. నాటకమును కసాయిఖానాగా

నొనర్చుట వలన రసము పరిపక్వము కాబోదు. అట్టినాటక కృతి హానికరము రసభంగజనకమునై దోషదూషితమగును. కసాయి కర్మ కవిత కాదు. (Butchery is not poetry.)

షేక్స్పియరు నాటకములందు కవిత లేదనరాదు. హత్యచేయకున్న కరుణరసస్ఫూర్తి కానేరదా? అట్లు చేయ నేరని కవులు విభావాది అంగములచే రసపరిపాకము రచింప నేరనివా రన్నమాట. వా రారసము జోలికి పోకుండుటయే శ్రేయము. హత్య నైసర్గికముగా జుగుప్సాజనకము. దానికి కేదీ జోడింపనక్కర లేదు. హత్యయెడ వెగటుపుట్టించడానికి నాట్యసాహిత్యమున దాని నెలకొల్ప యత్నించినచో ఫలము వికటించును. ఒక్కొక్కతరి చాలా హత్యలు జరుగును. యుద్ధములమాట యటుంచి రాజ్యలోభమున ఔరంగజే బొనర్చిన హత్యల స్మరింపుడు. ఒథెలో వంటివా రెందరున్నారు? కవియే ఆతని పెద్దజేసి అస్వాభావికవ్యక్తిగ నొనరించెను. మానవుడు అందు నభిజాతుడగు వీరుడు అంతటి వెంగలివిత్తగునా? ఇది సంశయాస్పదమే. జాన్ నాటకమున హ్యూబర్టు మండుచున్న లోహశలాకను తెచ్చి ఆర్థరు కన్నుల కాల్చుట కుద్యమించిన తోడనే జుగుప్స పుట్టును. కన్ను లట్లు పోకుండుట మేలయ్యె. అనిష్ఠురకర్మ నోరువలేక పాప మా రాజపుత్త్రుడు కారాగారకుడ్యమునుండి దుమికి కాలధర్మము నొందెను. అట్టి ఆత్మహత్య మానవహృదయముల వేధింపదా? అబీభత్స దృశ్యములగు ఫలమేమి? రాజ్య

లోభము గహార్హ్యపాపమని చిత్రించుటకే కదా అవి యవత రించెను. అట్లు పాపగహార్హ్యలగు వారెందరుందురు? అట్టి రాజ్యలోభము నరికట్ట జాలువా రెవరు? అట్టి అసాధారణ వ్యక్తుల చరిత మందరికళ్ళయెదుట కట్టుటవల్ల ప్రయోజన మేమి? నాటక మితిహాసమా? ఇతిహాససౌభాగ్యము ఇతిహాస మున నుండనీ, నాటకములలో దానిని దూర్చుడ మెందుకు?

హత్యలేకుండానే వియోగాంతముల రచించిన పట్టుల షేక్స్పియరు తప్పక ప్రశంసార్హుడు. అతని నాటకము లలో కొన్ని వియోగాంతములయ్యు సంయోగాంతములనే వాడబడుచున్నవి. కాని వాటిని వియోగాంతములుగా గణిం చుటయే శ్రేయము. ఇమోజిన్ సీతాదమయంతులవలె ఘోర కష్టములపాలు కాలేదు, అందుచే వారితో సమగౌరవమునకు పాత్రము కాజాలదు. సింబెలీన్ నాటకము వియోగాంతమై ఇమోజిన్ లియోనిటసులకు సమాగమము ప్రాప్తించెనా, ఆమెను జూచి యందరు క్షోభచెంది యుందురు. సీతారాము లకు సమాగమము లేనందుచేతనే వారి వనవాసమూ వియో గమూ అధిక కరుణాస్ఫూర్తములయ్యెను. సీత పుట్టిల్లు చేరి నచో ఆమెయెడ ఇప్పటి జాలిపుట్టునా? ఆమె వనవాసము కావ్యమందలి కరుణను కడ్డముట్ట జేసింది. ఆరసము స్థాయీ భావము నొందుటచేతనే ఉత్తరరామచరిత్రకు విశిష్టగౌరవము ప్రాప్తించింది. ఛాయాంకమున నిది ప్రకటితమగును. వియో

గము చేత కరుణ జనించును; హాత్యావళిచేతనో, బీభత్స ముత్పన్నమై కరుణను కమర్చును. డెస్‌డెమోనా తలపునకు రాగానే జాలిపుట్టును గాని, ఆమెహత్య తలంచినతోడనే వెగటు పుట్టి కరుణారసమునకు భంగము కలుగును.

హొరెస (Horace)ను గ్రీకు విమర్శకుడు "రంగస్థలమందు ప్రకాశముగా హాత్యాదికముల ప్రదర్శించుట తప్పు? గాని అప్రకాశముగా కల్పించిన దోషముండదని" వచించెను. ఇది "గుడ్డిలో మెల్ల" అని యెంచరాదు. హత్య అను మాట వినగానే మనసులో దడబుట్టును. గొప్పగొప్ప పట్టణములలో జరిగెడు హత్యల నందరము కళ్ళతో చూచినామా? వినుకలిమాత్రమున నవి కండ్లకు గట్టినట్లు తోచవా? కల్పనా మాత్రముననే అదృశ్యములు ప్రత్యక్షములుకావా? బాల హత్య, స్త్రీహత్య, స్వామిహత్య, పితృహత్య, మాతృహత్య అన్న మాటలు వినగానే ఒళ్ళు జలదరించి ఆహత్యాకాండము మనయెదుట జరుగునట్లుండును-కావున హత్య అన్న మాటయే నాటకములనుండి బహిష్కరించుట మేలు; అదిప్రత్యక్షమైనను పరోక్షమైనను రసభంగము కాకతీరదు. అందున్నూ అనాథల, అమాయికుల, సద్గుణశీలుర హత్యల మాట చెప్పవలయునా? గ్రీకు సాహిత్యమీామువ్వాను సృజింప ఇతర యిరోపీయ సాహిత్యములు దానికి దోహద మొనర్చినవి; ఆ విషవృక్షఫలములన్నియూ కురుచి భరితములు, జన సామాన్యమందలి సుకుచు లందు చేరజాలవు; ఆ ఫలములు

దోషకలితములని యెరిగియు భారతీయకవులు వాటినే ఆదరించుచూ తమసాహిత్యము పేరుప్రతిష్ఠల విడనాడదగునా? ఇతర సాహిత్యముల ననుకరింపవచ్చును, కాని తద్దోషముల పరిహరింపవలదా? ఆర్యసాహిత్యము చూడండి-దానియందిట్టి దోషము కానరాదే! స్వదేశీయమైన అనర్ఘ రత్న భాండారమును అధఃకరించి అవలక్షణరేఖాసమన్వితములగు విదేశీయమణులవిడంబింపనేల? తన్మూలమున మన సాహిత్యమునకు ఇంటావంటాలేని దోష మావహింప జేయనేల,

వియోగాంత నాటకముల దుష్పరిణామము.

ఆంగ్లవిద్యాభ్యాసకుల మనముల నలరించు కవి షేక్స్పియర్. అతని నాటకములలో వియోగాంతములే మిన్నలు, వాటిని చదివిన జనసంఖ్య తక్కిన నాటకములకు లభింపదు-కళాశాలలలో నున్నపుడే యువకుల రుచులు వాటిచే కలుషితములగును. పరీక్షలలో కడతేరని విద్యార్థుల దృష్టి సాధారణముగా ఆత్మహత్యదెసకు బోవును. కాలక్రమమున దానియెడ వెగటు తగ్గుటచే అది పాపమనే తోచదు. షేక్స్పియరు గ్రంథములయందు ఆత్మహత్య మహాపాపమని ఎచ్చటను విశదముగా వివరింపబడలేదు, సరేకదా అది గౌరవదాయకమనియే ప్రశంసింపబడినది. * భగ్నకృషులు

* కొన్నిచోట్ల ఆత్మహత్య ఆచరింపగూడదని లేకపోలేదు, అది మాటవరుస కన్న దేకాని సేనామంది ఆత్మగౌరవము నిలుపబెట్టుటకు ఆత్మహత్య అవలీల గావించినారు.

కావింపవలసినది ఆత్మహత్యయని ఆనాటకములు దృష్టాంతీ కరించును. ఇది కన్నవారికీ విన్నవాళ్ళకూ అత్మహత్యయం దాదరము కల్గుట ఆశ్చర్యముకాదు. ఆత్మహత్య అనర్హ మని ఆర్యసాహిత్యము పలుమా రుపదేశించును. ఇట్టి సంప్ర దాయమునకు విపరీతములు ప్రతికూలములు నగు బోధన లాంగ్లసాహిత్యమందు కలవని నానమ్మకము.

ఆంగ్ల సాహిత్యమందలి పక్షపాతము.

ఆంగ్ల సాహిత్యమందలి అభిమానముచే అది చెడ్డదన్న మాట మనవారు పెడచెవిని పెట్టుచున్నారు. నింద్యమగు దానిని నిందిస్తే సైపజాలక, అట్టి నింద్యవిషయములు ఆర్య సాహిత్యమున నేమూలనైనా ఉన్నవేమో అని ప్రయాసపడి వెదకుతారు. మన సాహిత్యమునం దట్టి దోషము లున్నవను కొన్నా, అంతమాత్రమున ఆంగ్లసాహిత్యమందలి ఆదోష ములు పరిహారింపబడునా?, తనకంటిలో పువ్వున్నవాడు ఎదుటి వాని కంటిలోని కాయనుచూపినంతనే తనలోపమునుండి తప్పుకొనజాలునా? హాలధరునియందు దోషము నెంచినంత మాత్రాన జలధరుని యందలిదోషము తగ్గునా? "వెనిసు వర్తకుడను" నాటకములోని ఛురికావ్యాపారము దోషకలిత మన్నతోడనే మహాశయు డొకడు రామాయణములోని అగ్నిప్రవేశము దోషముకాదా అని ఆక్షేపించెను. అగ్ని పరీక్ష కేవలపరీక్షయే- ఆయగ్నిచ్ఛటల సీత భస్మీభూత కాలేదు. ఏనాటకమందైన నాయకుడోనాయికో నిప్పులోబడి

నీరయితే, అట్టి పరీక్ష భయప్రదమై పైనుదహరించిన ఛురికా వ్యవహారము వలె బీభత్సావహముగ నుండియుండును. భారతమున లాక్షాగృహ దహనము లేదా అని యడుగవచ్చును. ఉంది, కాని అదిపరిహాసన ప్రాయము- ఖాండవదహనముంది, కాని అది రాజ్యమున శాంతి నెలకొల్పుటకు నిర్మింప బడింది. ఇందేదీ నాటకమందు కానరాదు. శ్రవ్యకావ్యములలో నిట్టివుండుట దోషము కాదు. పురాణేతిహాసములలో ఎన్నియో అద్భుత వ్యాపారములు కల్పింపబడియుండును. ఇది సాహిత్యమునకు లోపముకాదు. నాటకములయందవి ఉండగూడదు.

నాటక పర్యవసానము—

ఆంగ్ల సాహిత్యమందలి హత్యాకాండము సమర్థింపబూని అవి స్వాభావికములని వాదించేవారు సీతాస్వర్గారోహణము అస్వాభావికమనియు అద్భుతమనియు ఎట్లువాదింతురో? వియోగాంత నాటకము లందలి ఘోరహత్యాకాండము కన్నులార జూచి యూరకుండుట స్వాభావికమని అనలేము. మనుష్యులయందు పాపము స్వాభావికమే, కాని యిట్టి హత్యాకాండము ఎట్టిపాపశైలశిఖరమును కూడా ముంచును. హత్యకన్న నీచతరమును గర్హ్యము నగు పాపమింకొకటి కలదా? ఇట్టి అస్వాభావికవ్యాపారముల నాటకములలో జొన్పుటకు ఆవశ్యకత యేమి? నాటకకళాకాశలమందమా? సీతాస్వర్గారోహణము, పాతాళ ప్రవేశము

శ్రీరాముడు సరయూనదిలో నంతర్ధానమగుట, పాండవులు హిమాలయమున నంతరించుట మొదలగు కల్పనల మూలమున ఆర్యకవులు హత్యల బహిష్కరించిరి. హత్యలవలన పాత్రములు అంత మొందించుట కంటె యీ తెరగున వాటి నపసరింపజేయుట నూరుమడుగులు మేలుగదా! హత్యలచేత పాత్రాపసరణము చేయుటే నాటక కౌశలమా? ఉపాయాంతర మేమియు కానరాదా? ఆర్యసాహిత్యమందలి స్వర్గారోహణాదులు కల్పించుటయు కౌశలమే. "మధురేణ సమాపయేత్" అను కావ్యసూత్రము ననుసరించి అట్టికల్పన చేయబడెను. హత్యాసంచయముతోనే గ్రంథసమాప్తియైతే పరిణామము బీభత్సము కాకతీరదు. అట్టిపర్యవసాన మతినింద్యము కావుననే ఆర్యకవులు దానిని వర్జించినారు.

"హత్యాకాండ మంతయు రాదు, ఆవశ్యకమగు చోటనే అవతరించును. డెస్‌డెమోనాహత్య అవశ్యంభావి వ్యాపారము, ఒథెలో కథాంతర్గతము, అదిలేకున్న ఆతని పాత్ర పోషింపబడదు. ఘటనాక్రమమున ఆనాటక మట్లే పరిణమించవలయున"ని కొందరి అభిప్రాయము. తథాస్తు, కాని ఇది "విషయనిర్వాచన" మను దోషమని యెంచననును. ఘటనాచక్రమును పరివర్తనము చేయనేరని కవిప్రతిభ ప్రశంసనీయముకాదు. షేక్స్పియరు ప్రతిభ అట్టిదనుట సాహసమందురా? ఆతనిప్రతిభ ఇట్లు మొక్కపోవుటకు ఆతని రుచిదోషమే హేతువు. హత్యాకాండము ఆనందదాయకమని

యెంచే రుచి సురుచి కానేరదు. కృష్ణకాయునొకని నిర్దయుని గనూ పామరునిగనూ చిత్రించి శ్వేతముఖుడు పరమానంద భరితుడాయెను. ఇందు షేక్స్పియరొక్కడే దోషి కాడు, ఆతని సమకాలీనులందరూ అట్టి రసికులే. ఇప్పటికినీ అట్టి రోచకులు మనలో లేకపోలేదు. ఈరుచి గిట్టని వారప్పుడూ ఉండియుందురు, కాని వారిమాటల పాటించువారెవరు? ప్రతిభావంతులు పరోపదేశమును పాటింతురా!

ఆర్యనాటకములలో వేణీసంహారమునకీ "విషయనిర్వాచన" దోషమే పట్టింది. భీముడు "ప్రల్లదు దుస్ససేను రుధిరంబు నురంబునువచ్చి త్రావు" చున్నానన్నప్పుడును, "పెళ్ళుమనన్ సుయోధనుని పెందొడలన్ గదనుగ్గుచేసి" తద్రక్తాక్తములగు చేతులతో "పరక్షస్సునుగాను" అంటూరంగస్థలమున ప్రవేశించి అతడు ద్రౌపదీ వేణీసంహార మొనర్చునప్పుడున్నూ ఈదోషముండని ఒప్పుకొనవలయును.

1\. తల్లడ మంద కౌరవశతంబును పట్టి అనిన్మథింపనా?
ప్రల్లదు దుస్ససేను రుధిరంబు నురంబును వ్రచ్చిత్రావనా?
పెళ్ళుమనన్ సుయోధనుని పెందొడలన్ గద నుగ్గు సేయనా?

..................................

2\. ఏరక్షస్సునుగాను భూతమునుగా నేలామ్ము తేభార్యవి
స్తారాంగంబులక్రింద దాగ? హతశేషక్ష్మాపులారా! ద్విష
చ్ఛారీరక్షతజాభిషిక్తతనుడన్ సంలంఘితోరు ప్రతి
జ్ఞార్ణవ్యాకరుడైన క్షత్రియుడనే శంకింప మీ కేటికిన్.

పార్సీనాటకసంఘములు—వారి రంగస్థలస్థితి;

పార్సీనాటకసంఘముల మూలమున మన దేశమున వియోగాంతనాటకముల కెక్కువప్రచారము కల్గింది. వారా నాటకముల ప్రదర్శింప వేనవేలుప్రజ లతికుతూహల మున చూచి సంతసిస్తారు. నాటకములు చదివేటప్పటికన్న రంగస్థలముల యందు చూచేటప్పుడు కురుచులు జనుల మన ములందు చక్కగా కుదుకు పడతవి. మనవారిప్పటి నూతన సారస్వతోజ్జీవనమున రచించు నాటకములయందు, నవలల యందు, అపరాధపరిశోధక కథలయందునూ విప్రయోగ ములు, హత్యలు యధేచ్ఛముగా గుప్పుతూన్నారు. వియో గాంత నాటకము లంతగా మనలో ప్రబలలేదు. అది కొంత మేలు. వాటిప్రభావవీచిక లంతటా వీచుచుండుటచే గ్రంథ ములయందు ఆత్మహత్యలు, పరహత్యలు నవిరళముగా పరిఢ విల్లుచున్నవి, వాటియెడ వెగటు తగ్గుచున్నది. ధర్మభీరుత, పాప భీతియు పాడుపడుతున్నవి. పురుషులయందేకాక స్త్రీలయందు కూడా కురుచులువ్యాపిస్తూన్నవి. *నాటకదర్శన కౌతూహలము నానాటికి హెచ్చి, విదేశీయాదర్శము లాబాలగోపాలము ఆమో దనీయము లవుటవల్ల ఇతరభాషలయందును, సాహిత్యముల యందును ప్రబలియున్న కురుచులు మనభాషలయందు

* ఇప్పుడిప్పుడు సినిమాలు ఊరి కొకటిచొప్పున వ్యాపిస్తూన్నవి. వాటిలోనూ హత్యలు పరిపాటే, ఆదర్శములు అవనతములు, రుచుల నాగరకములునై ప్రేక్షకుల మనస్సులందు విషబీజములను నాటుతూన్నవి.

కూడా ప్రవేసిస్తూన్నవి. ఇంటింటా పిన్నలు పెద్దలు వాటినే ప్రశంసిస్తున్నారు.

మహాభారత రామాయణములు చదివిన ఫలము.

ఆంగ్లసాహిత్య పక్షపాతులు ఆర్యసాహిత్యమున మాత్రము హత్యలు మొదలగు హానికరములగు కృత్యములు లేవా అని యందురేమో? లేకేమి? పుష్కలముగా నున్నవి. కురుక్షేత్రసంగ్రామమున, రామరావణయుద్ధమున, ఉపపాండవుల వధయందు, శిబికర్ణదధీచుల దానములయందున్నూ హత్యలు రక్తపాతములును కలవు, కాని మన దృశ్యకావ్యములం దట్టివి కానరావు. శ్రావ్యములకూ దృశ్యములకూ ఈవిషయమున చాలాభేదమున్నది. ఇట్టిదృశ్యము లార్యదృశ్యకావ్యములలో లేకుండుటచే కుకుచిప్రచార మార్యసాహిత్యాదర్శమున లేదని చెప్పవచ్చును.

రామాయణ మహాభారతములు పఠించుటవల్ల ఫలమత్యంత శుభావహము. ప్రకృతమున మనసంఘమున ప్రబలియున్న ధర్మప్రభావము ఈగ్రంథములు చదువుటవలన కలిగిందని నిశ్చయించవచ్చును. ఈ రెండుగ్రంథముల జీవరూపమగు ధర్మతేజము ధర్మబలమున్నూ మనసంఘమునకు మహాలాధారములై బరగుచున్నవి. దానవీరులు పుత్త్రిబలి నొసగడము జూచునపుడు మన మానసములను ధర్మప్రభావమావేశించి తదితరభావముల డిందుపరచును. వారి దానవీర్యము ధర్మాసక్తియు మనల భక్తిపరవశుల జేయును.

ధర్మానురక్తిచే సర్వము త్యజించువారికి పుత్త్రబలి లెక్కా? ఆ బలిమూలమున త్యాగమందు గౌరవము, ధర్మభావమును పరిపూర్ణత నొందడమే గాక మన కావీరులయెడ సానుభూతి జనించి వారివలెనే ధర్మాసక్తి విషయపరాఙ్ముఖతయూ మన హృదయముల పుట్టుకొనును. అట్టియెడ పుత్త్రబలి ఘోరికైన సాటికాదు.

ఆర్యధర్మానురక్తి కేవల ఋషిచరితములందే కాక క్షాత్త్రవీరులందున్నూ కనబడును; పురాణములు చదివిన ఈవిషయము విశదమగును. కౌరవపక్షమున సమరావేశుడై యుండుతరినికూడా కర్ణుడు దానవీరుడు కావున ధర్మపాలనమున అకుంఠితుడై, అమోఘములగు తన కవచకుండలములను ప్రతివీరపక్షపాతియు వంచకుడునగు ఇంద్రునకిచ్చెను. ఇది విన్నవారికి ధార్మికోత్తేజనము కల్గదా? ధర్మానురక్తి అతిశయింపదా? దీనిమూలమున మానవప్రకృతి దోషాయత్త మగునా? లేక ఉన్నతధర్మాసక్త మగునా? ధర్మమునకును దానవీర్యమునకును మానవుడు సర్వస్వపరిత్యాగమొనర్పవలయు నను విధి నిర్ధారితము కాలేదా?

ఇక ఉపపాండవుల హత్య—ఇది దుర్యోధనుని అసుర ప్రకృతియందు జనించిన పాపవ్యాపారము. ఇది ఘోరమనియు తామసికమనియు వ్యాసుడే వ్యక్తీకరించెను. ఈఘటనను పరివర్తన మొనర్చి పాపసమ్మార్జనము చేసి శిక్షాప్రదమగునట్లు కొందరు కావించిరి. అత్రమున జరిగెను కదా

అని దుర్యోధనుడుకూడా పశ్చాత్తప్తుడాయెను. యుద్ధసమయములందు మోసము, వంచన, భ్రాంతి మొదలగువాటిచే చోదితములగు కృత్యములు ఎన్నో జరుగుచుండును. అంతః కలహము లాపజ్జనకములని చూపుటకు కవులిట్టి ఘోరకర్మల కల్పింతురు. మహాభారతము ఇతిహాసము (history) ని యెంచేవారి కివి అసంబద్ధములని తోచదు. అది యొకకావ్యమని యెంచేవాళ్ళకే. ఇట్టి కార్యపరంపర భయంకరవ్యాపారమని తట్టును. జ్ఞాతివిరోధమున భయంకరపరిణామము చేకూడుతుందని వారు తెలుసుకొందురు.

భారతము పురాణమని యెరుంగునది. జనులయందు ధర్మబీజముల నాటి సంఘములయందు ధర్మబుద్ధి ప్రబలునట్లు చేయడమే పురాణముల ముఖ్యోద్దేశము. అట్లు చేయబూనున పుడు కొన్నిచోట్ల హత్యాకాండము అనవసరమగును, కాని ప్రధానాంశముకాకపోవడముచేత అది యేమూలనో మట్టుపడియుండును. దృశ్యకావ్యములం దట్టివి కల్పిస్తే అవి ప్రధానములగును, కావున ధర్మబుద్ధిని మట్టుపరచును. పురాణములందన్నో అవి ప్రక్కలకొరిగి ధర్మానురాగోదయమును అరికట్టవు. పుమ్ములకార్యప్రపంచమున వీటికి ప్రాముఖ్య ముండదు. ధర్మానురక్తి జనుల జీవితముల నియమితములుగను సుశిక్షితములుగనూ చేయును.






## మూడో ప్రకరణము

---

### సాహిత్యమున దివ్యప్రేమ.

#### సీతాదేవి ప్రేమ—

సాహిత్యమున ప్రేమమాహాత్మ్యము గాంచవలె నన్న సీతాదేవిచరితమును పరికించవలయును. ఆమె రాజర్షియగు జనకుని ప్రశాంతవంశమున పుట్టి, లాలనపాలన శిక్షల నొంది, ప్రేమమూర్తియైన శ్రీరాముని చెట్టబట్టింది, కావున అద్వితీయప్రేమమూర్తి అయింది. శ్రీరాముడు సింహాసనాధీశుడైనప్పుడు తాను మహారాణి నౌదునని ఔత్సుక్యముతో నున్న సీత, అతనికి వనవాస మబ్బినతోడనే వెంటబోవుటకు సిద్ధపడెను; అందు కాత డొప్పుకొనలేదు, ఆమె మాత్రము ముందంజ వేసినది. ఘోరాటవుల గ్రుమ్మరుట అమిత భయావహమనీ కష్టదాయకమనీ రాముడెంత బోధించినా ఆమె నిరుత్సాహపడక, నిర్భయముగా పతి వెన్నంటెను.

దీనికి కారణము ఆతని యందలి ప్రేమయే. పతిచెంతనున్నచో ఆమె కెట్టి కష్టములూ కష్టములుగా తోచలేదు, భీతి అసలే లేదు. ఋష్యాశ్రమముల వీక్షించు నపుడు శ్రీరామున కెట్టి యానంద ముదయించెనో సీతకు కూడా అట్టి యానందమే కలుగుతూండెను. ఆర్యుల మతమున సతి పతికి నీడ వంటిది. అతనికి సుఖావహమయినవన్ని ఆమెకు సుఖావహములు—ఆశ్రమవాసుల కష్టముల తొలగించి శ్రీరాముడు వనస్థలుల యందు శాంతిని నెలకొల్ప, అతని నాశ్రయించిన ప్రేమలత సీత ప్రేమకుసుమముల వెదచల్లుతూ అచ్చటి మునిపత్నులను మునికన్యలనూ ప్రేమాలాప ప్రేమాచరణపాశములచేత బంధిస్తూండెను—దండకారణ్యమున గుమ్మురు వేళల శ్రీరాముడు శాంతి సముద్రమున నోలలాడుచుండ, సీత ప్రేమస్రోతమున నీదుచుండెను.

సీత ప్రేమదూత అననొప్పు; ఆమె ప్రేమ విశ్వవ్యాపి—శ్రీకృష్ణుని ప్రేమ రాధారూపము ధరించినట్లు శ్రీరాముని ప్రేమ సీతారూపము గైకొనెను. అశోకవనియందలి క్రూర రాక్షసులు సయితమా ప్రేమకు వశులై చేతులు జోడించి ఆమెకు మ్రొక్కసాగిరి. ప్రేమప్రభావమున శత్రులు మిత్రులౌట చూచినారా? ఆమె ప్రేమయొక్క నిజస్వరూపము గోదావరీతీరమందలి పంచవటియందు కనబడును. అచ్చటి పర్ణశాలను సీత నందనవనముగా నొనర్చుట వల్ల తజ్జీవకోటి ఆమెను అనుపమప్రేమతో గారవిస్తూండెను. వారి

ణము లామె చేతుల యందలి పూరినిమేయుచుండ, మయూ
రము లామెవేయు తాళము ననుసరించి నృత్యము చేయు
చుండెను; పావురములూ గువ్వలును ఆమెతో ప్రేమాలాప
ములు సల్పుచుండెను. క్రూరమృగములు సయితము హింసా
ద్వేషముల నుజ్జగించి ఆమె నిర్మించిన ఉద్యానమున విచ్చల
విడిగా విహరించుచుండెను. ఆ ప్రేమ కాననమున శాంతిసుమ
ములు వెల్లివిరియుచుండెను. సీతప్రేమ అపారమని గోదావరి
ధీరమందస్వనమున చాటుతూ అమృతరసధారల వెల్లివోడుచు
చుండెను. జనస్థాన మంతా ఆమె యందలి ప్రేమచే పుష్ప
వృష్టి కురియగా ఆలతాంతరాసులతో వనదేవతలను ప్రియ
దేవతయగు పతిని ఆమె పూజిస్తూండెను. ఇందుచే అయోధ్య
యందు రాజసింహాసనమున నుండడము రామున కెక్కుడు
సుఖదాయకమో, లేక పంచవటియందలి కుసుమోద్యాన
మున నుండుట ఎక్కుడు సుఖదాయకమో నిర్ణయించడము
సులభము కాదు. ఆకుసుమ కాననమున సీత రామునకు
స్వర్గసుఖము చేకూర్చిందని ఇదివరకే చెప్పియుంటిమి కదా!
పంచవటి సీత నిర్మించిన ప్రేమ రాజ్యము. ఆ దంపతుల
నిస్తుల సుఖజీవనము చూచువారికి "ముందున్నది ముసుళ్ళ
పండుగ" అని స్ఫురించక మానదు.

కవికులతిలకుడగు వాల్మీకి మహాముని అపూర్వమగు
ఈప్రేమ చిత్రమును రచించెను. కణ్వాశ్రమమందలి శకుంతల
పంచవటియందలి సీతయొక్క నకలువలె తోచును. మిల్టన్

రచించిన ఆకము అవ్వాల ప్రేమచిత్రము ఈ రచనముం దేపాటి? పుట్టినదాది స్వర్గమందున్నవారికి భూలోకమందలి సుఖదుఃఖములూ, హింసాద్వేషములూ తెలియవు. వారు ఐహికజ్ఞాన రహితులు; అజ్ఞానాంధతమసావిష్టులకు ప్రేమ రస తేజస్స్ఫురణము అసంభవము కాదా? కావున వారిప్రేమ ప్రేమకాదు, వారిసుఖము సుఖముకాదు. సీతారాముల ప్రేమ కును వారి ప్రేమకును స్వర్గపాతాళముల కున్నంత అంతర ముంది. సీత దుఃఖమయకాననమును ప్రేమసుఖమయ మగునట్లు చేయ, అవ్వ సుఖమయకాననమున వసించుటకు అర్హత గడించలేక అధోగతిని కూలద్రోయబడెను. పాప కలితమగుపృథ్వీఖండము సీత పుణ్యవంతముగా చేయ, పుణ్య వంతమగు స్వర్గమున అవ్వ పాపకంటకము నాటి హింసాద్వేష ముల మొలిపించింది.

రాధాప్రేమ—

ఆర్యుల భక్తిశాస్త్రమున నింకోమాదిరి ప్రేమా దర్శము పొడచూపుచున్నది. మానవుల యందలి సాత్త్విక ప్రేమ కది మూలప్రతిమ అనవచ్చును. ఆప్రేమ మూర్తీభవించి రాధారూపమును దాల్చింది, గోపికలామె సహచరులు; దంపతుల ప్రేమ చెందదగిన చరమసీమను మీరి రాధికా ప్రేమ కృష్ణభక్తిగా మారెను, కావున దానిని ప్రేమభక్తి అననొప్పును, దంపతీప్రేమకు పరమావధి భగవదర్పణమే. భగవంతుడే జగమునకెల్ల నాథుడు. రాధయు గోపికలూ

తప్ప వేరెవ్వరును "భగవంతుడు మాకు ప్రాణవల్లభు"డని చెప్పుకొనజాలరు. సత్యభామ అట్లే అనుకొనుచుండెను కాని రాధామనోవల్లభుడగు శ్రీకృష్ణు డామెకు గర్వభంగ మొనర్చెను. ఆమెప్రేమను దృప్తభక్తి అనదగును. ఆత్మ సమర్పణమున పరిణతి చెందిన రాధాప్రేమభక్తి కిది సాటి కాదు. రుక్మిణిభక్తి దాంపత్యప్రేమ మాధురీసంఘటిత మవుటచేత దానికి యోగ్యపరిణతి ప్రాప్తించింది. ప్రేమ భక్త్యుల్లాసమున శ్రీకృష్ణలీలాతరంగిణులయందు అభిమాన విలాసములతో రాధ ఓలలాడుతూ ఉండడముచేత ఆమెకు శ్రీకృష్ణుని ప్రేమయే లోకము, ఆమె సర్వస్వ మదే. శ్రీ కృష్ణుడే ఆమెధనము, ఆతడే ఆమె సుఖము, అతడే ఆమెచింత; అతని ప్రేమయే ఆమె కునికిపట్టు, అతని తోడునీడగా నుండి ఆమె యితరమును మరచెను; ఆమెకు శ్రీకృష్ణునితోడి విరహ మెక్కడిది? అతని ధ్యానమున సదా మగ్నయై ఎప్పుడూ ఆతనినే విలోకిస్తూ ఉండును. శ్రీకృష్ణునెడ క్షణమైనా విము ఖత చెందక, తదూపమయ బృందావనమున తత్కథామృత రసపానము చేస్తూ ఆమె కాలము పుచ్చుచుండెను. రాధా కృష్ణులు ఎల్లప్పుడూ కదంబమూలమున విరాజిల్లుతూంటే రాధ శ్రీకృష్ణునుండి వేరుపడు టెట్లు?

సీత ప్రేమయందలి ఐకాంతికము.

సీతా విరహ మింకొక మాదిరి; సుఖాలవాలమగు బృందావనమున అది జనింపలేదు — అశోక వనియం

దుండునెడ ఆకారాగారమును ఆమె శ్రీరామమయ మొనర్చెను. రామనామస్మరణయే ఆమె కష్టాడు సంజీవి-రాక్షసకాంతల తర్జనభర్జనముల కోడి ఆమె మనసు ఏకాంతమున శ్రీరాముని శరణు జొచ్చింది. భయముచేత భక్తి పెరిగి పతిప్రేమను పరిపుష్ట మొనర్చెను. అహోరాత్రములు శ్రీరాముని నీలమేఘశ్యామలమూర్తిని ధ్యానించుటచేత ఆమె పతిపరాయణత పరమావధి చేరెను. సరమతో ఎల్లప్పుడూ శ్రీరాముని చరితమునే వల్లెవేయుచుండు ఆమెకు వేరొక చింత యెట్లుండును? లంకా విజయానంతరము ఆమె పాతివ్రత్యము అగ్నిచే పరీక్షింపబడినది.

శ్రీరాముని అంకమునుండి వికళితయై లంకావాసము చేయునెడ తిరిగీ పతిసమ్మేళనమున దానిని పొందగల్గుదు నను ఆశచే ఆమె ప్రాణములు బిగబట్టెను, కాని లక్ష్మణుడామెను గంగా తీర కాననముల విడిచినప్పుడు ఆమెకిట్టి ఆశయెక్కడిది? ఐన నామె శ్రీరామునియందలి భక్తిని వదలలేదు, ఆతని మేలు కోరడము మానలేదు. సహకారము నాశ్రయించిన మాధవీలతను తెంచి పారవేయు మాడ్కి ఆతడామెను వనభూములకు పారదోలెను. వాల్మీకి యాశ్రమము అశోకవనము వంటిది కాకున్నా ఆమె పాలిటికి అంతకన్న భయావహమాయెను; రావణుని వశమున ఆమె యుండునపుడు వైర నిర్యాతన మొనర్చడమునకు శ్రీరాముడు తనచెర విడిపించి తీరుననే ఆశయుండెను, కాని యిప్పుడట్టి ఆశలేదు, కావున

ఆమె ప్రేమ నైరాశ్యభరితము. ఇప్పుడు శ్రీరాముడు స్వయముగా ప్రజానురంజన కామెను బలియిచ్చెను. ఇక పునస్సమ్మేళన మసంభవము- ఈవియోగమున ఆమె శ్రీరాము నుద్దీప్త ప్రేమకు ప్రబలాధారమయ్యెను. ఆప్రేమ వలన సీతకు లేశమైనా గర్వముకాని గుండెనిబ్బరముకానీ కల్గలేదు, దానిమూలమున అందరికీ ఆమెయెడ సానుభూతీ అతులాదరమున్నూ ప్రబలినవి. ఆప్రేమయే సీతకన్నులనుండి బాష్పధారావృష్టిని ప్రభవిల్లచేసెను. తనబిడ్డలను జూచి పతి రూపము స్మరించి దానినెల్లప్పుడు ఆరాధిస్తూ ఉండేది. సుతుల మోముల తిలకించి శ్రీరామచంద్రుని లోచనరాజీవముల స్మరించి కన్నీటి కాల్వలచే కాననభూమిని తడుపుతూ ఉండి, శ్రీరాముని ప్రేమము నే జీవాధారము చేసుకొని నిర్భరములగు ప్రాణములు నిల్పుకొన గలిగింది.

ఆశ్రమావాసమున పెరిగిన ఆమె గాఢప్రేమ పాతాళ ప్రవేశసమయమున ప్రకటితమాయెను. శ్రీరాముని నోట పునఃపరీక్షా ప్రసంగము వెలువడగానే సీత గుండె పటీలున బద్దలయింది. పితృకల్పుడగు వాల్మీకి, ఇతర గురుజనము, పుత్త్రిలు, ఎందరో సభాసదులు—అందరిముందర మర్మభేదకమగు ఆవార్త విని ఆమె సహింపగలదా? భూమి దారి యిచ్చినవెంటనే శ్రీరాముని ముఖమునందే దృష్టినిల్పి ప్రేమ ప్రతిమ యగు సీతాసతీమణి మాతురంకమును జేరి మరి కన బడలేదు. సతీప్రేమ పవిత్రప్రతిమ అంతటితో న స్తమించినది!

సతీత్వ గౌరవము—

పతియెడ సతికుండ దగినప్రేమ అలౌకిక మనుటకు సీతయే దృష్టాంతము. పతిభక్తికిని సతీత్వమునకును చూడాంత నిదర్శనమగు ప్రేమస్ఫీత సీత అపూర్వకవిసృష్టి అనక తీరదు - ఇట్టి సతీత్వము పాతివ్రత్యమును ఆర్యసాహిత్య మెక్కువగా కొనియాడబట్టి యీ రెండు ధర్మములూ ఆర్య నారీజనమునకు మూలబలమని యెంచనగును. 'సతి' అను మాట వినగానే ఒడలు గరుపారును—పతినే మననము చేయుచూ ఆతనినే సేవించుచూ ధ్యానించుచూ తదితరము నెరుగనట్టి నారీమణి, 'సతి', యనబడును. సతీదేవి పతినింద చెవిని బడినతోడనే అగ్నిలో నురికింది—సావిత్రి పతిశరీరము నంటి యుండుటచేతనే కదా యముడామె నంటవెరచెను! సుమతి పతిరోగదళిత కళేబరమును తప్తకాంచన నిభముగా నొనర్చగల్గెను. సావిత్రి యముని చేతబడిన పతిప్రాణముల నార్జింపగల్గెను—వీరిట్లు చేయగల్గుటకు సతీత్వ పాతివ్రత్య ములే ముఖ్యసాధనములు-- సతీత్వమును గౌరవించినన్నాళ్ళు ఆర్యలలనామణులు అధికశక్తియుతలై విరాజిల్లుచుందురు. సతి అనుదానికి పతివ్రత అనునది పర్యాయపదము-సతి మనకు దేవీతుల్య, ఆమెకు పతి దేవతుల్యుడు, అట్టి భావముతోనే ఆమె ఆతని నర్చించుచుండును. ఇట్టి సతీగౌరవమును స్థాపించి నవి ఆర్యశాస్త్రములు-ఆర్యావర్తము పుణ్యభూమియూ, ఆర్య ధామములు పవిత్రములూ అగుటకు సతులే ముఖ్యాధార

ములు- వారిని గౌరవించు నాచారము మన కుగ్గుపాలతో ఉపదేశింపబడును. గాంధారి తనభర్త అంధుడని యెరిగిన వెంటనే కళ్ళకు గుడ్డకట్టుకొని అంధీభూత అయ్యెను. సావిత్రి తండ్రియిచ్చిన భూషణాంబరాది రాజచిహ్నములవీడి నారచీరకట్టి గురువుల సేవించుతూ పత్యవసానదినమున యముని మెప్పించి పతిని పునర్జీవితు గావించుకొంది.

ఇట్టి సతీగౌరవమున గ్రాలుచున్న భారతవర్షమున సీత సర్వజనసమాదరణమునొంది ఎల్లకడల పూజింపబడుతూ ఉన్నది- ఒక్క-సీత అననేల? పతివ్రతలందరూ ఆమెవలె పరమపూజనీయ లయినారు—— సతి, పార్వతి, అరుంధతి, సావిత్రి, గాంధారి, చంద్రమతి, దమయంతి, మొదలుగా గల నారీమణుల పేర్లు విన్నతోడనే ప్రతిభారతీయుని శిరము గర్వముచే ఉన్నతమై, చిత్తమునకు శుద్ధియు, శీలమునకు పవిత్రతయు అలవడును.

ఏ పాతివ్రత్యగౌరవము ఆర్యసాహిత్యమున పురాణములయందు, కావ్యములందు, నాటకములందు, నవలలందును అవిరళముగా ప్రస్తుతింప బడెనో, ఏ పాతివ్రత్యబలము నాధారము చేసుకొని భారతరమణులు ధైర్యము, శాంతి, అధ్యవసాయము, కార్యచాతుర్యము, వైదగ్ధ్యము, సహిష్ణుత మొదలగు సుగుణముల నభ్యసించి నారీరత్నములని బరగుచున్నారో, ఏసతీధర్మాచరణమునవారు పవిత్రశీలలు, పూతచరితలు నగుచున్నారో, అట్టిపాతివ్రత్యధర్మగౌరవమును

ఆర్యకవు లనేకోపాయముల తమ సాహిత్యమున జొన్పినారు చూడండి:—

౧. పురాణశ్రవణము — పాటలు.

మనదేశమున పురాణశ్రవణము లోకులకిప్పుడు రుచింపకున్నా అచ్చటచ్చట ఇది చెలగుచుండ బట్టి మధురవాక్యములతో కూర్చబడిన దృష్టాంతసహిత వ్యాఖ్యానముల యందును, వీధులలోనూ ఇండ్లలోనూ పాడుచున్న పాటలు, వింటూన్న హరికథలు, గీతములూ, కనుచున్న వీధినాటకములు బొమ్మలాటలు మొదలగు వాటియందున్నూ కీర్తింపబడు సతీధర్మము, పాతివ్రత్యప్రభావమును స్త్రీల మానసములందు గాఢముగా నాటి వారి జీవితముల శుభోదర్కములగునట్లు ఒనర్చుచున్నవి. శ్రీమద్రామాయణము మహాభారతమును నాటకములుగాను పాటలుగాను రచింపబడుటచేత కొంతవరకీ ఫలమే సిద్ధిస్తూన్నది. వీటిని విన్నతరువాత పతితపావనమగు నిర్మలధర్మప్రవాహము మానసములందు పారుచునే ఉంటుంది. గాయకులు, నటులు "కాలక్షేపముల" చేయువారును వివిధశబ్దార్థాలంకారముల కూర్చి వారివారి వాక్చాతురి, కళాకౌశలమున్నూ వెలయునట్లు ఈ రెండు ధర్మములను అధికముగా ప్రకటిస్తూన్నారు.

౨. ఇళ్ళలో చెప్పుకొనే కథలు.

మనలో వృద్ధులు (స్త్రీపురుషులు) అనుశ్రుతిగా కథలు చెప్పుతూ పాటలుపాడుతూంటే చదువుకొన్నవాళ్లు చిన్న

చిన్న పుస్తకముల ద్వారా ఈధర్మముల నన్నిదిక్కుల వ్యాపింపజేస్తున్నారు.

౩. వ్రతములు—నోములు.

పుణ్యకథల రచించుటతోనూ వినుటతోనూ తనివితీరక పిల్లలచే ఆధర్మముల నాచరింప జేయుటకు ఋషు లనేకవ్రతములను నిర్మించిరి. సత్యభామాా సావిత్రియూ ఎట్టివ్రతముల నాచరించి పతిపూజ ప్రతిష్ఠించినారో వాటినే మనవారిప్పటికీ చెప్పుకోవడమే కాక తామాచరించి కోడళ్ళచేతను కూతుళ్ళ చేతను ఆనోములు పట్టిస్తూన్నారు. ప్రతివ్రతము నోము తుద నొకకథ యుండును. అందు కొనియాడబడునవి పైరెండు ధర్మములే.

౪. దృష్టాంతములు—

బోధనచేయడమే కాక తామాతీరున ఆచరిస్తూన్న పెద్దలు దృష్టాంతరూపులై బాలకులచిత్తములందు ధర్మప్రవృత్తి పాదుకొల్పుచున్నారు. ఈధర్మములను పట్టి బోధనవల్ల సాధించుట దుష్కరము, ఇందు దృష్టాంతములే ముఖ్యసాధనములు.

ఇన్ని రీతుల ఉపాయములచేత స్త్రీలకు మనపూర్వులు విద్యనేర్పుతూండిరి. ఇదే యోగ్యమైన బోధన. ఈవిద్యాప్రభావముననే మనస్త్రీల కనేకసుగుణములు అలవడుచుండేవి. విదేశశిక్షాప్రచారములేని చోట్ల ఈశిక్షాశక్తియందలి ఫలము నేటికిన్నీ తెల్లమగుచున్నది. సతీత్వపాతివ్రత్యగార

వోజ్జ్వలమగు పౌరాణిక సాహిత్యమును పఠించుటవల్లనే అట్టి సుగుణము లలవడును, కాని విదేశీయగ్రంథముల చదువుటచే ఎన్నడును అబ్బవు. ఇట్టివిద్య కథలు వినుట, దృష్టాంతములు కనుట, ఆచరణముల చేయుట వలన లభించునంత సులువుగా నట్టి గ్రంథపఠనము వలన లభింపదు. ఈనాల్గుసాధనముల చేతను తరుణతరళములగు మన కులకామినుల హృదయము లందు పాతివ్రత్య సంస్కారము వేరుదన్ని నిలుచును. తన్మూ లమున వారు ధర్మగౌరవమును మదినిల్పి తమ జీవికను సార్థకమొనర్చుకొందురు.

పై నుదహరించిన ఆర్యశిక్షాప్రణాళి కాలవశమున తారుమారయి, ప్రస్తుతమున ఆ సుందరపథమునకు మారుగా విదేశశిక్షాపరిపాటి ఉపక్రమింపబడుతూన్నది. ఆసాహిత్యమున మన సతీత్వపతివ్రతాధర్మములు లేక పోవడమే కాక తద్వ్యతి రేక రీతి కాన్పిస్తూంది. పతిప్రేమరసాయనము గ్రోలుతూ తదేకనిష్ఠతో జన్మమంతా గడుపుట భారతీయసతికి విధి. పాశ్చాత్యసంఘమునం దిట్టి ఆదర్శము లేదు. వారి ఆదర్శ విధానము కొంచెము వివరింతాము—

౧. వారిలో స్త్రీలు తమ కిష్టమైన వారిని పెండ్లి యాడుదురు, వారి యిచ్ఛప్రబలము, తదనుసారము కార్య ముల నిర్వర్తింతురు; వారికి స్వాతంత్ర్యమూ స్వేచ్ఛయూ ఉన్నవి.

౨. వారిలో స్త్రీలు పలుమారు పెండ్లి యాడ

వచ్చును. పతిగతించిన పిదపనే కాక పతిజీవించియున్నా ఆతని త్యజించి (Divorce) వేరొకని పెండ్లియాడు ఆచారము కూడా వారిలో కద్దు.

ఆర్యస్త్రీలు తమ పెద్దలు నిర్ణయించిన వానిని పతిగా వరించి, యావజ్జీవము ఆతనినే దైవముగా నారాధిస్తూ, తదేకనిష్ఠతో అతని యిచ్ఛానుసారము వర్తింపవలెను. ఈ యాచారము పాశ్చాత్యస్త్రీలకు నిర్బంధము కాదు. పతిజీవిత కాలములో వేరొకని పెండ్లియాడుట కలలోనైన ఆర్యస్త్రీ తలపగూడదు.

ఇందువలన ఆర్యసతీత్వాదర్శమునకూ పాశ్చాత్యాదర్శమునకూ సామ్యమే లేదు; సరేకదా మీదు మిక్కిలి వైషమ్యము కూడా కద్దు. రెండూ పరస్పర విరుద్ధ ధర్మములు.

సాహిత్యమున పాతివ్రత్యము—

మన పూర్వులు మనుష్యోచిత వ్యవహారమును సంస్థాపిత మొనర్చి, దానికన్న ఇంచుక భిన్నమగు సతీత్వాదర్శమును నిర్మించి, సాహిత్యమున నెల్ల కడల ఉపపాదించిరి. యూరోపీయ సతీత్వమున లోకవ్యవహారోచితపథము కన్న విశేష మేమియు లేకుండుటచే తదాదర్శవర్ణనము ఆసాహిత్యమున కానరాదు. ఎచ్చట చూచినా ఆర్యాదర్శము వంటి ఉత్కృష్టాదర్శవర్ణన మాసాహిత్యమున లేకుండుటచే దానిని పదేపదే చదివే మన స్త్రీలకు మన సతీత్వాదర్శము అసంభావ్యమని తోచి దానియందు గౌరవాదరములు కలుగనేరవు.

మన స్త్రీవిద్యావిధానము పాశ్చాత్యవిధానముకన్న భిన్నమని చెప్పినాముకదా. మన స్త్రీలు కొంచె మక్షరజ్ఞానము కలగగానే పురాణములు మొదలగు మన గ్రంథముల పఠించి మన ఆదర్శములను అనుమోదించి వాటి ననుకరింప మొదలు పెట్టుదురు. విద్యాభ్యాసమునకును, శ్రవణము, ఆచరణము, (వ్యవహారము) దృష్టాంతములను పైని చెప్పిన నాల్గుసాధనముల కును సామంజస్యముండుటచే, చదువుకొన్న స్త్రీలు సతీత్వ ధర్మము, పాతివ్రత్యధర్మమును గౌరవింతురు. ఇట్టి స్త్రీ విద్య ప్రమాదజనకము కాదు. "అధీతి బోధాచరణప్రచారణము" లకు చక్కని సామంజస్య మున్నందున ఇదే ఉత్తమవిద్య.

యూరోపీయాచారములు మన ఆదర్శముల కనురూప ముగానుండవు. పాశ్చాత్యసాహిత్య మభ్యసించి విదేశాచార ముల నుపక్రమించిన మనస్త్రీలకు ఆర్యపతివ్రతాధర్మముల యెడ గౌరవము నమసిపోయి వాటికి వారు దూరులగుటే కాక పాశ్చాత్య సతీధర్మములందా సక్తి పుట్టును. వీటికీ మన ఆచారవ్యవహారములకూ సరిపడదు. ఆసంఘమున నవి చెల్లుబడి యౌనుగాని మన వ్యవస్థలకు పనికిరావు. మన సాహిత్యమున నుపపాదింపబడిన ధర్మముల నాశ్రయించుట చేతనేకదా మన స్త్రీలకు కొన్ని సుగుణములు అలవడునని చెప్పియుంటిమి. ఆధర్మములు పాశ్చాత్యసాహిత్యమున అక్క డక్కడ ఇంచుకించుకగా స్ఫురించును, కాని ఉజ్జ్వలరూపమున కానబడవు. కావున దాని పఠించువారి కా సుగుణము లబ్బవు.

అందుచేత అసలే గిట్టవు. ఇట్టి దృష్టాంతము లిప్పుడిప్పుడు కాన్పించుచున్నవి. ఇవి ప్రబలకపూర్వమే పాశ్చాత్యేశ దా ఘణితి మన వారికి ప్రమాదజనకమని యెరుంగుట మేలు. బోధనకును ఆచరణమునకును సానుకూలత లేనందున విద్యాభ్యాసము విఫలమగును; ఎద్దు ఎండకూ పోతుసీడకూ లాగితే బండి నడుచు టెట్లు ?

ప్రాచీనభారతవర్షమున స్వేచ్ఛాచరణము—

యూరోపీయ సంఘములందు ప్రస్తుతమున బరగుచున్న సతీలక్షణములు సభ్యతాప్రాథమికావస్థయందు అన్ని సంఘములందూ ఉండెను. ప్రాచీనభరతఖండమున అచ్చటచ్చట ఇట్టి ఆచారవ్యవహారములు ప్రబలియుండెనని తలంచుటకు నిదర్శనములు కానవస్తూన్నవి-దిగ్విజయ సందర్భమున సహదేవుడు ప్రాచీన మాహిష్మతీ నగరమున కేగినప్పుడు అచటి స్త్రీలు పుంశ్చలులై స్వేచ్ఛావిహారము సల్పుచుండి రట.

"పూర్వకాలమున మనదేశమున స్త్రీలకు అంతఃపుర నిర్బంధము (ఘోషా) లేక వారు ఇచ్ఛానుసారము వర్తించుచుండిరి. ఒకరి యధీనమున కాలక్షేపము సేయు నక్కర వారికి లేకుండెను-విషయవ్యాపారములందు తిర్యగ్జంతువుల లీల వారు విహరించుచుండిరి. ఉత్తరకురుభూములందలి వారిప్పటికిని ఆ రీతినే వర్తించుచున్నా"రని పాండురాజు కుంతితో చెప్పెను.

పిమ్మట శ్వేతకేతు వృత్తాంతమును స్త్రీలకు తిర్యగ్జం

తువులవలె స్వాతంత్ర్యమూ, స్వేచ్ఛాచరణమూ తత్పూర్వ మిుండెననియు, అట్టి యాచారముల నజ్జగించి భారతీయులు ఉన్నతప్రపత్తి ననుసరించి దివ్యత్వమును సాధించిరనియు అతడే చెప్పెను.

మనము అట్టి దేవత్వమును కోలుపోయి నిమ్న వ్యాపారముల ననుమోదించుట ధర్మమా? యుక్తకర్మమా?

ఆర్య సతి పవిత్రత—

యూరోపీయ సాహిత్యమున మానవప్రకృతియందలి నైసర్గిక స్వేచ్ఛాచరణమునకు ప్రాబల్యము కానవచ్చుచున్నది. ఆర్యసాహిత్యమున ప్రేమ ఉదయించి మానవప్రకృతిని పవిత్రిత మొనర్చి దాని కున్నతి చేకూర్చింది. మహాశ్వేత* ప్రేమ ఇట్లే పవిత్రితమై దైవారాధానముగ పరిణమించెను. ఆమె మూర్తీభవించిన దైవారాధన, ప్రకృతిరూపముగొన్న పవిత్ర ప్రేమ అననొప్పు. అచ్ఛోదసరస్తీరకాననాభ్యంతరమున దైవారాధన చేయుచుండు ఆసతీమణి దేవీమూర్తియో మానవీమూర్తియో నిర్ణయించుట కష్టము. దేవపూజాచ్ఛలమున మానసమునకు ఏకాగ్రత కల్పించి ఆమె యెవ్వని పూజించుచున్నది ? అప్పుడామె పతిని ప్రేమించుచున్న దందామా? లేక పూజించుచున్న దందామా? బాణభట్ట నిర్మితయగు మహాశ్వేతవలెనే కాళిదాస నిర్మితయగు

* బాణకవి రచితమైన కాదంబరి అను గద్యకావ్యమున నాకనాయకి.

పాశ్చాత్యయు పూతచరితయే. అప్సరస్సంభవయైన శకుంతలయు తుదకట్టి పవిత్రమూర్తిగానే పరిణమించింది. ఇట్టి నారీమణుల సంసర్గమున మానవప్రకృతి పవిత్రితమైన దగుచున్నను.

ఆర్యసతి యాత్మోత్సర్గము

పత్యనురాగము ప్రబలినకొద్దీ సతి తన అస్తిత్వమే మఱచిపోవును. ప్రేమావేశమున ఆత్మవిస్మృతినొంది సర్వవిషయముల తన పతితో సాయుజ్య మొందును. ఆతని సుఖమే తన సుఖమనియు, ఆతని దుఃఖమే తన దుఃఖమనియు, భావించడమే దాంపత్యప్రేమకు పరమావధి అని ఇందువల్ల విదితమగును. ఆర్యకుటుంబములందు పతికీ సతికిన్నీ స్వార్థ మొకటి, సుఖ మొక్కటి, స్వర్గ మొక్కటి; ఇట్టి ఐక్యత అలవడనిచో దాంపత్యమే సిద్ధింపదు.

పాశ్చాత్యదంపతుల స్వార్థములు వేరు, రుచులు వేరు, పారలౌకికేష్టసాధనలు వేరు; తత్పరిస్థితులు పతిపత్నీ విచ్ఛేదకారకములౌట వారియందు భారతీయ దాంపత్యమందలి ఏకాగ్రత, ఏకనిష్ఠ, ఆత్మోత్సర్గమూ సిద్ధించు నవకాశ మంతగా లేదు. భారతరమణు లేకాగ్రమనస్కలై పతుల ననుగమించుచు సహధర్మిణీసౌభాగ్య మనుభవింతురు; పాశ్చాత్యనారీమణుల కిట్టి సౌకర్యము లభింపదు, ఇష్టవస్తు విభేదము వారిని పతులనుండి వేరుచేయును.

ఆర్యసతీమణులయందలి ప్రగాఢప్రేమ వారియం

దుండజాలదు, అందుచే "ధర్మపత్ని" లను ఆర్యపదము వారియందు చెల్లదు. ధర్మపత్నుల సుచితమగు సతీచరిత్రము పాశ్చాత్యసాహిత్యమున లభింపదనుట నిర్వివాదాంశము. సహధర్మిణీచిత్రమును సావకాశముగా నెఱుంగవలెనన్న ఆర్య సాహిత్యమునే పఠించవలయును. ఆర్యసతి కోరేది యీజన్మ మునమాత్రమే పత్యనుసరణము జేసి ఆతనితో సాయుజ్య మొందవలెనని కాదు; ఇహమున పరమునా పత్యనుసరణమే పరమధర్మమని యెంచి సచ్ఛీలబలమునా ధర్మాచరణ ప్రభావముననూ పతితోగూడ దేవత్వము అమరత్వము నొందడమే ఆమెకు పరమావధి. అందుచేతనే ఆమె "అర్ధాంగి" యగుచున్నది.

పతిప్రేమనుండి విశ్వపతి ప్రేమ—

ఆత్మోత్సర్గముతో సతి అభ్యసించు పతిభక్తియే భగవద్భక్తికి మొదటి మెట్టు. ఈరీతిని భక్తుడు భగవంతుని యందు లీనముగాకున్న భగవద్భక్తి అతని కలవడనట్టే. పతిభక్తిచే సతి పతియందు లీనమగునట్లు భక్తుడు భగవంతుని యందు లీనుడై తచ్చరణములకు తన స్వాస్థ్యమును సమ ర్పింపవలెను. దీని నంతయు పరికించి చూస్తే సతియొక్క పతిభక్తి భక్తుని దైవభక్తికి నకలని తోచును. పతినే భగ వంతునిగా భావించి వానిలో లీనమగుటకు నెంచుటచే సతి దేవ్యవతారమగుచున్నది. సీతయు రాధయు ఈ రెండు తెర గుల ప్రేమాదర్శములై పరస్పరప్రతిబింబము లవుచున్నారు.

సీత పతిప్రేమ అత్యుజ్జ్వలము కావున అందు దేవభక్తి దాగియుండె; రాధ భగవత్ప్రేమ ఉజ్జ్వలమగుటచే పార్థివమగు పతిప్రేమ అందు లీనమైంది; పతిప్రేమయే భగవత్ప్రేమగా పరిణమించింది, కావుననే రాధయొక్క భక్తి "ప్రేమభక్తి" అనిపించుకొంటుంది. ఇట్టి ప్రేమపరిణతియే ఆర్యసాహిత్యమున గాంచనగును. ఒక్క సాహిత్యముననే కాదు, ఆర్యసంఘమున కూడా ఇట్టి ప్రక్రియ తోచుచుండును. వైధవ్య మొందిన ఆర్యసతికి జగత్పతియే పతి, కావున ఆమె పతిభక్తియూ దాంపత్యప్రేమయూ సహజముగా భగవద్భక్తిలో పరిణమించవలెను. అట్టివా రార్యసంఘమందలి రీతినీతుల ననుసరించి సువాసినులభంగి పతిభక్తి నాచరిస్తూ తన్మూలమున దైవభక్తి నభ్యసింతురు. భగవంతునే పతిగా మదిలో నిల్పి, ఆతనినే ప్రణయభాజనునిగా నెంచి సేవిస్తూ, సతీధర్మము నాచరింతురు. అనురాగమంతా భగవంతునియందు నిక్షిప్తము చేసి వా రాచరించే భక్తి పతిభక్తియు జగత్పతిభక్తియు నగును. అట్టివారు పతినారాధించవలెనంటే భగవంతునారాధింపవలయును. పతి జీవించియున్నప్పుడే రాధ అతడు భగవంతుడని తలంచిన తీరున, వీరు పతి గతించినవెన్క భగవంతుడే పతియని తలంచవలయును. రాధాపతి జననమరణ రహితుడు జగత్పతియు కావున పతి లేనివారు అతనినే పతిగా భావింపవలయును.






## నాల్గో ప్రకరణము

---

### సాహిత్యమున పాశవప్రేమ

#### సతీప్రేమ—కామానురాగము, ప్రేమ

ఆర్యకవులు నిర్మించిన ఆదర్శములలో సతీచరిత్రమున నెట్టి ప్రేమాదర్శమును కల్పించినారో పూర్వప్రకరణమున వివరించినాము. ఎందు చూచినా సతీప్రేమ గోపికాప్రేమను పోలియుండును. నిస్స్వార్థభావము, ఏకనిష్ఠ, స్వామిగౌరవమున్నూ రెండింటియందు నొకతీరుననే ఉండునని స్పష్టమైంది. ఇట్టి భావోదయము కల్గుటచేతనే పతిభక్తి దైవభక్తిగా పరిణమించి మానవునకు దేవత్వము సిద్ధింపజేయును.

సతీప్రేమను పర్యాలోచిస్తే ప్రేమతత్త్వము చక్కగా బోధపడుతుంది:—

కామానురాగమునకూ (lust) ప్రేమకున్నూ (Love)

కున్నా కావలసినంత భేదమున్నది. పతిని సుఖపెట్టి తాను సుఖింప సమకట్టు ఇల్లాలు సతి. వాత్సల్యప్రేమకూ సతీప్రేమకూ లక్షణమొకటే. సంతానమును సుఖపెట్టి పితరులు తాము సుఖింప జూచునట్లు పతియెడ సతి అనురక్త అవుతుంది. నిసర్గప్రేమస్వసుఖాభిలాషి కానేకాదు. ప్రణయభాజనమగు ఇతరవ్యక్తి సుఖమే దానికి పరమాపేక్షణీయము. ప్రేమ అట్టి సుఖమునే కాంక్షించుచుండును.

కామానురాగమందట్టి ధర్మదృష్టి కానరాదు. అ దెప్పుడూ ఇతరుల ద్వారా తాను సుఖింప సమకట్టును. ఇంద్రియ లాలస పరితృప్తి నొందగానే కామము చరితార్థమగును. ప్రేమ స్వసుఖనిరభిలాషి, పరార్థకాంక్షి; కామము కేవల స్వార్థకాంక్షి, పరసుఖపరాఙ్ముఖి.

ప్రేమ పరార్థపర మవుటచేతనే సతి పతియందు గుణదోషములు పరికింపదు; గుణములగాంచి ప్రేమించువారు దోషములగాంచి ద్వేషింతురు. దోషము లందరియందున్నా తోచును, కావున రూపగుణనివిష్టమగు అనురాగము స్థిరము కానే కాదు. నిసర్గప్రేమ గుణదోషపక్షపాతి కాదు. తల్లిదండ్రులు తమ సంతానమునందలి గుణదోషములు తడవక వారి నాదరించి ప్రేమించునట్లు సతియు తనపతి యెట్టివాడైనా వానినే ప్రేమించును. ఇట్టి గుణదోషపక్షపాతరాహిత్యమే సతీప్రేమ కాదర్శము. కనుకనే "పతి యెంత దోషకలితుడైనా సతికి పరమ పూజ్యు" డని మనువు

శాసించెను. మనువేకాదు మహాభారతాది ఆర్యగ్రంథము లెల్ల ఇట్లే ఉపదేశిస్తూన్నవి.

కామానురాగము ప్రేమవలె ఉన్నతదశ నొందజాలదు. అది గుణరూపముల ననుసరించి యుండును, గుణములు దోషమిశ్రితములు కాకయుండవు, రూపము కాలక్రమమున కడచనును,

ఇదిగాక రూపగుణముల తారతమ్య మస్థిరము, నేడు నచ్చిన రూపమూ గుణమూ రేపు నచ్చవు. కావున తత్పాత్రములు కాలవశమున అపాత్రములగును.

మరియు రూపగుణసంపద నొకరి నొకరు మింతురు, కావున కామమునకు కడ లేదు.

ఈ మూడు కారణములచేతనూ కామానురాగ మెల్లప్పుడూ ఏకపాత్రనిక్షిప్తము కాజాలదు. అతిచంచల మగుటచే దానికి స్థాయీభావ మలవడదు.

ప్రేమకు సహజధర్మము స్థాయీభావము; అది ఏకనిష్ఠము, నిశ్చలము; గుణములు జూచి కూడ రాదు, దోషములు గాంచి తొలగిపోదు. అందువల్లనే ఆర్యసతీప్రేమ అత్యంతానురాగపూరితము, స్థిరము, నిశ్చలము, ఏకనిష్ఠము నగును; కామాంధుల అనురాగము కాలానుగుణముగా మారుచుండును.

నిస్స్వార్థమగుటచే నిసర్గప్రేమ ఆకాంక్షారహితమగును. దోషగుణముల నపేక్షింపక, ఇతరుల మూలమున

తాము సుఖింపనెంచనట్టివారికి ఆకాంక్ష యెక్కడిది?

సతీప్రేమ వ్యవసాయము కాదు కావున మారుకోరదు. "నీవు నన్ను ప్రేమించిన, నేను నిన్ను ప్రేమింతు" ననేది కాదు, ఇచ్చిపుచ్చుకోవడ ముండుండదు, వినిమయవ్యాపారము కానరాదు. లతలను, వృక్షములను, పశుపక్ష్యాదికమును సోదరభావమున ప్రేమించిన శకుంతల బదులుకోరెనా? పతిప్రేమాసారము ప్రశంసనీయము, పతి తనయెడ ప్రేమ జూపెనా పత్ని ధన్యయే; కాని పతిప్రేమ నాసించియే పత్ని పతిని ప్రేమింపనెంచితే అది నిసర్గప్రేమ కానేరదు. పరస్పర ప్రేమ సమకూడినదా మణికాంచన సంయోగమయినట్లు, కింశుకమున సౌరభము వెలసినట్లు, చంపకము శూన్యకంటకమయినట్లు, చందనతరువు పుష్పించినట్లు, చెరకు పండినట్లున్నూ రాణించును. ఇట్లు జరుగకున్నా సతి పతిని ప్రేమింపకతీరదు.

సతీలక్షణము నొకకవి యిట్లు వర్ణించెను:—

* నీవు నన్ను ప్రేమింతు వటంచును, నేను విన్ను ప్రేమింతునోకో?
నిన్ను వీడి యెన్నను నే నన్యుని, నియమమిద్ది సతి నే నౌటన్‌.

వాత్సల్యప్రేమలాగే దంపతీప్రేమకూడా నిఃస్వార్థము కావలెను. పసిపాపలు పెద్దవారై తమ్ము సంరక్షింతు రనియా తలిదండ్రులు వారి నాబాల్యము అతిగారాబముతో పెంతురు? వారి కపత్యప్రేమప్రతీక్షయే యుండదు, ఐనా ప్రాణములకన్న

* ప్రేమ్ తుమ్ హాకే కర్నేహీసే హైం భీ కహో కరూంగీ ప్రేమ్?
తుమ్‌హే ఛోడ్కర్ ఔర్ న జానూం యహీ హై మేరా నేమ్.

నెక్కువగా పిల్లల ప్రేమింతురు. పసితనమందే వరునకొసంగ బడి అత్తవారిల్లు చొచ్చినప్పటినుండీ పతిప్రేమ నపేక్షించుట సతీధర్మము కాదు. పతి తన్నెప్పుడు ప్రేమించునో, అప్పుడు తా నాతని ప్రేమింపవలయుననీ సతి యెన్నటికి తలపరాదు. పెళ్ళియైనప్పటినుండీ పతిని ఆదరిస్తూ ఆతడే తనకు సర్వమని యెంచి త్రికరణశుద్ధిగా నాతని ప్రేమిస్తూండవలెను. పెళ్ళియాడిన వానినే ప్రేమించుట (Love whom you marry) ఆర్య సతీధర్మముకాని, ప్రేమించినవానిని పెండ్లియాడుట (Marry whom you love) కాదు. సతికి జీవితసర్వస్వము పతియే. అట్లామె భావిస్తే పతియూ ఆమెను ప్రేమించితీరును. అతడున్నూ పెండ్లినాటినుండీ ఆమె తన్ను ప్రేమించునను ప్రతీక్షలేకనే ఆమెయం దనురక్తుడై యుండును. ధర్మ మాచరించునెడ నిద్దరూ సమభాగినులు కనుక సతి "సహధర్మిణి" అనిపించుకొనును. "ధర్మపత్ని", "అర్ధాంగి" అను పదములు సార్థకములగునంత సాంద్రసంబంధము పాశ్చాత్యదంపతులలో గానరాదు. వారి దాంపత్యము చిరకాలికము కావలెననే నిర్బంధము లేదు; పాశ్చాత్యదాంపత్యసంప్రదాయము ననువర్తించువారియం దట్టిప్రేమయే అవతరించుచుండును.

ఆర్యదాంపత్యప్రేమ వినిమయ విహీనము, ఆకాంక్షారహితమనియు, కామానురాగ మందుకు విపరీతమనియు చెప్పియుంటిమి. వినిమయప్రతీక్షచేతనే పశుపక్షిగణములో ప్రేమ జనిస్తుంది. కామానురాగము పరముఖాపేక్షి, ఇతరులు మనపై

వలపుగానకున్న మనకామ ముద్దీప్తము కానేరదు. నిసర్గ ప్రేమవలె నది నిరాకాంక్షము కానేరదు. విషయవ్యాపారము సర్వజంతువులకు సామాన్యము కావున దీనిని "పాశవప్రేమ" అందాము.

ప్రేమకు కామానురాగమునకూ మరో తేడా ఉంది. సతి పతిగౌరవ పరిపూర్ణ, వేరొకవ్యక్తియందు సతి చిత్తము ప్రసరింపనోపదు. వ్రజబాలికలకు శ్రీకృష్ణునితో సమగౌరవ భాజనుడు లేనట్లే సతికి పతితుల్యు డుండడు.

తల్లికి సంతానముపై ప్రేమ అత్యధికము, తల్లియూ సంతానమున కమిత ప్రేమగౌరవభాజనము. కావున నిసర్గప్రేమ మహత్వజ్ఞానపూరితము. అసమానపదస్థులయెడ ప్రేమ జనింపబోదని కొందరందురు, కాని అది సరికాదు. సేవకుడు ప్రభువును, ప్రభువు సేవకుని ప్రేమించడము లేదా? గురువు శిష్యుని శిష్యుడు గురువుని ప్రేమింపగూడదా! పదవియందలి నిమ్నోన్నతములు ప్రేమోదయమునకు బాధాకరములు కాజాలవు. శ్రేయసులకు ప్రేమపాత్రి మత్యంతప్రియము, వారికి దానియం దాదరము మెండు. ఒరు లేలాగైనా దాని నధఃకరింపనెంచితే వారు సహింపజాలక ఆవస్తువును పెద్దజేసి "దీనికి సరియేదీ?" అని వాదింతురు, అది వారికి కొంగుబంగారము; పరుసవేదివలె ప్రేమ తాను సోకినదాని నెల్ల పసిడిగా పరిణమింపజేయును.

కామానురాగము స్వతంత్రవ్యవహర్త; వాస్తవిక

నీచోచ్చముల గణించక నీచ ముచ్చమున్,ఉచ్చము నీచమును చేయుసామర్థ్యము దానికి కలదు. చిన్నదానిని పెద్దజేయు నప్పుడు పెద్దదానిని చిన్నబుచ్చునపుడును కామమునకు సంచారీభావము సమకూరును.

ప్రేమకూ కామానురాగముకూ ఇంకొక తేడా ఉంది. ప్రేమ తనప్రభావముచేత మానవునకు దేవత్వ మాపాదింప, కామానురాగ మాతనియందు పశుత్వమును సంక్రమింపజేయును. ప్రేమ భగవదవతారము కావున ఈదేవాంశమును మానవుడెంత అభివృద్ధినొందిస్తే భగవత్సాన్నిధ్యము నంత వేగముగా చెందగలడు. పిమ్మట సాయుజ్యము సులభమగును. అట్లుచేయక కామపరతంత్రుడై కాలముపుచ్చుచుండునా, తనప్రకృతిని పశుభావమున పరిణతము చేయుచూ మోక్షమునకు దూరుడగును.

ఆర్యసాహిత్యమున కామము—

ఆర్యసాహిత్యమున సతీప్రేమాదర్శము, కామానురాగ స్వభావము నెట్లు చిత్రింపబడెనో సూచించితిమి. ఇంద్రియలాలసాచిత్రములూ వాటిరీతులూ కూడా ఆ సాహిత్యమున వివరింపబడినవి. పశుత్వకలితములగు పాపరూపములూ కన్నులకుకట్టినట్లు చిత్రింపబడినవి, అందలి మంచిచెడ్డలు మరుగుపడలేదు. ముక్కోటిదేవతల కధినాథుడగు ఇంద్రుడూ శపింపబడెను, ఆతనిపై మరులుగొన్న అహల్యయూ పాపఫల మనుభవించెను. తారాశశాంకుల పాశవకృత్యమునకు తగినశాస్తి

అయింది. దేవతలని వారికిమాత్రము పాపకళంకము తప్పిందా? మహాకార్యముల సాధించునప్పుడు తప్పనిసరి యైనపట్ల కామోదయము కల్పింపబడినది, కాని చెడుతలంపుచే కాదు. మహాత్ము లవతరించుటకూ కామోదయము కావలయునే! అభీష్టసిద్ధి యగునంతవరకు కవి ప్రబలి పిమ్మట అంతరించును.

ఆసక్తియు లాలసయు నుండుచోట్ల పాప ముండితీరును, కాని ఆసక్తి హీనమగు కార్యము పాపపంకిలము కానేరదు. అట్టి కార్యమునకు ఫలముండదు; అది పాపముగానీ పుణ్యముగానీ కానేరద(Non-moral)ని భగవద్గీతలయందు చెప్పబడినది. కేవలస్వభావజనితకార్యములన్నీ దైహికములు. అవి ఆసక్త్యనురాగసహితము లయినప్పుడే పాపపుణ్యఫల మిచ్చేవి కాగలవు. ఈధర్మసూక్ష్మము మనశాస్త్రములందు పెక్కుతావుల నుదహరింపబడినది. దీనిని దృష్టాంతీకరించుటకే దేవతలయందూ మానవులయందున్నూ కామప్రవృత్తులు కల్పింపబడ్డవి. మహాభారతము గీతలయందలి ధర్మసూక్ష్మములకు విపులవ్యాఖ్యానము. నైసర్గికము, ఆసక్తిశూన్యము, పుణ్యపాపరహితము నగు దైహికకర్మయే వేదవ్యాసునిపుట్టుకకు హేతువు. అట్టిమహనీయుడు పుట్టడముకోసమే ఋషిసత్తముడగు పరాశరునికి మత్స్యగంధిసంపర్కము సంభవించెను, అదీ క్షణికము. ఇట్లే భరతుడు, శకుంతల, కార్తికేయుడును జనించుటకు దుష్యంతుడు, విశ్వామిత్రుడు, శంకరుడు మొదలగు మహాత్ముల చిత్తములందు కామము క్షణికావిర్భావమొంది

నది. ఈధర్మసూక్ష్మమునే పాండురాజు కుంతి కుపదేశించి దేవతాప్రభావమున పాండవుల నావిర్భవింపజేసెను; బలిరాజు అంధుడగు మునిమూలమున అంగ వంగ కళింగాది పుత్త్ర పంచకమును పొందగల్గెను. అంధునకు రూపమునం దాసక్తి యుండుట అసంభవము. ఇప్పు డుదహరించినవన్నీ పాపకలిత మగు కామమున కుదాహరణములు కానేరవు, అవి పాప రహితములు.

ఆర్యసాహిత్యమున గాంధర్వవివాహముచిత్రింపబడుటచే పూర్వకాలమున పడతులు తాముకోరిన వరులను పొందు చుండిరని స్పష్టమగును; అందుచేత అప్పటిస్త్రీలకు స్వేచ్ఛ యుండెననుట తెల్లము కాదా అని అడుగవచ్చును. నిజము-స్వయంవర వివాహములు పూర్వకాలమున లేకపోలేదు. కాని అట్టి యాచారము క్షత్త్రియజాతులయందే ఉండేది; సాధారణజనసంఘమున నది యున్నట్లు దృష్టాంతములు కాన రావు. రాజకన్యల కట్టి స్వాతంత్ర్య ముండుట నిక్కము. వీరుల కెక్కువ గౌరవ మాపాదింపబడు ఆ కాలమున అది రాజనీతిగా చెలగుచుండెను, ఆ నీతినే ఆంగ్లకవియొక డిట్లు తెల్పెను:—

"None but the brave deserves the fair"

„పొందదగు వీరుడే సుందరాంగులను"

సుందరినొకతెను వరించి స్వయంవరమునకు వచ్చిన రాజుల గుణములు సభలో వర్ణింపబడుచుండెను. ఇట్టి వర్ణ

నము చేతనేకదా సునంద ఇందుమతిచే అజుని వరింపజేసింది. శివధనుర్భంగము చేయనేరని వీరుడు సీతను, మత్స్యయంత్రమున లక్ష్యభేదము సేయనేరని వీరుడు ద్రౌపదిని పెండ్లియాడుటకు తగడు. సభయందు రూపవీర్యగుణవర్ణన చేసినంత మాత్రాన కార్యసిద్ధి సమకూరెనా? సుందరీరత్నము లభించినవారు ఏ పోరూలేక ఆమె నింటికి గొనిపోవ సాధ్యమాయెనా? స్వయంవరమున నామెచే తిరస్కృతి వడసిన వారెల్ల పెళ్ళికొడుకుతో పెనగులాడేటప్పుడు అతడు వారి నందరిని జయింపవలయును, లేకుంటే ఆమె యతనికి దక్కదు. ఈగెల్పు అసాధారణకార్యము.

స్వయంవరమున జయము పొందినవారి గుణములను వర్ణించుటేకాక ఓడినవారి మొగము లెట్లు చిన్నవోవుచుండెనో, వా రెట్లు లజ్జాభిభూతులగుచుండిరో, అదికూడా ఆర్యకవులు వర్ణించుచుండిరి. స్వయంవరములయందు వివాహామే ముఖ్యవిషయముకాదు, వీరత్వముకూడా పరీక్షింపబడుచుండెను. కావున అవి పరాక్రమనికషపాషాణములని యెంచదగును. ఈవర్ణనములు చదువువారి చిత్తములు అందలి వీరరౌద్రరసములచే నాకర్షింపబడును, కాని ఇంద్రియలాలసయు, కామానురాగమును వారి కనుభూతములు కావు.

ఆర్యకవులు కామానురాగమునకును నిసర్గప్రేమకును గల తారతమ్యమును నిర్ణయించి మొదటిదానియందలి

మచ్చను రెండవదానియందలి మెచ్చును విపులముగా వర్ణించిరి. కామమున కెట్టి సందర్భములందు పాపము సోకునో ఎట్టియెడ సోకకుండునో వారు చక్కగా తెలియపరచిరి. సూక్ష్మదృష్టికలవారు కావున ధర్మసూక్ష్మమును స్పష్టముగా నిరూపింపగల్గిరి. ఇట్టి నిరూపణమును వారు చేయగడంగి నప్పుడు పలురకముల కామానురాగమును రచనచేయవలసి వచ్చెను. పాపకలితమగు దానిని కళంకయుతముగనే వర్ణించిరి. ఇట్టి చిత్రరచనచేత సాహిత్య గౌరవము తగ్గకుండా ఇతరరస సమ్మేళన మొనర్చి తన్మూలమున గౌరవ మినుమ డించిరి.

సఖ్యప్రేమ—

ఆర్యసాహిత్యమందలి ధార్మికదంపతీప్రేమ పాశ్చాత్యసాహిత్యమున దుర్లభము. అం దింకొకవిధమైన ప్రేమ చిత్రింపబడియున్నది. ఇద్దరు మిత్రులకు, ఇద్దరు సఖులకు ఇద్దరు సమానుల కన్యోన్యముగా ప్రబలు ఈమధురప్రేమను సఖ్యప్రేమ అనదగును. ఇదీ మెచ్చదగినదే. ఆర్యసతులయం దిట్టిప్రేమగా లేక పోలేదు. సతికి పతియు, పతికి సతియు పరస్పర సఖులు, కావున వారిరువురూ ఆప్రేమయందు నిమగ్నులగు దురు. వా రన్యోన్యాదరపాత్రములై మధురాలాపముల తోనూ, ప్రణయచేష్టలతోనూ, కాలము వెళ్ళబుస్తూ, ఒకరి వృత్తము నొకరనుమోదిస్తూ ఉందురు. ఇందు సతీపరతం త్రత పతిదేవత్వమును మిళితము కావడముచేత వీటిసాంగత్య

మున సఖ్యప్రేమయందలి సౌందర్య మినుమడించును; వీటికి తోడు భక్తి ఉదయించుటచేత ఆప్రేమ పరమపవిత్ర మగును. సఖ్యభావమున మాధుర్యమూ, భక్తిభావమున పవిత్రతయూ, మేళవించుటచేతనే ఆర్యనారులు కమనీయశీల లగుచున్నారు. శుశ్రూష సల్పునెడ పతి దైవమును, సల్లాపము సల్పునెడ సఖుడు నగును. ఆర్యనారి గౌరవము గరువమును పత్యవలంబ నమున ప్రభవించు లక్షణములు. మానినియగు భార్యకన్న భర్త కెక్కు డాదరపాత్రమగు పదార్థము లేదు.

సతి కుపిత అయ్యేనా ఏలాగైనా ఆమె నూరడించ డము పతికి విధ్యుక్తధర్మము. అందుచేతనే రాజప్రాసాదముల యందు రాణుల కోపగృహములు ప్రత్యేకముగా నిర్మింప బడుచుండెను. రాణి అలిగినచో రాజ్యమిచ్చియైన ఆమె ననునయించుట రాజధర్మము కావడముచేత కైకకోపోపశమ మునకై దశరథుడు ప్రాణాధికుడు సర్వజనాభిరాముడునగు శ్రీరాముని ఘోరాటవుల కంపెను. దురపిల్లు వైదేహిని సమాశ్వసింప శ్రీరాము డంతఃపురమునకు చనెననియు, పిమ్మట చిత్రదర్శనముననూ మధురాలాపములచేతనూ ఆమె దుఃఖ మపనయించి వెనుకటి దాంపత్యసుఖమును జ్ఞప్తికిదెచ్చి సుఖానుభూతి సమకూర్చెనని ఉత్తరరామచరితమందు కన బడుతూన్నది. లంకావిజయానంతరము కుబేరపుష్పకముపై అయోధ్యకు పోవుచూ శ్రీరాముడు సరస సల్లాపములచేతను తన కీర్తిపరిచయముచేతను సీతహృదయమున కానందము

గూర్చ యత్నించిన రీతిని కాళిదాసు రఘువంశమున అతి మనోహరముగ వర్ణించెను (పదమూడవసర్గ.) దాంపత్యప్రేమ సఖ్యభావమాధుర్యమిళితమైనచో తత్సుఖ మపూర్వమై నిర్వర్ణనీయమగును. ఆసుఖమును ఆనందమును జూరగొను నాసతో భక్తురాలు భగవంతుని సమ్మానపూర్వకముగ అర్చించునట్లు సీత భర్త నారాధింప నుద్యుక్తురాలగును. దారుణములగు ప్రతిజ్ఞావాగురుల దశరథు బడద్రోసి యాతు వచనముల నాతని అలయించిన కైక తత్పూర్వము దేవకార్య నిర్వాహణమున ఆతనికి సాయ మొనర్చి ప్రసన్నునిచేసుకొని ఆతనికృపచే రెండువరముల గడించింది. శ్రీకృష్ణుడు రాధ పాదముబట్టి అలకదీర్ప ఆతడు సాక్షాద్భగవంతుడని ఆమె పూజించును. భక్తిసమ్మిశ్రితమగు సఖ్యప్రేమమూలమున దాంపత్యసుఖ మనుభవించు యోగ్యత భారతరమణుల కబ్బెను. కావున తచ్చిత్ర మార్యసాహిత్యమున కల్పింపబడి దానికి వన్నె తెచ్చింది. ఈ యాదర్శసౌందర్యమున స్వర్గ మందలి పవిత్రత నందనవనమందలి శోభ, మధుమాసమందలి మాధుర్యమును వెలయుచున్నవి.

పాశ్చాత్యప్రేమ స్వభావము—

పాశ్చాత్య సాహిత్యమందలి ప్రేమ యెట్టిది? అది కేవల సఖ్యప్రేమయే. అం దార్యసతీప్రేమయందలి భక్తి, నిస్స్వార్థము, ఏకనిష్ఠ, ఆకాంక్షారాహిత్యము, గౌరవస్ఫూర్తియు కానరావు; ప్రేమాలాపము, మాధురి, దర్పము,

స్వాభిమానము మాత్రమే ఉండును. ఎన్నియున్నా భక్తిమ యైకనిష్ఠ, పుణ్యప్రతిచ్ఛవియు లేనందున ఆప్రేమ పవిత్రము దివ్యమునూ కాజాలదు. అందు మానవప్రకృతియందలి మాధురి ఉందిగాని దివ్యప్రకృతియందలి సౌందర్యము లేదు. మాధుర్యమునకూ ఆనందమునకూ తోడు నిర్మలశోభా వికాసము లేకున్న ప్రేమకు సర్వాంగసౌందర్య మలవడదు.

పాశ్చాత్యసాహిత్యమందలి ప్రేమసౌందర్యము ప్రాయికముగా ఇంద్రియలాలసావిలాసక్షేత్రమున ప్రస్ఫుటితమగుచుండును. ఆక్షేత్రములే దేశదేశములందు కళంకబీజముల నాటుచున్నవి. నిసర్గప్రేమసవంతి కామాసక్తి అను పంకముచే కలుషితముకాగా అంతఃశత్రువిరోధము దాని గమనమును మందగించి పెక్కుచోటుల నరికట్టుచుండుటచేత షడ్రిపు ప్రభుత్వమే సర్వత్ర సాగుచున్నది. మానవులయందు పాశవ ప్రవృత్తి మితిమీరితే వారియందలి మానవత్వమునే కాక దేవత్వమును కూడా నశింపచేయును.

ఆర్యసాహిత్యమందలి సీతవంటి సతీమణిని పాశ్చాత్య సాహిత్యమున గాంచనగునా? హోమరు రచితయగు హెలెన్ సీతకు ప్రతియోగిని (సాటి)గా చేయవచ్చునా, కాని అట్లొంచుట స్వర్గమునకు నరకమును సాటితెచ్చుటే! ఇక షేక్స్పియరుసృష్టిని తిలకించితిమా, మనము వెదకబోవు ప్రేమ మందునకైన కానరాదు. రోమియో మొదట రోసలీన నునామెను చూచి, మోహపరవశుడై, నిద్రాహారములుమాని

చిత్తశాంతి శిథిలముకాగా, వేడి నిట్టూర్పులతో వేడికన్నీ రోడ్చుచూ ఉండగా, జూలియట్ అతని దృష్టిపథమున బడెను. అంతట నాతనిలక్ష్యమూ అవస్థయూ ఒక్కరాత్రిలో మారెను. పిమ్మట జూలియటుపై మరులుగొని వికలచిత్తుడై, ఆమెయింటిచుట్టూ తిరుగుతూ పొంచిపొంచి కిటికీదగ్గరకు బోవును. డెమెట్రియస్ హెర్మియాను చూచి యిట్లే చిత్త వైకల్యమునొంద, అంతవరకూ ఆతనిహృదయమున నెల కొన్న హెలెనా అపసరిల్లింది. ఇట్టిప్రేమ పాశ్చాత్యులకు చెల్లునే కాని మనకు చెల్లదు. దీనిని మనము ప్రేమగా గణిం చక "లాలస" అందుము.

వాల్మీకి ధర్మవీరుని చిత్రింపనెంచి శ్రీరాముని పాత్ర మును నిర్మించి మానవుల ముగ్ధుల నొనర్చెను. పిమ్మట అందుకు ప్రతిగా ఇంద్రియపరాయణుడగు రావణుని పాత్ర మును సృజించెను. ధర్మవీర్యవివశీకృతులై అందరూ రావ ణుని గర్హింతురు. అదేరీతిని మొదట పవిత్రము సుందరము నగు సీతపాత్రమును నిర్మింప, తచ్చిత్రముగ్ధులై అందరునూ ఇంద్రియపరాయణ, కామమోహిత, లజ్జాహీనయునగు శూర్పణఖను చూచి గర్హించి, ఆమె ముక్కుచెవులు లక్ష్మ ణుడు కోయునప్పుడు ఆపని మెచ్చి అతని ప్రశంసింతురు. ఆర్య సాహిత్యమందలి చిత్రము లిట్టివి.

షేక్స్పియరు నాటకరచనయందలి పరిణామ మిట్లుం డదు. వాటియందు మొట్టమొదటనే దుర్దమాంతఃశత్రుచిత్ర

ములు కానవచ్చును,—రావణునిబోలు మత్తమాతంగములు, స్వర్ణప్రసువగు లంకాద్వీపము, ఇంద్రభోగమును, మానసముల నాకర్షింప, వాటి మహత్వప్రకాశమున కన్నులు మూతపడును. క్లియొపేట్రారూపము జగన్మోహనము, మేక్‌బెత్ రాణిని దలచినతోడనే లోభప్రబోధమగును; ఇయాగోచాతురి మానసమును ప్రూన్వడజేయును; ఇట్టిపాత్రములు చిత్తమున జొత్తిల్లి తత్ప్రతిబింబములం దచ్చుపడినవెన్క—సంయోగాంతములందలి పాత్రములకు సందేదీ? సర్వసామాన్యము లగుటచే వాటియందు తారతమ్యము కన్పట్టదు. షేక్స్పియరు కల్పనాప్రపంచమున ఈ రెండువిధముల పాత్రములే కనబడును.—అదంతయు షడ్రిపుసంక్షుభితమగు మానవ ప్రకృతి. విషయాభిభూతములగు పాత్రములయం దాసక్తులగు వారి చిత్తములకు తద్విరుద్ధ స్వభావపాత్రములు రుచించునా? పాత్రిగణనాప్రసంగమున వియోగాంతముల నాయికానాయకులు అగ్రస్థానము నలంకరింతురు, వారివెన్క వియోగ సంయోగాంత (Tragi-Comedy) ముల పాత్రములు, అవెన్క సంయోగాంతపాత్రములును మెప్పు వడయుచుండును.

అంతశ్శత్రుప్రాబల్యము, ఇంద్రియ లాలసాప్రాధాన్యము అంతటా వెలయుచున్నా, కొన్నిచోటుల నది తగ్గును. రోమియోజూలియటుల బోలు సాంఘాతికరిపుప్రాచ్ఛ్వాసము సంయోగాంతములం దుండక తద్బలము క్షీణించియున్నా యౌవనోన్మాదము, అధీరత, లాలాసా వేగమున్నా ఉండి

తీరును. బెనిడిక్ మానసకాసారమున ప్రేమతరంగము లుత్పన్నములైనతోడనే జనించిన అధీరత ఏమని చెప్పను ? అతడు బియాట్రిస్‌కన్న ఎక్కుడు పిరికివాడగును. యువానురాగోన్మత్తయై రోసలిం డార్లెండోను చూడక క్షణమేని నిల్వలేకుండెను. సంయోగాంతములందు ప్రేమచిత్రములు, యౌవనోన్మాదేంద్రియలాలసా కళంకితమూర్తులును కలవు, గాని, అవి ప్రేమచిత్రములో లేక లాలసాచిత్రములో నిర్ణయింప నలవి కాదు. మదోద్రేకమున నాయికానాయకులు సాంఘికవ్యవస్థలను, కుటుంబనీతిబంధములను, తెంచుకొని యథేచ్ఛముగా వ్యవహరింతురు. డెస్‌డెమొనా యవ్వనమదమున విజాతీయుని, విమతస్థుని వరించి రహస్యముగా నింటినుండి లేచిపోయి, నిండోలగమున సిగ్గువీడి తనవృత్తాంతము ప్రకటించి, తన్నే లోకమనియెంచు తండ్రిగుండెలు పగులగొట్టి, ఆతని పరలోకప్రాప్తికి హేతుభూతురా లయింది. జూలియట్ ఇమోజెన్లు కూడా పితురాజ్ఞోల్లంఘన మొనర్చినవారే. హెర్మియా లైసాండరుతో లేచిపోయి, అడవిపట్టి,తన్మూలమున పిత్రాజ్ఞకే కాక రాజనియమములకునూ వెలియైనది.

ప్రణయాలాపములు యువకుల కత్యంతప్రియము లనుటకు సందేహము లేదు. ఆంగ్లనాటకములం దిట్టి వనేకము లున్నవి; వాటియందెల్ల యౌవనోన్మాదమే కాన్పించును. ఉన్మత్తులకు నియమోల్లంఘనము పరిపాటియే కదా! వారు నైతిక శాసనములు లెక్కసేయరు, పాపమునకు వెరవరు.

దుర్దాంతప్రేమావిలమానస అగుటచేతనే కదా జెసికా నిర్ధను డగు జనకునికంట దుమ్ముజల్లి, బెల్మాంటునందలి లారెన్సు దగ్గరకు పరుగెత్తిపోయినది! ఇట్టిపనులు యూరపునందు సర్వసాధారణముగా జరుగుచుండుటచేత షేక్స్పియరు వీటిని తననాటకములందు తరుచుగా వాడెను. హోమరు మహాకావ్యమందును హెలెన్ పారిసుతో లేచిపోయెను. ఇట్టి పాపచిత్రములను నవయువకులగు మనవిద్యార్థులఎదుట సతతము నిలువనిచ్చిన వారిభావములు దూష్యములుకావా? ఇక శృంగారరసపూరితములగు నవలలమాట వేరె చెప్పనేల? యూరోపీయ సంఘధర్మముల ననుసరించిన షేక్స్పియరు నాటకములయం దిట్టిపాపచిత్రములకు కొదవ యుండునా?

ఆజనసంఘములందు ఆదర్శప్రేమ నిర్దిష్టములగు నాటకములు లేకపోలేదు, కాని ప్రేమసౌందర్యమును వివరించునవి మాత్రము చాలాతక్కువ. ఆంగ్లకావ్యములు, నాటకములు నవలలు మొదలగు వాటియం దీలోపము సర్వసాధారణముగా కనబడుచుండునే, వాటివలన మానవప్రకృతి ఉజ్వలితమగునా? పాశ్చాత్య నాటకకవిసార్వభౌముని నాటకములయందు అచ్చటి ప్రజల రీతినీతులు యథార్థరూపమున చిత్రింపబడి యుండుట చేత అవి వారి కాదర్శము లైనవి. రూపగుణమోహమువలన ఉత్పన్నమగు అనురాగము యౌవనమున నెట్లు దుర్దాంత మగునో కనవలెనన్న పాశ్చాత్యసాహిత్యము పఠించవలయును.

శకుంతలా దుష్యంతుల అనురాగము రూపజ మన వచ్చును, కాని ప్రత్యాఖ్యానము చేసేటప్పుడు రాజు ఉత్కృష్టమగు ఆత్మసంయమన మగపరచి పాశవప్రకృతి నణగద్రొక్కెను. అతని మనస్సులోని శకుంతలరూపానురాగము బయట పడకుండ కవి లజ్జయను తెర మరుగుజేసి మాధుర్యము చేకూర్చెను. ఇట్టి మాధుర్యము పాశ్చాత్యప్రేమయందు కానరాదు. లజ్జ కేవల మాధుర్యమును కూర్చుటే కాక అనురాగమందలి పాపకళంకమును పరిమార్జించెను. రూపానురాగము విధివిపరీతమై క్రోధాదులయందు పరిణతమయితే పాపసంకుల మగును. శకుంతలానురాగము ప్రబలాసక్తిగా పరిణమించక పూర్వమే దుష్యంతు డామెను పెండ్లియాడి తదనురాగము విధ్యనుకూలమగునట్లొనరించెను. గాంధర్వ వివాహము క్షత్రియుల కుచితమే కావున పాపము దూరమాయెను.

ప్రాచ్య పాశ్చాత్య ప్రేమ చిత్రణము—

అభిజ్ఞానశాకుంతల మారంభించునపుడే అపూర్వమగు ప్రేమచిత్రము ప్రాదుర్భవించును. శకుంతల ఆశ్రమతరులతాదులయెడ సోదరభావమూని, వాటి కుపచారము చేస్తూ, సఖులతో నిస్సంకోచముగా ప్రణయసల్లాపము సల్పుతూండును. వారు ముగ్గురూ సహకారమునకూ మాధవీలతకును పెళ్లిజేసి క్రీడాకౌతుకము కావించుకొనుచుండ, దుష్యంతుడు ప్రవేశించును. అతనిముందున్న శకుంతల లజ్జాభరము

మానమును ప్రకృతిసంగతముగా వర్ణింపబడినవి, యూరోపీయ సతులయందలి దిట్టతనము, ఆగడము, వాచాలత కానరావు. నిర్లజ్జాకలితప్రౌఢ యైనచో రాజుప్రేమకు పాత్రము కాక పోవును. భావవ్యంజకనీరవత పౌఢల కుండునా? యువతులకు లజ్జ మానమూ భూషణములు. క్రెసిడాయందలి ఛలము, ప్రేమ ప్రకాశకవాక్యసరణి, క్రియాకలాపము, జూలియట్, ఇమోజెన్, హెలెన్ హెర్మియాల ధృష్టవ్యాపారములును ఆర్యయువతుల మితభాషిత్వముకు సాటిరావు. కులాంగనలయందు ధృష్టత అసంగతము అసంభవమని ఆస్యులసిద్ధాంతము. ప్రేమ సంగడినమ్ముృ పాశ్చాత్యులయం దిట్టివి చెల్లును. ప్రేమభిక్షాప్రార్థనము (Court-ship) వారిలో సదాచారము, దీముమాటలాడియూ మక్కువసేతల చేసియూ మరులుగొల్పి కాంతల కరగతల చేయుటయే దీని ముఖ్యోద్దేశము. ఆర్లెండో రోసలిండు నెడ అవలంబించిన దీ ప్రక్రియయే; దీనిని పతిపత్నులవేట యనవొప్పు. వనితలను వలలో వేసుకొన దలచినవారు మనసులోనున్న దానికన్న నెక్కుడు ప్రేమ నటింపవలయును.*ఇది ప్రేమవిడంబన మగునుగాని నిజమైన ప్రేమకాదు. ప్రేయసుల

---

Ferd—

Full many a day
I have eyed with best regard, and many a time
The harmony of their tongues hath into bondage
Brought my too diligent ear; for several virtues
Have I liked several women; never any
With so full soul, but some defect in her

ప్రసంగము విన్నవారికీ చదివినవారికిన్నీ హాస్యాస్పదముగా నుండును. మరిపెంపుసుత్తు ముగియువరకూ ప్రణయవచన ప్రవాహము పారుచునే యుండును. ఇట్టి మధురప్రసంగమున మాౌఖికప్రేమ యెంతో హార్దిక మెంతయో నిర్ణయించుట సులభసాధ్యము కాదు. ఇంకొక చిత్రము—ఒకకాంతను చూచినవెనుక జనించిన మోహసాగరము ఇంకొకకాంతను చూచినతోడనే ఎండిపోవును; ప్రేమాంధులకు యుక్తాయుక్త వివేచనము శూన్యమనుట అందరూ ఎరిగినదే. అర్హా వివేచనము చేసి పాత్రాపాత్రనిర్ణయమొనర్చి వివాహమొనర్పవలెనన్న యౌవనము తగిన యదను కాదని ఒప్పుకొనక తీరదు, ఏల యన రిపుషట్కప్రలోభనము నూపమదమున్నా మితిమీరి చెలరేగు కాలమిది. ఇప్పటి ఎన్నిక లోనిగొంగలమోసము.

---

Did quarrel with the noblest grace she owed,
And put it to the foil: but you, O you,
So perfect, and so peerless, are created
Of every creature's best.

(*The Tempest Act III*)

* పలువురు బాలతుల బాగుగనే నారసినవాడ, నావాడివినికి వారి మాటతేనియ పెక్కుమార్లు దాసించెసె; నానావిధ స్త్రీల కేను వివిధ గుణములబట్టి మక్కువపడినాడను; గాని యెచ్చటైన గల్గినట్టి చెలువుతో జగడముచేసి దానిఁ బాడుచేయులోపం బెద్దియో యొనరెడు గనుక నామనసార నేకల్కినైన నేను మోహించ లే దెన్నడైనగాని; నీవెపరిపూర్ణ్ణరాలవు నిరుపమముగ, సలుపబడితివెల్లరి మెఱుగుల మొనపాయి

అ॥ నా॥ దా॥

షేక్స్పియరీవిషయమునే యోగి (Friar) చే రోమియో కిట్లు చెప్పించెను.

అంతమున్కువ వలచితి వింతలోనె, రోజలీనును విడితే? రోతపడితో?
యువకులకు ప్రేమ కన్ను లందుండుగాని,హృదయమందున నుండబో
దిదినిజంబు*

హెర్మియావివాహము చేయనెంచి ఆమెతండ్రి డెమెట్రియసును వరునిగా నిశ్చయించగా ఆమె లైసాండరును వరించినది, వారిట్లు ప్రసంగింతురు:—

హెర్మి—*అయ్యయో ! నాదు జనకుండు నరయుడాయె నాదు కన్నుల (యోగ్యుడౌ నాథుడెవడో)

తీసి—(అంధవీ వేది గన నీకు నక్కియుగము ?) నాదు బుద్ధిని గాని నీదు నాధునేర్పు.

వివేచనలేనప్పుడును లోనివగతురు (పబలునప్పుడున్నా తలిదండ్రుల మెన్నికకు తనయలు సహామతులగుట ఉచితమని షేక్స్పియర్ ఒప్పుకొన్నట్లే. అందుననే ఆర్యజాతుల యందు వధూవరుల నిర్ణయించుభారము జననీజనకులో, లేక సుజ్ఞులైన అభిభావకులో వహించుట అనాదినుండియు నా

* Is Rosaline, whom thou didst love so dear,
So soon forsaken? Young men's love then lies
Not truly in their hearts, but in their eyes.
(*Romeo and Jiuliet Act III*)

* Herm—I would my father look'd but with my eyes.
Theseus—Rather your eyes must with his judgment look.
*Mid-Nig-Dream*

చారమై యున్నది. యువకులు వివాహభారమును తమ నెత్తుల కెత్తుకొనకుంటే ప్రణయాఖేటనాచారమునకు అవసర ముండదు. ప్రేమ క్రయవిక్రియసామగ్రి కానేరదు. అప్పుడు స్త్రీలకు లజ్జయే నిసర్గభూషణ మయి వారు జాతికీ సంఘము నకూ ఖ్యాతి తెచ్చెదరు. ఇ ట్టిశీలమే శకుంతలకు కల్పింప బడినది.

శకుంతల—మిరాండా

నాగరికప్రపంచముతో నెట్టిసంసర్గమూ లేక నిర్జనమగు ఋష్యాశ్రమమున శకుంతల పెరిగినట్లే, మిరాండాకూడా జన శూన్యారణ్యమున జనకునిచే పోషింపబడెను. శకుంతలహృద యమున ప్రేమోద్రేక ముదయించు ప్రాయమున దుష్యంతు డామెకంట బడెను. ఆమెకప్పు డుదయించిన ముగ్ధత్వము లజ్జనుగూర్చి ముచ్చటించితిమి. మిరాండా తండ్రినితప్ప ఇతరు లనుచూడనేలేదు; కాని ఫెర్డినెండ్ ఆమెకంట బడడముతోనే ప్రౌఢనాయికవలె మాటలాడుటకు మొదలుపెట్టింది! శకుం తలను చూచింది మొదలు రాజే భోగట్టాఅంతా కనుక్కొని వివాహప్రసంగము చేసెనుగాని ఆమె ఆసంగితి యెత్తనేలేదు.

ఇక మిరాండా వృత్తమును పరికించండి:—

*మిరా—నాపై నీకు ప్రేమ ఉన్నదా ?

---

Mir—Do you love me?

Fer—O heaven! O Earth bear witness to this sound,
Beyond all limit of what else in the world, I
Do love, prize, honor you.

ఫెర్డి—అఖిలదేవతలు పృథ్వియు సాక్షులుగా శపథ మొనర్చి చెప్పుతూన్నాను. నేను నిన్ను ప్రేమించుటే కాదు, కులీనవలె సమ్మానింతును, గౌరవింతును.

మిరా—నవ్వు రాదగినచోట నా కేడ్పు వస్తూన్నదే!

ఫెర్డి—కారణ మేమి ?

మిరా—నాహీనత దీనతయు తలంచి ఏడ్చుచున్నాను. నే నీయదలచినదానిని ఇవ్వజాలను. (నీవు స్వీకరింతువనే ఆశ లేదు) నాకేది లభించకున్న నేను జీవించనో దానిని నీ విచ్చెదవో లేదో ? (ఇచ్చెదవనే ఆశ లేదు) అందుకే ఏడుపు

---

Mir—I am a fool
To weep at what I am glad of.
Fer—Wherefore weep you?
Mir—At mine unworthiness, that dare not offer
What I desire to give; and much less take
What I shall die to want. But this is trifling;
And all the more it seeks to hide itself
The bigger bulk it shows-Hence,bashful cunning!
And prompt me, plain and holy innocence!
1 am your wife, if you will marry me;
If not, I'll die your maid: to be your fellow
You may deny me; but I'll be your servant
Whether you will or no.
Fer—My mistress, dearest;
And I thus humble ever.
Mir—My husband, then?
Fer—Ay, here is my hand.
Mir—And mine, with my heart in it.

(*Tempest Act III*)

వస్తూన్నది. ఇది స్వల్పవిషయము. నేను దేనిని మరుగుజేయ యత్నిస్తున్నానో అది బయటికి కుబుకుచున్నది. లజ్జ వగలారా, నన్ను వీడి పోండు. ఆర్జవమా! అమాయికత్వమా! నాకు బాసటై నిలవండి. నీవు నన్ను పెండ్లియాడెద వేని నీకు పత్నినై మెలంగెదను, లేకున్న నీకు దాసినై మనియెదను. నన్ను పెళ్ళియాడెదవో లేదో నీచిత్తము, నీకు దాసి నగుటకు నీ వొప్పుకొన్నా మానినా నేను మానను.

ఫెర్డి—నీవు నాకు ప్రాణములకన్న ప్రియతరవు, నేను నీదాసుడను.

మిరా—నాకు భర్త వగుదువా ?

ఫెర్డి—మనస్ఫూర్తిగా-ఇదే బాసచేస్తున్నాను.

మిరా—ఇదే నీ దాసురాలను.

చాతురీభరితములగు నిట్టిమక్కువమాటలు మిరాండా ఎక్కడ నేర్చుకొంది ? అంతకు పూర్వము పురుషులనే కాంచ లేదు, మూడేళ్ళవయస్సున నిర్జనద్వీపమున నిర్వాసితురా లయి పండ్రెండేళ్ళు తండ్రినిగాక ఇతరుల నెరుగదు. ఘోరాట విని గ్రుమ్మరునామె కిట్టి వాగ్రచనాచాతురి ఎలాగబ్బింది? శకుంతలకు ఇతరజన సాంగత్యమైనా కద్దు—ఋషికుమారు లుండిరి, కణ్వునిజూడ పలువురు వస్తూ పోతూ ఉండిరి; ఆమె నోట నిట్టిచతురవాక్యములు రాలేదు! పెండ్లిమాట నెత్తుట కైనా ఆమెకు సాహసము లేకపోగా, దుష్యంతుడే ఆప్రస్తావ ముపక్రమించెను; అప్పటికీ ఆమె ఇట్టికౌశలమున ఆత్మోద్దేశ్యలన

మొనర్పలేక తూష్ణీంభావమున తలవంచి నిలువబడినది. మానవప్రకృతి అంతటా ఒకతీరుననే ఉండునుకదా, సంఘ సంసర్గమే లేని మిరాండా నాగరక ప్రౌఢభావము తనకు నిసర్గముగ నావిర్భవించినట్లు వ్యవహరించె ననుట వింతకాదా? జూలియట్, రోసలిండ్, బియాట్రిస్, ఇమోజెన్, డెస్ డెమొనా మొదలగు నాగరిక ప్రౌఢల మనోభావములు మిరాండాకు సహజములగునట్లు కవి సృష్టించెను. శకుంతలయందలి సారళ్యము, వ్రీడ, నిసర్గయువతీప్రేమయు పాశ్చాత్య యువతీ సంఘమును గాలించి వెదకినా గానరావు; అట్టికల్పన పాశ్చాత్యులకు అసలే స్ఫురించదు, ఏకవేళ స్ఫురించినా వారిప్రకృతి ప్రతిరూపము కానందున వా రట్టిరచన చేయనే చేయరు. మానవప్రకృతియందలి ఆ మెచ్చు ఆర్యసాహిత్యముననే తగును.

మిరాండాసరళతయందు సాహసము మిళితమయినందున లజ్జయెట్టిదో శమమెట్టిదో ఆమె యెరుగక షోడశముచేత మనసులోని మాటలు వెలిపుచ్చెను. మనోభావములను మాటలతో నెరిగించుటయే సరళతయైనచో ఫెర్డినెండుతోడి ప్రణయసల్లాపమున మిరాండా సరళస్వభావ అనకతీరదు. హృదయోద్వేగమున వెడలు మాటలు అకృత్రిమములు సరళము లనుటకు సందేహములేదు. మిరాండావ్యవహారము స్వాభావికమని ఒప్పుకొన్నా, అది యెంతవరకు సంభవమో పరీక్షించవలెను. ఆమెనోట వెడలు చతురవాక్సరణి, వివాహ

కాతరత, ప్రౌఢభావములూ మానవసంఘమునకు వెలియైన మానినిమానసమున నెట్లుదయించగలవో తెలియదు; అట్టి చాతుర్య మామెకు శోభాదాయకమూ కాదు. యువజన సులభములగు హృదయావేగము ఇంద్రియలాలసయు, ఆ సల్లాపమున ప్రకటితము లైనవి. మిరాండాఫెర్డినెండుల కిద్దరికీ వివాహోత్సుకత సమానమే, కాని ఆతనికన్న ముందు ఆమె తనకోర్కె వెలిపుచ్చినది. ఈ విషయమున శకుంతలకూ ఆమెకూ భేదమేమి? ఆంగ్లకవిసార్వభౌముని రచన యందు యౌవనోన్మాదమునకు ఉత్సుకతకున్నూ మిరాండా పాత్రము ఉత్తమోదాహరణము.

కవిరచితమైన ఆదర్శసృష్టి—

కామక్రోధలోభ మోహహింసాద్వేష ప్రభృతులగు ఆసురిక పాశవ ప్రకృతుల అలౌకికచిత్రములను షేక్స్పియరు రచించినట్లే, ప్రేమదయాదాక్షిణ్యాక్షమా ప్రభృతులగు ధర్మ ప్రవృత్తుల ఉత్కర్షను ఆర్యకవులు రచించిరి. ప్రపంచమున నిట్టి ఉదాహరణములు అరుదుగా లభించును. మేక్‌బెత్ రాణివలెనే సీతాసావిత్రులూ దృశ్యప్రపంచమున దుర్లభ వ్యక్తులు, కావ్యప్రపంచముననే వారిని గాంచవచ్చును. కల్పనా రాజ్యమున ఆదర్శసృష్టిచేసి మానవోత్కర్షను కవి చూపును. ఇట్టి సృష్టిచేయుటే కావ్యరచనకు ముఖ్యోద్దేశము. అనుదినమూ చూస్తూన్న విషయములను చిత్రించుటకు కవి సృష్టి కావలయునా ? ముంజేతికంకణమ్మునకు అద్దమేల? కనబడే

దానికన్న ఘనతరమగుదానినే కవి కల్పిస్తూ ఉండును. అది మానవహృదయముల నాకర్షించి వాటిని శుద్ధిచేసి తత్ప్రవృత్తుల సత్పథమున వర్తిల్లజేయును. వీటినే ఆదర్శము లందుము. సీతా సావిత్రీ పాత్రము లిట్టివే.

అంతశ్శత్రుప్రాబల్య మతిశయిస్తే వర్ణాశ్రమధర్మబంధములు తెంచక తీరదు, అంతతో గాని అది చరితార్థము కాదు. ఇందుకు డెస్‌డెమొనా జూలియట్ పాత్రములే తార్కాణములు. సంసారబాధములు, రాజ సంఘ శాసనములు మొదలగువాటిని ఉల్లంఘించకుండా ప్రేమ యెంతవరకూ స్పందించునో, అట్టి ప్రేమయందు నైతికసౌందర్య మెట్లు నెలకొనునో ఆర్యకవులు నిదర్శనములతో చూపిరి. కామక్రోధాదులు సర్వజంతుసామాన్యములు, అవి మితిమీర విజృంభింపకుండా చేయుటయే మానుషము, ఆర్యసాహిత్యమున నెల్లెడ నిట్టి మానవపాత్రరచనయే కాన్పించును.






## ఐదో ప్రకరణము

---

### సాహిత్యమున మానవప్రేమ

#### మనుష్యత్వ నిర్వచనము

ఆర్యసాహిత్యమందలి ప్రేమాదర్శమున దేవత్వమూ పాశ్చాత్యసాహిత్యమందలి ప్రేమాదర్శమున పశుత్వమూ ఎట్లు రచింపబడినవో తెల్పితిమి. పాశవప్రవృత్తులకును దేవ ప్రవృత్తులకును మానవప్రకృతియే లీలాభూమి. మనుజులందు దేవత్వము విజృంభించినకొద్దీ పశుత్వ మంతరిస్తూండును. సూర్యోదయము కాగానే అంధకారము నశించునట్లు పుణ్యో దయ మయినతోడనే పాపము నశించును. యూరోపీయ సాహిత్యము పాశవప్రవృత్తి నడచుమార్గములను మాత్రమే బోధించును, మన సాహిత్యమువలె దేవప్రవృత్తి నుత్తేజిత మొనర్చు శక్తి దానికిలేదు.

ఆర్యసాహిత్యమున పాశవప్రవృత్తిదమనమునకు రెం

కుపాయములు సూచింపబడినవి:—పాపమునకలి భీషణపరిణామ
ములఁ బరికించి హానివిడనాడుట మొదటిది, పుణ్యాసక్తి
సంపాదించి పాపమునకు దూరగులగుట రెండోవి; ఇంతేకాక,
పుణ్యము ప్రబలినకొద్దీ పాపము కేనంతన తరిగిపోవు ననుటకు
ప్రత్యక్షనిదర్శనముల జూపిస్తూ, పుణ్యమందును దేవత్వము
నను ఉన్నతాదర్శముల నెదుటనిల్పి పాపమును పరిహరింప
జేయుటయందు ఆర్యకవులు మంచి నిపుణత జూపిరి. అట్టి
యాదర్శములయందు చిత్తమును జొత్తిలజేయుటే మను
ష్యత్వ మనబడును.

మానవప్రకృతియందు పాశవప్రవృత్తులు ప్రబలియుం
డుటచే మనుజుడు స్వాభావికముగా వాటి ననుసరించుచున్న
నూ, దేవత్వము వానిని తనవైపాకర్షించడము మానదు. పాశవ
ప్రవృత్తులు దుఃఖభాజనములు, దేవప్రవృత్తులు సుఖాగార
ములు; మొదటివి క్షణికసుఖమే ఒనగూర్పకలవు, రెండోవి
చిరస్థాయియగు సుఖమును చేకూర్చును: అవి సుఖదుఃఖముల
కాకరములగును, ఇవి కేవల సుఖ మాపాదించి చిత్తమునకు
శాంతిని ప్రసాదించును. ఈ శాంతికై దేవుడించు మానవుడు
పాశవప్రవృత్తిని పరిత్యజించి, చింతనవల్లా వివేచనాశక్తిచేతా
నిర్మలచేతస్కుడై ఎప్పుడును తత్సదుపాయములనే వెతకు
చుండును. వీటిని పరిశీలించి వశపరచుకొనుటయందే వాని
మనుష్యత్వము విదితమగును; పశుసీమ నాతడు దాటుటకు
ముఖ్యసాధన మిదే. దేవతల కిట్టి సదుపాయములు వాటికవే

ప్రాప్తించును, మనుజున కవి యత్నసాధ్యములగును; కావుననే మానవుడు దేవతలకన్న తక్కువవాడు. ఇట్టి యుపాయావలంబనము ఎవరికి సహజసిద్ధమౌనో వారియందు దేవత్వము వికసించును; ఇందు కనుకూలకములగు నయరీతులు నియమములు హిందూసంఘమున కలవు; ఆ శిష్టాచారముల ననుసరించుటవలన మానవునకు పశుత్వపరిత్యాగము దేవత్వప్రాప్తియు సిద్ధించును. వీటి నలవడజేయు సంయమమే హిందూసంఘమునకు ప్రధానబలము ; ఇది అతిశయించినకొద్దీ దేవత్వప్రతిష్ఠ ఉత్కృష్టమగును. హిందూసంఘ శిష్టాచారములు దేవత్వప్రాప్తికి కారణభూతము లగుటచే వాటిని త్యజించుట దేవత్వమును తొరగుట కాదా ? *

---

*వేదవిహితంబులును శాస్త్రవిహితములును శిష్టచరితంబులును ననజెప్పనొప్పి ధర్మములు మూడువిధములదనరుచుండు కడగి యిన్నియు సద్గతికారణములు.

దానంబు సత్యంబు తపము యజ్ఞము నార్జవము కామలోభాది వర్జితంబు
గురుజన శుశ్రూష క్రోధరాహిత్యంబు దమము సంతోష మధ్యయననిరతి
దాంబికత్వములేమి దైన్యంబుపొరయమి, అనసూయ అనహంక్రియాభియుక్తి
తలపంగ నాద్యమైతనరు ధర్మము సెప్పకొని యాట నాస్తికగోష్ఠి జనమి
శీలసంరక్ష తీర్థసంసేవ శౌచ మఖిలభూతంబులందు దయార్ద్రిడగుట
మితహితోక్తులు సంశ్రితి మిత్రగుప్తి ఇన్నియును శిష్టచరితంబు లిద్ధచరిత.

అనయంబున్ శమవంతుడై వినుత శిష్టాచార మార్గంబులం
జను పుణ్యాత్ముడు దుర్గతుల్ గడచి ప్రజ్ఞాహార్మ్య సంరూఢుడై
కనుచుండుం బటు మోహపంకజల మగ్నంబైన లోకంబు వీ
కనధోభాగమునందు డింది కడుదుఃఖం బొందగా నవ్వుచున్॥

......నన్నయ

ఈబంధములకు లోబడి సంయమములు కాగలవాళ్ళు దివ్యత్వ మున కర్హులగుదురు. ఇట్టి సంయమము సిద్ధించుటకు సానుకూలమగు సాధనయే మానవవిశిష్ట ధర్మమగును. ఇట్టి మనుష్యత్వమే ఆర్యసాహిత్యమున చిత్రింపబడినది.

సతీగౌరవము—తద్ధర్మబలము.

పూర్వకాలమున భారతరమణులు సతీత్వగౌరవపరిపూర్ణలై వీరతయు సాయమమును వెల్లడిజేసిరని ఆర్యసాహిత్యము దెలుపుచున్నది. ఆ గౌరవస్ఫూర్తిచేతనే తమపవిత్రశీలమును నిల్పుకొనుటకై వారు ప్రాణములవీడుటకు సయితము వెనుదీయలేదు. శత్రువులవెఱపుచే నెందరో రాజపుత్రమానినులు సర్వభక్షకున కాహుతులైరి. సతీత్వగౌరవాపేక్షచేతనే హిందూసుందరులు పతుల యనంతరమున జీవింపనొల్లక వారితో సహగమనము సల్పుచుండిరి. కోరి అగ్నిలోబడువారి గౌరవనిష్ఠయు అంతరంగబలమును సర్వసామాన్యములనజెల్లునా? ఆ బలము నాధారము గావించుకొని వారలౌకిక సంయమ మగపరచి పతుల యోగక్షేమములకై పడరాని పాట్లుపడి, సకలదుఃఖముల సహించి, సర్వమున్నా విడుచుటకు సన్నద్ధులై యుండిరి.

ఇప్పుడు సతీత్వగౌరవము సన్నగిల్లినది కావున మన స్త్రీల కంతరంగబల మంతరిస్తూన్నది. పూర్వుల ప్రవర్తనము కన్న ప్రబలోత్తేజన సాధన మింకొకటి మనము సృజింపగలమా? అట్టిచో సాటిలేని పురాతన సతీత్వగౌరవమును పోషిం

చుట మన కవశ్యక ర్తవ్యము. తదుత్తేజనమున మనస్త్రీజాతికి రానున్న బలము ధైర్యమున్నూ మేరు మందర సమానములు. నిర్లంఘ్యమగు ఆ బలము మనస్త్రీల కబ్బితే వారి కితరనైతిక ధర్మములతో ప్రసక్తిలేదు. కావున పురాతనసతీత్వగౌరవము నుద్ధరించు నుపాయముల కల్పించుకొని తత్ప్రతికూల సాధన ముల బహిష్కరించుట మనకు విధి.

### స్త్రీల సంయమబలము.

సతీత్వగౌరవము నిలువబెట్టుకొనుటకు కౌసల్య అపూర్వాత్మసంయమ మగపరచింది. తనభర్త కైకేయికి పూర్ణముగా వశుడగుటచే సవతియు ఆమెచెలికత్తెలూ అనరాని మాట లనుచుండ, అవి శల్యములవలె ఆమెమనసున నాటి అగ్నికన్న నెక్కుడుగ దహింప జొచ్చెను. అప్పటికేనా ఆమె పతియెడ ప్రేమ విడువక శ్రీరాముడు రాజగునప్పుడు తన దుఃఖములన్నీ అంతరించునను ఆసతోనుండి అట్టి సమయ మాసన్నమై ఆమె లోలోన సంతసించుచుండ, శ్రీరాముడామెను చేరంజని వనములకుబోవ అనుమతి వేడెను. ఆమె గుండె అప్పుడు శతధావ్రయ్యాలై దృష్టిపథ మంధకారావృత మాయెను. వెంటనే హృదయమున శిశువాత్సల్య ముద్బోధ మగుటచే ప్రాణములకన్న ప్రియతరుడగు పుత్రుని వనమున కంపి అయోధ్యయం దామె ఉండజాలనని నిశ్చయించి, రాముని తో వనమున కేగుటయే శ్రేయమని యెంచి, ప్రయాణోన్ముఖయై ఎవ రేమిచెప్పినా పెడచెవిని బెట్టింది, కాని శ్రీరా

ముకు సతీధర్మమును జ్ఞప్తికి తెచ్చి, పతి నింటవిడిచి సతి వనముల కరుగుట అసంగతమని చెప్పగా మారుమాటాడక హృదయావేగమును కర్తవ్యనియమబలముచే నదిమింది. పతి ప్రేమయు పుత్రవాత్సల్యమును ఇరువంకల నామెహృదయము నాకర్షింప, డోలాందోళిత చేతస్కయై, కర్తవ్య మాత్మసంయమ మునకు తోవజూప పతిని పీడి ఆ సతీమణి పదము పెట్టజాల కుండెను. పతిప్రేమతరంగము పుత్రవాత్సల్యతరంగము నణచెను, కావున పుత్రుని వీడ్కొని పతిసేవాపరాయణయై అయోధ్య యందే నిలువగల్గెను.

తండ్రియానతిచొప్పున రామునకు వనవాసమబ్బెను కాని లక్ష్మణు డేల నాతని వెంబడింప వలయు? అట్లాతడేగిన వెన్కనైన సుమిత్ర అలమటింపదాయె! కౌసల్యకన్న ఈమె ధైర్య మెంతమెక్కుడో ఊహింప వశమా? ఆత్మసంయమ గాంభీర్యము బాధ మరుగుటచేత ధైర్యము చిక్కబట్టి పుత్రుని వీడ్కొని పతిసేవాపరాయణ ఆయెను.

పాశ్చాత్యసాహిత్యమున ఆత్మశాసనప్రభావ మరయ వలెనన్న షేక్స్పియర్ రచించిన ఇసబెలా చరిత్రము చూడండి. ఆమె ఐహికప్రేమ నర్వేశ్వరార్పిత మొనర్చెను. ఆర్య వితంతువు పత్యనురాగమును భగవదర్పణము చేయుచాడ్పున ఇసబెలా తన అనురాగమంతయు పరమేశ్వరునిపరము చేసి దైవప్రేమభరితయై బ్రహ్మచర్యము బూని ధర్మమఠము (convent) న ప్రవేశింపనెంచెను. ఆమె ధర్మానురాగ మత్యంత

దర్శనీయము. ఇట్టి చిత్రము కాథోలిక్ మతధర్మమున నే కవి చూపెను. ఆధునికకవిమర్శకు లీమతములను బౌద్ధమతములతో పోల్చెదరు. ఆ తపస్విని తన సోదరుడగు క్లాడియస్ ప్రాణావనోత్సాహినియై అర్ధరాత్రమున నొంటరిగా ఏంజిలో చెంత కేగ, అతడు కామనిశాతశరాహతుడై నిజహృదయ మామె కెరిగింప, ఆమెకో తగించి ధర్మకోపమున (righteous indignation) "నా సోదరుని ప్రాణముకు మారు నాప్రాణముల నిచ్చెదగాని, వాటిని నిల్పుటకు నేను ధర్మధ్వంస మొనర్చి నాశీలమునకు కళంకము సోకనీయన" నెను* పిమ్మట ఆ సోదరుడు మృతియందలి భీతిచే "పాపప్రవృత్తురాలవై నా ప్రాణము గాపాడితివేని అది పుణ్యమే యగున"ని నిరోధింప ఆమె గురుగంభీరస్వరమున "ఓరీ, పశువా! దురాచారుడా! పిరికిపందా! నీ సోదరిశీలమునకు కళంకమద్ది నీప్రాణము లుండ జూచుకొందువా? ఇది ఘోరపాతకము కాదా? సోదరిమాన మమ్మి నీప్రాణములుగొనజూచెదవా? ఇట్టి తుచ్ఛుడు త్వరలో చచ్చుట మేలు," అని వెడలిపోవును.

---

Isabella— O! were it but my life,
I'd throw it down for your deliverance
As frankly as a pin..............

... ... ... ...

And shamed life is hateful.

... ... ... ...

Claudius— Sweet sister, let me live:
What sin you do to save a brother's life,

ఇసబెలా తనసతీత్వము పవిత్రతయు నిల్పుకొని ఆత్మసంయమ మాచరించెను. ధర్మానురాగపూరితయు పరమపూతచరితయు నగునామె ఏంజిలోను తిరస్కరించుట ఒక వింతయా ? ధర్మపరాయణ యగు నామెముందర పాపాకులచిత్తుడగు ఏంజిలో నిల్వగలడా !* ఇట్టియాదర్శము లికకొన్ని షేక్స్పియరు నాటకముల యందుండిన కవి గౌరవమధికతరమై యుండును.

కీచకునిప్రలోభనమున ద్రౌపది యిట్టి ఆత్మసంయమమగుపరిచెను. ఈవిషయమున నీ సతీమణులిద్దరూ సమానముగా తులతూగుదురు.

పురుషుల సంయమము.

భరతునిసంయమము చూడండి. అయోధ్యాసింహాసనమాతని ప్రతీక్షించుచుండెను; తన్మార్గమును చక్కజేసి కైక

---

Nature dispenses with the deed so far
That it becomes a virtue.
Isabella......... O you beast !
O faithless coward ! O dishonest wretch !
Wilt thou be made a man out of my vice ?
Is't not a kind of incest, to take life
From thine own sister's shame ?
..............................
... ... ... ... ... O fie, fie, fie !
Thy sin is not accidental, but a trade,
'T is best that thou diest quickly.
*Measure for measure Act III*

* But virtue, as it never will be moved
Though lewdness court it in a shape of heaven,
So lust, though to a radiant angel linked,

దానిని భరతుని అరచేతిలో బెట్టెను: కాని గద్దియ నాతడాక్ర మింప నియ్యకొనెనా? లేదు, తల్లిముచ్చటలు ముక్కలుచేసి నాడు. రామలక్ష్మణులకు వనవాస మబ్బినందునకదా సింహా సన మాతనికి జిక్కెను! తండ్రిగారు తరలిరి, కుటుంబమంతయు శోకాబ్ధిని కూలియుండెను, అయోధ్యయందు హాహారవ ముదయించెను, సామ్రాజ్యమంతటా సంతస మస్తమించెను; అట్టివేళ నాతడు సింహాసన మధిష్ఠింప దలచునా? పోనీ-ఆ సద్దణగినవెన్కనైన గద్దియ నారోహింపనెంచునా? కల్ల. హృద యము నలమియున్న భ్రాతృభక్తి ప్రబుద్ధమగుటచేత నాతడు తల్లిని దూషించి సింహాసనలోభమును త్యజించెను. పిమ్మట తా నెన్నివిధముల అనునయ వినయములచే శ్రీరాము నయో ధ్యకు గొంపోవలయునని యత్నించినా ఆతడు రాకుండుటచే ఆతనిపాదుకలు సింహాసనమున నుంచి వాటి నర్చించుచూ అనాసక్తుడగు కింకరునివలె రాజ్యపాలన మాచరించుచుండెను. ఆత్మసంయమబలముచే ఆతడు అయోధ్యాసింహాసనమునే కాదు అమరేంద్రు సింహాసనమునైనా అధిరోహించుటకు అర్హత సంపాదించెను. అఖిలభూతముల హృదయపీఠ మలంక

---

Will sate itself in a celestial bed . . .

And prey on garbage.

అలమి పోకిరితనము స్వర్గాకృతిగొని కోరిన చలింపబడదు సుగుణ మొకప్డు దివ్యమూర్తిని గలిసియున్ దృప్తిపడక గుహ్యాచాపల్య మెంగిలికూళ్లుగుడుచు.

అ॥ నా॥ దా॥

*Hamlet Act I*

రించి విరాజమానుడు కావలసినవాడు అయోధ్యకు రాజు కాగోరునా? భాతృభక్తిభరమున నతనికి మానుషత్వము తొలగి దివ్యత్వము సిద్ధించెను.

కచుని సంయమము కనండి. మృతసంజీవనీవిద్య నభ్యసింప నాతడు శుక్రాచార్యునొద్ద శిష్యుడుగాచేర ఆచార్యుని కూతురగు దేవయాని అతనియందు బద్ధానురాగ అయింది. ఎప్పుడు నొకచోట నుండుటచే ఆతనియెడ నామె రూపగుణముగ్ధయై నాల్గుసారు లాతని పునర్జీవితుని చేసింది; అప్పటికీ ఆతడు మరులుకొనలేదు. ఆమె తన్ను వలచినదని ఎరిగియూ గురుపుత్రికగాన నామెయెడ సోదరీభావ మూనియుండెను. విద్యాపూర్తి యైనతోడనే ఆతడింటికి మగుడ నుద్యుక్తుడగు నప్పుడు ఆమె మోహము నాపుకొనలేక వెల్లడించినా కచుడామె నొల్లడాయె. ఆదినుండియు నాతనియందాత్మసంయమము మగుపడుచుండెను. ఆతడు ప్రత్యాఖ్యాన మొనర్చినపిదప దేవయానియందు దాశక్తి ఆవిర్భవించింది.

చంద్రుడు, తార, ఇమోజిన్, హెలెనా, డెస్‌డెమొనా, జూలియట్ మొదలగువారియందు లేని ఆత్మనిరోధము కచదేవయానుల చరిత్రములను దివ్యసౌందర్యకలిత మొనర్చెను. తద్దీప్తిచే ఇంద్రియలాల సాంధకార మంతర్థానమాయెను. ఇట్టిదివ్యచిత్రములు పాశ్చాత్యసాహిత్యమున లభింపవు. దేవత్వము పశుత్వమును శాసింపనేరదు; అట్టిసామర్థ్యము ఇంద్రియనిగ్రహమునకు మానుషత్వమునకు మాత్రమే ఉన్నది.

భక్తిసంయతమైన ప్రేమ—

ఆర్యసాహిత్యమందలి ప్రేమచిత్రము లన్నియు ఆత్మ సంయమ ప్రభావగౌరవాన్వితములు. భక్తిచేతను ఆత్మనిగ్రహముచేత నెట్లు ప్రేమ సంయతమగునో చూడవలెనన్న ఒక్క కౌసల్యాపాత్రమునే కాక వాల్మీకి రచితములగు సీతాసుమిత్రల పాత్రములను కూడా పరిశీలించవచ్చును. వేదవ్యాసరచితము లగు కుంతి, ద్రౌపది, గాంధారి, అరుంధతి, సావిత్రి, దమయంతి మొదలగు పాత్రము లన్నియూ ఉత్కృష్టోదాహరణములు. పురుషులలో రాఘవులు, దుష్యంతుడు, ద్రౌపదీవస్త్రాపహరణదృశ్యమున పాండవులూ అగుపరచిన ఇంద్రియనిగ్రహము అనిర్వచనీయము. భీముడు కోపావేశమున పండ్లుకొరుకుచు యుధిష్ఠిరునిపై దృష్టినినిల్పి ఆత డించుక కనుసన్న చేసెనేని ధార్తరాష్ట్రుల నందరినీ మట్టిలో కలిపివేయుటకు సిద్ధుడై యుండెను; జగదేకవీరుడగు విజయుడును కనులెఱ్ఱజేసి ధర్మజు నాజ్ఞను ప్రతీక్షించుచు దాయలనస్త్రాగ్ని కాహుతి జేయ సంసిద్ధుడై యుండె; ఈదృశ్యమున ఎట్టి ధైర్యము, ఎట్టి ఆత్మనిగ్రహము, ఎట్టి భ్రాతృభక్తియు ప్రతిఫలిస్తూన్నవో చూడండి. గుణవతియు, పతివ్రతయు నగు ద్రౌపది కెట్టి ఆపద ఘటిల్లినదో చూడండి! పాండుకుమారుల బలవిక్రమముల నూహించండి! వారియొడళ్ళు ప్రతిక్రియాగ్నిచే భగ్గున మండుచుండుటచేత ఉష్ణరక్తము ప్రతిరోమకూపమును నించినది, శత్రువులు అధికారగర్వమున నవ్వుతూ గేలి చేస్తున్నారు,

అవమానవహ్ని పరితప్తయగు యాజ్ఞసేని భీమార్జునులపై దీనదృష్టులు సారిస్తూన్నది, ఐనను భ్రాతృభక్తి, ధైర్యము, ఆత్మనిగ్రహమును కోపాంబునిధికి చెలియలకట్టయై వారి సర్వాంగముల నరికట్టుటచే ద్రౌపది అనాథయై

శ్లో॥ ,,హే కృష్ణ ద్వారకావాస క్వాసి యాదవనందన?
ఇమా మవస్థాం సంప్రాప్తా మనాథాం కిముపేక్షసి ? ”

అని మొరలిడుచు భగవంతుని శరణువేడ ఆతడామె మానమును సంరక్షించెను. ఈదృశ్యమందలి ఆత్మనిగ్రహ మింకొక దేశసాహిత్యమున గాంచనగునా?

ఆర్యసాహిత్యమున నిట్టి ఆదర్శము లెన్నో కలవు. వాటియందలి ప్రేమభక్తి సమున్నతము, స్నేహార్ద్రము. సీత ప్రేమ పతిభక్తియందు విలీనమగుటచే ఆమె చేసిన చేతలు, ఆడినమాటలును పతిభక్తిద్యోతకములు, అట్టిభక్తి అదృష్ట శ్రుతపూర్వము. భరతునియందును లక్ష్మణుని యందును దోచున దిట్టిభక్తి యనవచ్చు. “ఉత్తర రామచరితము” న ప్రథమాంకమున సీత ప్రేమయు భక్తియు నిరూపించ బడినవి. తృతీయాంకమున శ్రీరాముడు ప్రేమచే కాతరు డగును. సీతావియోగానంతరము తత్స్వర్ణ ప్రతికృతినే ధర్మ పత్నిగా నిల్పి మనోవ్యాధిగ్రస్తుడై కాలము పుచ్చునపుడు ఆప్రేమయే ఆతనికి జీవాధారము. చతుర్థాంకమున కౌసల్యా జనకుల ప్రేమ కనబడును. ఈరీతిగా సీత వనమందున్నా కుటుంబ ప్రేమ తరంగములలో తేలియాడుచుండుటచే ఆప్రేమ

ఉజ్జ్వలతరమై ఆమెను శ్రీరామునకు ప్రేమసర్వస్వముగను, జనకున కాదరసామగ్రిగను, కౌసల్యాదులకు గృహలక్ష్మిగ నొనరించెను.

హిందువులలో స్త్రీలు అత్యంతాదరపాత్రములు, గృహలక్ష్ములు; తత్కుటుంబముల మానమర్యాదలకు వారే ఆధారములు; పతులను, సత్తమామల భక్తితో గొల్చుతూ పుత్త్రులను, మఱదులను స్నేహముతో నాదరింతురు. ఇంత ప్రాముఖ్యత చెందియూ వారు స్వాతంత్ర్యము, స్వేచ్ఛాచరణము నపేక్షింపరు. వారికది లేని లోటులేదు- చూడండి.

శ్లో॥ ,, పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే
పుత్త్రిస్తు స్థవిరేకాలే స్త్రీయోనాస్తి స్వతంత్రతా॥ ,, *
తండ్రి రక్షించు కౌమారదశను యవ్వ
నమున పెన్మిటి యోగక్షేమముల నరయు
ముసలితనమున పెంచును ముద్దుబిడ్డ
డుండ బోవను స్వాతంత్ర్య మువిద కెపుడు.

సంతానమును తొమ్మిదినెలలును మోసి కని వారిని సదా లాలించి పాలింపవలయును గాన వారికి పరాధీనత స్వాభావసిద్ధము, ప్రాపంచికబంధము లెక్కుడు; భక్తి ప్రేమ స్నేహములచే కుటుంబములోని వారల బంధించి వారి ప్రేమపాశముల తాము తగులువడుదురు. ఈపరస్పరప్రేమ బంధమే హిందూకుటుంబసంస్థల దృఢపరచుచున్నది. అందువలననే అన్యోన్యప్రేమ పెరిగి సాంద్రము కాగా దానికిని భక్తికిని సమ్మేళనము సంభవించుచున్నది. ఇట్టి సమ్మేళన సూత్రము

సంసారాంతర్వర్తి యగుట మనసాహిత్యాదర్శములందే కాంచనగును.

హిందూకుటుంబ నియమములు.

ఆర్యసాహిత్యమున రచింపబడిన ప్రేమాదర్శముల యందు నాయికా నాయకులు పరస్పరమూ "నేను నిన్ను వలతును, దైవసాక్షిగా చెప్పుచున్నాను. నిన్ను తప్ప అన్యుల తలచను-ముమ్మాటి కిది నిజము, నీ వొకక్షణము కనబడకుంటే నాగుండె పగిలి ప్రాణములు నన్ను విడిచి పోవును." అని సంభాషించుట కానరాదు. ఇట్టి క్రయవిక్రయ సామగ్రిరూపమగు ప్రేమ హిందువులకు రుచించదు. తత్సంఘనియమానుసారము ఎవరి కేది కర్తవ్యమో, వారు దానిని ఫలాపేక్ష లేకుండా నిర్వర్తించుటచేతనే యావత్స్నేహము, మమత, దయ, దాక్షిణ్యము, భక్తి, ప్రేమయు ప్రకటితము లగును. వివాహభారము మాత్రమే పెద్దలది, కాని తదనంతరమున భార్యాభర్తలు ఎవరికర్తవ్యమునకు వారు మనసార పూనుకొందురు. రూపపిపాస ఇంద్రియలాలసయు చరితార్థమొనర్చుటే ఆర్యవివాహమునకు ముఖ్యోద్దేశము కాదు గనుక పెళ్ళి వధూవరుల వశమున నుండదగదు. పతియాజ్ఞకు సతి సతియాజ్ఞకు పతిబద్ధులై యుండవలెనను కుటుంబనియమమునకు వారినిద్దరినీ బద్ధులను జేయుటకే వివాహము సృజింపబడినది; నీతిదాయకమూ ఉభయతారకమూ నగు ఈసంసార శృంఖలమున వారిని త్వరగా బద్ధులను చేయడమునకు పెద్దలు

చిన్న వయసుననే బాలకులకు వివాహ మొనర్తురు. యవ్వన స్రోతము ప్రవహించి రిపుషట్కము ప్రబలునప్పటికే దంపతులు సంసారశృంఖలాబద్ధు లయ్యెదరు, ఆ సంకెళ్లు తెంచుటకు తగినసామర్థ్యము వారి కలవడదు—అన్ని వైపులా ఆలానములే, వాటి నూడబెరుకుట సామాన్యులకు వశము కాదు; పరమ భాగవతు లట్లు చేయగలరే కాని ఇతరుల కది చేతకాదు. ఇట్టి నిర్బంధమే లేకుంటే హిందూకుటుంబము లొక్క అడుగు ముందుకు వేయలేవు. యౌవన మంకురించినతోడనే యథే చ్ఛాచరణ మలవడుట హిందూసంఘమం దసంగతము. ఇట్టి కట్టుబాటులతో విలసిల్లు సంఘమున ప్రేమను దండోరా వేసి చాట నక్కరలేదు. అది బాల్యముననే అంకురించి, యౌవనమున వెలుగొంది, సంఘనియమానుసారము అభివృద్ధి చెందుతూ సంసారమను మహాయజ్ఞమున సంపూర్ణవికాసము నొందును. దంపతీప్రేమ పిన్ననాడే అంకురించి, నిరంతరమూ కలిసిమెలిసి యుండుటచేతనూ, గృహకృత్యముల నిర్వహించు చుండుట వల్లనూ, సంతానము కని పెంచుచుండుటచేతా కాల క్రమమున పెంపొంది, బంధుసంపర్కము సాంద్ర మైనకొద్దీ మమత హెచ్చి రోగము, శోకము, సేవ, యత్నము మొద లగువాటిచే పరిపూర్తి చెందును. ఇది ఒకటి రెండు వత్సర రములలో అంతరించేది కాదు, యావజ్జీవము సాగుచుండ వలసిందే!

ఐరోపీయ సంఘములం దిట్లుండదు. స్త్రీపురుషులు

యవ్వనవంతు లగుదాకా వారికి వివాహము కాదు, సంసార ధర్మము లుండవు, స్వచ్ఛందులై వారు జీవములను గడుపు చుందురు. ఇంద్రియలాలస వారియందు ప్రబలముగా నున్నా దానికి తగిన వ్యవస్థ లేర్పడియుండవు, కుటుంబనియమము లుండవు. సాధారణులకు ధర్మము కానీ, కర్తవ్యజ్ఞానము కానీ లేవు, ఉండినా అవశ్యాచరణీయములు కాకుండుటచే ఆత్మనిగ్రహమున కనుకూలపడవు. అందుచే యౌవనప్రవాహ మున కొట్టుకొనిపోతూ ఎవ రెక్కడ తేలుదురో టికానా లేదు. ఇంద్రియప్రాబల్యము నణచడము సులభసాధ్యము కాదు గాన సంసారనియమములు దృఢముకానిచోట్ల యువ కులు స్వేచ్ఛాచరణు లగుట సంభవింపక తీరదు.

హిందూ కుటుంబప్రేమ వికాసము—

ఆర్యప్రేమాదర్శమున దంపతీప్రేమ పరమశాంత మయ్యు వర్ధిష్ణువై తరంగిత మగుచున్నది. అది పూర్వాను రాగబలమున వృద్ధిచెందును. అల్పవయస్కులగు దంపతుల ప్రేమయందు పూర్వానురాగప్రవాహము అంతర్వాహినివై వెల్లివిరియ యత్నించునప్పుడు ఆప్రేమస్రోతాభాసమును గని పెద్ద లానందింతురు. అది బైట కెక్కడ ఉబుకునో అను భీతిచేత నవోఢ లెంతో కష్టమున దానిని దాచయత్నిస్తారు, కాని అణచినకొద్దీ అతిశయించి మెరుపుమెరసినట్లు అప్పు డప్పు డది తేటబడుచుండును. అది అప్రకాశ మగుటచేతనే అతి ప్రశాంతముగనూ ఈమన్మాత్రసంకేతరూపముననూ

హిందూసాహిత్యమున చిత్రింపబడినది. నవోఢానురాగము రానురాను ప్రౌఢమై మగని ప్రౌఢగా నొనర్చి గృహిణిని చేయును. సంసారమంతా గృహిణీప్రేమ పూరితము; ఆప్రేమ కుటుంబమంతటా వ్యాపించి, తండ్రి, అత్త, మామ, బావ, పుత్రుడు, పుత్రికలయందు సంక్రమించును. ఇట్టి చిత్రము లనేకములు ఆర్యసాహిత్యమున కలవు. కౌసల్య, గాంధారి, సుమిత్ర, కుంతి, సీత, ద్రౌపది మొదలగు పాత్రము లిట్టి చిత్రములే. వయసుమీరిన ఆర్యవనితలెల్ల సంసారమాయా మోహాబద్ధులగుట కిదే హేతువు. వారిహృదయములు స్నేహసముద్రములు కావుననే కుటుంబమంతా వారికి వశమగును. గౌతమీ కౌసల్యల వాత్సల్య మిట్టిదే; వారి మాట నెవ్వరూ జవదాటరు.

ఆర్యసాహిత్యమున శృంగారము—

ఈప్రేమను వర్ణించుటకు కాళీదాసప్రభృతి మహా కవులు శృంగారరసము నవతరింపజేసి దాని కనేక భావ భంగులు నిరూపించిరి. ఈవర్ణనలు చూపి చాలామంది ఆర్యసాహిత్యమున ఇంద్రియలోలత్వము వర్ణింపబడలేదా అని ప్రశ్నిస్తారు. అది లేదనము. చంద్రునియందు కళంకము వలె ఆవర్ణనలు సాహిత్యమునకు శోభాయమానములని యెరుగవలెను.

"మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి" కాళిదాసు
"చలువలరేనికిం జెలువొసంగు మలీమసమయ్యు నంకము."

ఆర్యసాహిత్యమున సుధానిధివలె కావ్యరసము వెల్లువచున్నది, కావున అట్టి కళంక మొక వ్యాఘాతము కాదు. చంద్రుడే లేనిచోట కళంకము కళంకమువలె నుండిపోవును.

ఆర్యవాఙ్మయమున శృంగారరసము పెక్కుచోట్ల వర్ణింపబడినది. మనకవులు రసస్వభావము చక్కగా నెరిగిన వారౌటవల్ల ఏరసముచే హృదయము కరిగింపవలెనో కావ్యసమాప్తి యగుసరికి ఏరసము స్థాయీభావము చెందవలయునో, నిపుణతతో గుర్తించి కావ్యముల రచింతురు. అందుచేత కొన్నిటియందు వీరరసము, కొన్నిటియందు కరుణ, మరికొన్నిటియందు మరికొన్నిరసములున్నూ ప్రాధాన్యము చెందినవి. వీటిలో ఒకటిగాని రెండుగాని ప్రధానముగా నెంచి వాటికి తోడు మరికొన్ని రసములు కూర్చి, అంతర్విరోధము ఘటిల్లకుండునట్లు రచనచేస్తే కావ్యము భిన్నరసాలంకృత మయ్యు, అది పరిసమాప్తి యగుసరికి చిల్లరరసములన్నీ మాటుపడి స్థాయీభావము నొందిన ప్రధానరసమే నిలిచియుండును. అందుకే "వాక్యం రసాత్మకం కావ్యమ్" అని ఆలంకారికులు నిర్వచనము చేసిరి.

స్త్రైణ శాసనము—

హిందూకుటుంబములయందు దంపతీప్రేమ వ్యవస్థానుసార మెట్లు పెరుగునో దిఙ్మాత్రముగ వివరించితిమి. పతియెడ పత్ని కనురాగము ఏకనిష్ఠమై అతిశయించినకొద్దీ పతికికూడా

పత్నియెడ అనురాగము పెరుగుచుండును, కాని అట్టి దృష్టాంతములు తరుచుగా కనబడవు. సీత రాముని ప్రేమించినట్లే శ్రీరాముడున్నూ సీతను గాఢముగా ప్రేమించెను. పతియెడ ఏకాంతానురక్తయై కాలముపుచ్చుచుండుట సతికి సానుకూలమే, కాని పత్నీప్రణయపాశైకబద్ధుడై తదితరకర్తవ్యముల నుపేక్షించుట పతికి తగినపని కాదు. పత్నియెడ మిక్కుటమగు అనురాగము పక్షపాతమున్నూ చూపుట స్త్రీలోలత్వమనిపించుకొనును.* అట్లొనరించినయెడల సంఘమున కల్లోలమావిర్భవించి తీరును-గృహస్థు భరింపవలసినది కేవల మతని భార్యయే కాదు, కుటుంబమంతటినీ ఆతడే భరింపవలయును.

---

*ఈవాక్యమును చదివినవారు నాపై కోపగింతురేమో? ఈ అభిప్రాయము అత్యంత సంకుచితము (Narrow)పక్షపాతపూరిత మందురు కాబోలు? కాని పతిపత్నులు అన్యోన్యభావసంకలితులైనట్లైతే ఇతర ధార్మిక, సాంఘిక, నైతికవ్యవస్థలు నిర్వహింపబడనేరవు. అత్యధిక భావానురక్తి అపజనకము. ,,అనాసక్తః సుఖం సేవేత్'' అని కావ్యముల సదుపదేశము. దుష్యంతుడు శకుంతలపై మొట్టమొదట అత్యధికానురాగము ప్రకటించెననే మనము భావింపవచ్చును. కాని అప్పుడైనా అతడు కర్తవ్యమును మరచెనా? చూడండి—

అనసూయ—వయస్య, బహువల్లభా రాజానః శ్రూయంతే. యథా అవయోః ప్రియసఖీ బంధుజనశోచనీయా నభవతి తథా నిర్వాహయ.

రాజా—భద్రే, కిం బహునా—

పరిగ్రహబహుత్వేపి ద్వే ప్రతిష్ఠే కులస్య మే
సముద్రరశనా చోర్వీ సఖీ చ యువయోరియమ్.

రాజైనచో విశాలసామ్రాజ్యమందలి ప్రజలకెల్ల పతి యగును, వారి నుద్ధరించుభార మాతనిపై బడును. పత్నీకర్తవ్యము

అన—వయస్యా, రాజులు బహువల్లభల పరిగ్రహించువారని వినికి, మా ప్రియసఖి బంధుజనశోచనీయ గాకుండు విధ మాచరింపవలయును.

రాజు—కళ్యాణీ, పెక్కుమాట లేల?

క. కలిగిన బహుభార్యలు, మత్కులప్రతిష్ఠలుగ నుండుదురు వీరిరువుల్,
జలనిధిమేఖలయయితగు నిలయును స్మరజీవనాడి యీ మీచెలియున్.

చూచితిరా? రాజులకు బహుభార్య లుందురు, వారిలో నెవ్వరికీ ఏ లోటూ రాకుండా చరించుట చాలా కష్టము. ఐనా, మా శకుంతల కేలోపమూ లేకుండా మీరు కనిపెట్టిచూడండి అని అనసూయ వ్యంగ్యముగా రాజులు స్త్రీలోలులు కాకతప్పదని నిర్ధారణ సూచించింది. అది గ్రహించి తనకులగౌరవము నిలుపపెట్టుకొనడానికి—„నాకు చాలామంది కాంతలున్నా అందు ముఖ్యు లిద్దరే—మొదటిది భూమి, రెండవది మీ శకుంతల అని జవా బిచ్చి నాడు—దీని అర్థ మిది—రాజుకు ప్రథమగణ్యము రాజ్యము, దానిని సరిగా పాలించుట అతనికి ముఖ్యవిధి—భార్య—తదితర స్త్రీలు, భోగములూ గౌణములు (Secondary) గాని ముఖ్యములు కావు—రాజ్యపాలనము వెనకబెట్టి భార్యలూ భోగములూ సర్వమని భావించుట తప్పు అని సూచించి రాజులు స్త్రీలోలురను వాదమును ఖండించి పూర్వపక్షము చేసినాడు—

పురుషుడు స్త్రీకి వశుడయ్యేనా ప్రాచ్యపాశ్చాత్యసంఘములకు భేదమే యుండదు. హిందువులారా, పాశ్చాత్యరీతుల ననుసరింపకుడు, మన పురాణములోని శ్రీకృష్ణుని స్త్రీలోలత్వము ననుసరింపక శ్రీరాము నాదర్శముగా గొనుడు. కామినీవాగురుల జిక్కి కర్తవ్యమును త్యజింపకుడు.

కుటుంబసీమను దాటిపోదు, పతికర్తవ్యమో, ప్రపంచమంతటా పాకును. ఇట్టి కర్తవ్యతాజ్ఞానమును మదిని నిల్పి భార్యాసక్తిని తనవశమందుంచుకోవడ మత్యావశ్యకము. ఇట్లు చేయుటకు శక్తి లేకపోవుటచేతనే మేఘదూత యందలి యక్షునకు కుబేరుడు దేశాంతరవాసశిక్ష విధించెను. యక్షుని అగాధపత్నీప్రేమ అజరామరమగు కాళిదాసు లేఖినిచే కావ్యరూపమున చిత్రింపబడినది. ఇంకొక దిక్కున చూడండి—శ్రీరామచంద్రుడు ప్రజానురాగమునకు వశవర్తియై సీతను వనములకంపెనుకదా, భార్యపై ఆతనికి ప్రేమ లేదనుకోవచ్చునా ?...ఆర్యసాహిత్యమున గాఢమైన పతిప్రేమకు పతిభక్తి అనిపేరు; అగాధమగు పత్నీప్రేమ పత్నీభక్తి కాదు, స్త్రైణత అనబడును, ఇదే స్త్రీలోలత్వము. హిందూ సంఘమున నియమరక్షణార్థ మేర్పరుపబడిన వ్యవస్థల పాటించుటే మనుష్యత్వ మనబడును.

స్వాధీనత–స్వేచ్ఛాప్రవృత్తి.

హిందూసంఘ నిర్మాణమునుబట్టి మానవప్రకృతి యందలి పశుభావము వికాసము చెందనేరదని మనమూహింపవచ్చును. దేశాచారములన్ని మనుష్యత్వము దేవత్వమూ పోషించుటకనుకూలించును గనుక వాటియధీనమున నుండుటే మానుషత్వ దేవత్వముల అధీనమున నుండుట. స్త్రీపురుషులు మానుషత్వసీమను దాటకుండునట్లు వారిని నియమబంధములలో నిల్పి యుంచడమే సంఘనీతికౌశలము

పశుత్వమువిడిచి దేవభావా శ్రయముననుండడము చేతనే మానవు లకుఆత్మనిగ్రహమలవడుతుంది. దీనికితోడుపరమార్థపరతంత్రత సిద్ధించినా మనుష్యునకు స్వాధీనత చిక్కినట్టే. ఆత్మ పరమార్థపర మగునప్పుడే నిజమైన స్వేచ్ఛ (Freedom, Liberty) అలవడిన దన్నమాట. ఇట్టి స్వాధీనత పోగొట్టుకొని ఇంద్రియములకు వశులై వాటిచిత్తమువచ్చిన రీతిని మెలగువారు స్వాధీనులు కారు, ఇంద్రియేచ్ఛాధీనులు. ఇది నిజమైన స్వేచ్ఛా కాదు, శ్రేయోదాయకమూ కాదు. దీనికి స్వైరవిహారము (License) అని పేరుపెట్టవచ్చును. ఇట్టి స్వచ్ఛందవిహారమును విడిచి శ్రేయోదాయకము ప్రకృతిసిద్ధమునగు స్వాధీనపథమున సంచరించువారు మానుషత్వమునకు తగినవారు. మన దేశాచారముల ననువర్తించుటచేతనే ఇది సిద్ధిస్తుంది-అట్టి పదవికి సాధనభూతమైన ప్రేమప్రవృత్తి హిందూసంఘనియమములం దంతటా కద్దు, ఆర్యసాహిత్యమున కలదు.

ఆర్యసాహిత్యమున ప్రేమగౌరవము.

ఆర్యసాహిత్యమున ప్రేమవికాసము భక్తియందు తేటబడును; అందే పుట్టి, అందే పెరిగి, అందే పరిణతి చెందును. ఇట్టి గౌరవము పాశ్చాత్యసాహిత్యమున గానరాదు. పతిభక్తి భ్రాతృభక్తి, పితృభక్తి, మాతృభక్తి, గురుభక్తి, వాత్సల్యము, భార్యానురాగము, శిష్యానురాగము మొదలగు ప్రేమవికాసభావములు అందు లేవు. సీత, లక్ష్మణుడు, శ్రీరాముడు, యుధిష్ఠిరుడు వంటివా రున్నచోటులందే ప్రేమగౌరవ ముండును.

బాల్యవివాహముల పరిణామము—

ఆర్యుల ప్రేమాదర్శములయందు ప్రేమగౌరవమే కాక ప్రేమసౌందర్యము కూడా కలదు. సీతపాత్రము సుందర మని ఒప్పుకొంటే ప్రేమసౌందర్యమహిమను మెచ్చుకొన్నట్లే. అట్టి నిసర్గప్రేమచిత్రములు మన సాహిత్యమున అనేకము లున్నవి. స్త్రీలయందు నిసర్గప్రేమను పాదుకొల్పుటకే హిందువులందు బాల్యవివాహము లేర్పడినవి. కోమలమతులగు బాలికల నూతనానురాగము భర్తలయందూ గురుజనము నందున్నూ చిన్నప్పటినుండీ నిక్షిప్తమగును. హృదయమందు ప్రేమకళిక దరవికసితము కాకపూర్వమే కోమలస్వాంతలగు కన్యలు యోగ్యులగు పతుల కర్పించబడుదురు. ఆప్రేమ నానాటికి వికసించి యౌవనప్రాదుర్భావమున నుదయించు అనురాగముచేత వృద్ధిచెంది పత్యర్పిత మగును. కిశోరావస్థ నుండీ అత్తవారింట లాలనపాలనముల నొందుచుండుటచేత అచ్చటివారియందు మమతభక్తి పెరిగి పెద్దలను సేవించునిచ్ఛ ప్రబలమగును. అందుచేత ఆర్యకుటుంబములు స్త్రీజనమునకు ప్రేమాలవాలములు, శాంతినికేతనములయి వారిమాన సములందు చాలాసద్గుణములు సంచితము లగును. పాతి వ్రత్యము, ప్రేమ, స్నేహము, మమత, భక్తి, సారళ్యము, సత్యానురక్తి, దయ, క్షాంతి, ధైర్యము, శాంతి, దాంతి, కోమలత్వము, అణకువ, సాజపుసిగ్గు, ఓపిక మొదలగు గుణ

ములచేత వారు భూషిత లగుదురు.* మన సాంఘిక వ్యవస్థలకూ, శిశుకూ, బాల్యవివాహములకూ పరిణామ మిది ఈ వ్యవస్థలను తారుమారు చేస్తే ఫలము వికటించును, కావున ఈ యాచారమునకు భంగము వాటిల్లకుండా మనము పాటుపడవలయును.**

---

*పడతులు అత్తింట నేర్చుకొనదగు నంశముల నన్నిటిని కాళిదాసు కణ్వమహర్షి చే నిట్లు చెప్పించెను—

శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే
భర్తుర్విప్రకృతాపి రోషణతయా మాస్మ ప్రతీపంగమః
భూయిష్ఠం భవ దక్షిణాపరిజనే భాగ్యేష్వనుత్సేకినీ
యాంత్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః॥

పనివిని కొల్వు పెద్దల; సపత్నులతోట ప్రియాళివృత్తిగై
కొను; పతియల్గ నల్గి ప్రతికూలవుగాకుము; భోగభాగ్యముల్
గనుగొని పొంగబోకు, దయగల్గుము సేవకులందు, నాతి గాం
చును గృహిణీపదం బిటులు; చూడగ లాతి కులాధియే సుమీ.

**ఈ యభిప్రాయము సమంజసమని నాకు తోచదు. బాల్యవివాహమున గుణమున్నది, దోషము లున్నవి; దోషములే ఎక్కువని చెప్పవచ్చును. వాటిని రూపుమాపకుంటే బాల్యవివాహము దురాచారమనే నాతలంపు. దోషము లందరికీ స్పష్టమగుటచేత ఇక్కడ విస్తరింపలేదు. ప్రౌఢవివాహము లాచరణములోనికి ఎచ్చేదాకా యువకులచెవులను బాల్యవివాహదూషణము సోకనీయరాదు. మొదటనుండీ సత్సహవాసము, నైతికశిక్ష, సద్గ్రంథపఠనము మొదలగు పరిస్థితులను సమకూర్చుట యుక్తము. యువకులు బ్రహ్మచర్యము పాలింపలేక, అభిభావకు లందుకు తగిన ఏర్పాటులను చేయనేరనిచో బాల్యవివాహము లొనర్చుటయే మేలు.

విదేశీయ ప్రేమయందలి పతిపత్నీ సామ్యభావము—

హిందూసంఘములయందును, కుటుంబముల యందున్నూ దృఢబంధమై గానవచ్చెడు భక్తి అను అపూర్వ పదార్థము విదేశీయసంఘములందు లేనందున తత్సాహిత్యము నందు కూడా అది మృగ్య మగుచున్నది. వారి దాంపత్యము నం దెచ్చుతగ్గులూ, ఒక రొకరియధీనమున నుండుటయూ లేవు. ఆ ప్రేమ అంతా వినిమయము-ఇచ్చి పుచ్చుకొనుట. "నీవు నన్ను ప్రేమించితివా, నేను నిన్ను ప్రేమించెదను. అట్లుకాదేని నీవు వేరు, నేను వేరు; నీదారి నీది, నాదారి నాది." ఇది వారి దాంపత్యసరణి! పతిపత్నీత్యాగము, స్త్రీలకు బహువివాహములు, యౌవనమున స్వేచ్ఛాచరణమును వారికి సదాచారములు కావున స్వచ్ఛందవృత్తి, పతిపత్నీసమత్వము వారియందు ప్రబలమై యుండును. ఆ సాహిత్యమందున్నూ ఆ రెండుధర్మములే ద్యోతకము లగుటచేత దానినే సదా పఠించువారి మానసములందు స్త్రీలు పురుషులకు లొంగి తిరుగనేల? పురుషులకంటె వారి తక్కువ ఏమి? ఇది అన్యాయము, పతిపత్నీసామ్యభావము న్యాయము, అను దృఢాభిప్రాయము కలుగును. ఇట్టి భావములు మన సాహిత్యమునా ఇప్పుడిప్పు డవతరిస్తూన్నవి, నవనాగరికు లీ నూతనాదర్శములను పొగడుచున్నారు. మన సంఘనియమములు ననుకరించు మన సాహిత్యమున ఈభావమునకు చోటులేదు, ఒకవేళ మనము చేర్చినా అది తక్కినవాటిలో యిముడదు; ఆచరణ మోలాగు

అభిప్రాయ మోలాగూ ఉంటే ఉపద్రవము వచ్చితీరును. వివాహబంధమున తారుమారులు లేక పతిపత్నీసంబంధము జీవావధియై, భక్తి ప్రేమసూన్యతమై, సతీత్వలీలాక్షేత్రమైన ఆర్యసంఘమున సరళత, ప్రేమ, కోమలత, లజ్జ, దయ, ఓరిమి మొదలగు గుణములు స్త్రీజనమున కలంకారములుగ నున్నవి కావున పతిపత్నీసమత ప్రబలిందా ఆచారవిప్లవము తప్పక సంభవించును. మనసంఘమున ఎచ్చుతగ్గులూ, ఆత్మనిగ్రహమూ (స్వాధీనత) ఉండవలెను. పాశ్చాత్యసంఘములందున్నది స్వేచ్ఛాచరణము.

ఆర్యసాహిత్యసమాలోచ నావశ్యకత—

ప్రాచీనప్రతిష్ఠితములు, భక్తిప్రేమపూరితములు నగు మన సంఘరీతు లంతరించి పాశ్చాత్యసంఘమర్యాద మనదేశమున ప్రతిష్ఠితము కావలెనని కోరువారుందురా? ఈరెండింటి ఘటనాప్రణాళులు విపరీతములనీ, తత్ప్రేమాదర్శములు విషమములనీ ఉదాహరణలతో నిదివరలో వివరించియుంటిమి. ఆర్యప్రేమాదర్శమున భక్తిశ్రద్ధాది ఉత్కృష్టప్రవృత్తుల ఉత్తేజనమూ, స్ఫూర్తి, ధర్మనీతిప్రాబల్యము నున్నవి, పాశ్చాత్యాదర్శమున షడ్రిపుప్రాధాన్య ముంది; రిపుషట్కము అస్థిరమగు నింద్రియసుఖానుకూలము. మన ఆదర్శమున ధర్మనీతిశాసనాధీనత యుండి, వారి యాదర్శమున స్వార్థపరత్వము పతిపత్నీసమతా యున్నవి. ఇందు యథార్థమైన స్వాధీనత, అందు స్వేచ్ఛావృత్తియు నున్నవి. ఇట్టివైషమ్యము గల

ఆదర్శములకు ఏకత్ర సమావేశ మెన్నటికీ సరిపడదు. మన ఆదర్శములను మాని వారి యాదర్శముల నవలంబిస్తే క్రొత్త భావములు మనహృదయములందు నాటి కాలక్రమమున స్వదేశగౌరవము సన్నగిల్లును. పవిత్రము సుప్రతిష్ఠితము నగు మనసంఘమును దోషసంకులమగు విదేశాచార సంసర్గమున పంకిలము చేయరాదు. దేవత్వమానుషత్వముల వీడి పశుత్వమున పడగోరు వీరిడి యుండునా?

మనయాచారములలో లోపములున్న కాలానుసారముగా వాటిని దిద్దుకోవలయు గాని సరిక్రొత్త పుంతలలో జనకూడునా? ఇట్టి యాపద లక్కడక్కడ పొడచూపుచున్నవే, అవి తొలగు టెట్లు? విదేశసాహిత్యపఠనము మనకు తప్పనిసరియైనది; పొట్టపోసుకొనుటకే కాదు, అది చదువకున్న చాలా విషయములకు మనము వెలియగుదుము. కావున తత్పఠనమొనర్చుచూ అందలి నీచభావములు మనహృదయములందు కుదురుకొనకుండా జాగరూకతతో గమనించవలెను. విదేశ సాహిత్యముతో బాటు మనసాహిత్యముకూడా పఠించడమే ఆ విషమునకు విరుగుడు. రెండోది మన కుటుంబాచారములను విదేశదురాచారపన్నగము కరవకుండునట్లు నడపవలెను. అనాదినుండీ ఏ సాహిత్యపఠనమున మనసంఘమునకు సద్గుణము లలవడి అది వినీతము సుశిక్షితము నయ్యెనో, అట్టి సాహిత్యమునకు విముఖులము కాకుంటే మనకు తప్పక శుభము చేకూరును. అందలి సాధుత్వము, పవిత్రత, సంయ

మము, వినయము, నీతిసౌందర్యము, మహోపదేశములూ మనమానసములయందు బాగా నాటితే విదేశదుర్భావములను బహిష్కరించి మనసంఘము విధ్వస్తము కాకుండునట్లు జాగ్రత్తపడవచ్చును.






## ఆరో ప్రకరణము.

---

### సాహిత్యమున వీరత్వము.

వీరుల ఆదర్శము—

ఆర్యకవికులగురువగు వాల్మీకి సీతపాత్రమున సతీత్వపరమావధి నిరూపించినట్లు శ్రీరామపాత్రమున వీరత్వపరమావధి నిరూపించెను. ఆర్యలలనాసౌందర్యము, ప్రేమ, భక్తి, దేవత్వమూ సీతయందగుపడును; ఆర్యపౌరుషము, గౌరవము, వీరత్వము, రాజవైభవదివ్యతేజమున్నూ శ్రీరామునియందు గాంచనగును. కులమునకూ జాతికీ గౌరవము తేవడమే ఆర్యుని ముఖ్యకర్తవ్యము, శ్రీరామునియందిదే కనబడును. ఆతడు రఘుకులతిలకుడు, క్షత్రియశేఖరుడు. అట్టి గౌరవమగపరుచుటకే వాల్మీకి మొదట దశరథుని పాత్రమును చిత్రించి అందు శౌర్యము, రాజ్యశాసనచాతురి, ప్రభుత్వము, యశము, మంత్రణ, కార్యకౌశలము, సంపద, సహృదయత, దుర్గసంపత్తి, చతురంగబలము, ధర్మపరాయణత,

తపస్సు, విద్య, వివేకమున్నూ వర్ణించి చూపెను. అయోధ్య యందలి అప్పటి సుఖము, సంపద, సౌందర్యమున్నూ గాంచి చకితుల మగుదుము, అతనికి సముడు మరొకరాజు లేడని పించును. కాని అనంతరము ఆతనికన్న నుజ్జ్వలతరమగు నక్షత్ర మీరాజకులాకాశమున పొడుచును, తత్ప్రభావమును విశ్వామిత్రు డందరికీ ఎరిగించును. రఘుకులమం దుదయించిన ఆ వీరశిఖామణి "కూకటిముడికినై కురులు కూడని నాడే" ఋష్యాశ్రమములందలి రాక్షసపీడయు తపోవిఘ్నములు నంతరింపచేయగలడని ఆ ముని జ్ఞానదృష్టిచే గాంచగల్గెను, కనుకనే నిండోలగమున తనవెంట శ్రీరాముని పంపుమని దశరథుని ప్రార్థించునప్పుడు శ్రీరాముని ప్రభావము విదితమై మన కాతనియెడ గౌరవము పుట్టును; ఆ దివ్యనక్షత్రప్రభ అప్పుడు మనకళ్ళకు గట్టును. ఈలాగే పరమభాగవతుడగు నారదముని మూలాన శ్రీకృష్ణప్రభావము లోకమునకు విదిత మగును.

వీరకార్యనిర్వహణముకోసము విశ్వామిత్రుడు శ్రీరాముని కొనిపోయినపిమ్మట అత డాకరినకర్మయందు కనపర చిన వీర్యశౌర్యములు వాల్మీకి చక్కగా వర్ణించెను. అంతలో నాగక అంతకన్న వీరత్వనికషపాషాణమగు వేరొకచోటి కారాణ్ముని కోదండపాణిని గొంపోయెను. మిథిలలో సీతా స్వయంవరసభకు వీరాధివీరు లెందరో పోయి శివధనువు నెక్కుపెట్టలేకపోగా శ్రీరాము డాపనికి బూని అనాయాస

ముగా నావిల్లు నెక్కిడి తన అమానుషవిక్రమమును యశో విస్తారమును భరతఖండ మంతటా ప్రకటించెను. ఇంతతో సహా సంతుష్టి చెందక దీనికన్న కఠినతర కార్యమునకు శ్రీరాముడు పూనుకొనవలసివచ్చెను. వివాహానంతరమున "అయోధ్యకు పోవు దారిలో నృపవైరియైన పరశురాముడు కారుమొయిలు కరణి చాపధరుడై, కాలమృత్యువో యన" నరికట్టెను. ఇరువదియొకసారి పుడమిని క్షత్రశూన్యము జేసిన మహావీరుడు, నిరుపమానవీరత్వసంపదచే గ్రాలు కార్తవీర్యుని పీచమడచిన భీమబాహాబలుడు, రాజనువానినెల్ల రాసి విడిచిన అప్రతిమ ప్రతాపవంతుడు కయ్యానికి కాలుదువ్వి హరధనువును మించిన హరిధనుస్సు నొకదాని "నెక్కిడుము లేకున్న చంపెద"నని శ్రీరామున కందించెను. అనర్ఘ రాఘవుడా ధనువు నవలీల నెక్కుపెట్టి పరశురాముని మించిన వీరుడని ప్రకటించిన తోడనే "ఖండనప్రచండపండితుండ" వని పరశురాముడు మెచ్చుకొనెను;* తనయుని అద్భుతశౌర్యమునకు లోలోన తనిసి దశరథుడు ప్రఫుల్లచిత్తమున తనపట్టణమును చేరెను.

బాల్యమున నిట్టి నిస్తులవీరత్వసంపద గూర్చి వాల్మీకి

---

*నావిల్లెక్కిడినప్పుడ, నీవు చతుర్భుజుడవౌట నిక్కము, మదిలో భావించి కంటి, నితరుల కీవిక్రమబాహుశక్తు లెందును గలవే?
ఉల్లమున లజ్జదోపదు, ముల్లోకములేలు దేవముఖ్యునిచే నే నిల్లీల భంగపడ, నుద్యల్లలిత కృపాభిరామ దశరథరామా.

... రామాయణము.

శ్రీరాముని చిత్రించుటగాంచి అతని నతిక్రమింపనెంచి వ్యాసుడు కృష్ణలీలల కల్పించెను. పిమ్మట శ్రీరాముని గౌరవోన్నతి నిలువబెట్టదలచి కాళిదాసు రఘువంశము నంతయు వర్ణించెను. ఇందలి చిత్రము లతివిచిత్రములు, రచనానైపుణియు అనన్యసామాన్యము. మొదట దిలీపుని చరితము, పిమ్మట దానిని క్రిందుసేయు రఘుమహారాజు చరిత్ర వర్ణించి, కులగౌరవమును పెద్దచేసి కులమునకంతటికీ కీర్తితెచ్చుటకు అతనిపేర నావంశము బరగజేసెను. ఇంతతో నాగక కుల పురుషులందరిలో ఘనుడై గౌరవనీయుడైన శ్రీరాముని చరిత్ర వర్ణించెను. అప్పటికి రాఘవుడన్న శ్రీరాముడే అని సూఛిత మయ్యెను. ఒక్క రఘుకులమునకే కాక సూర్యవంశమునకే తిలకాయమానుడగు శ్రీరామచంద్రునిముందు తక్కిన రాజు లెల్ల తారలైరి; కులగౌరవమున కాతడు ఉనికిపట్టాయెను.

పృథ్వియం దేరాజవంశమూ ధారావాహికాక్రమమున ఇట్టి ఉత్తరోత్తరోత్కర్షలాభము గనుట వినలేదు చూడలేదు. దిలీపుడు, రఘువు, అజుడు, దశరథుడు, శ్రీరాముడు నొకరితరువాత నొకర రయోధ్య నేలినారు. శ్రీరామునితో నావంశము పరమావధిని చేరింది. తరువాత కుశుడు, అతిథి, సుదర్శనుడు మొదలగు రాజులందరూ దివిటీముందర దీపాలై శ్రీరాముని ఉత్కర్షనే ప్రతిపాదించిరి. అతనికి సముడే లేనప్పుడు అతని మించిన వారెట్లుందురు? స్కాట్లెండ్ ఇంగ్లెండుల సీమాంత (Border) ప్రదేశీయులగు రాజుల రక్త

రంజితవీరత్వ యశోగానమున సర్ వాల్టర్ స్కాట్ పరమా నంద భరితుడైనట్లు రఘువంశరాజుల యశోగానమున కాళిదా సపరిమితానంద భరితు డాయెను.

శ్రీరాముని నిరతిశయభుజబలము క్షాత్ర తేజము నభి వర్ణిస్తూ వాల్మీకి అతనియం దింకొవిధమైన వీరత్వము కల్పిం చెను. హరిహరధనుర్భంగములయందును రాక్షసకులనాశన మందును అతని బాహ్యవీరత్వమును ప్రకటించెనుకదా. ఈవీరత్వ సంపదచేత చాలామంది రాజులు దిగ్విజయ మునర్చి యశస్సాం ద్రులైరి. అందుచేత శ్రీరామునియం దింకొక ఉత్కర్ష నుంచెను. అందు భరతఖండమందలివీరులే కాక ప్రపంచ మందలి వీరులెల్ల అతనికి తీసిపోవుదురు. అది ఆభ్యంతరిక వీర్యము, దానిని వాల్మీకి రామాయణము మొదటిభాగమున వర్ణించనేలేదు. రెండురకముల వీరత్వమును గూర్చి ముచ్చ టింతాము.

ఆసుర వీరత్వము—

ఆర్యసాహిత్యమున మనుష్యత్వ మెట్లు చిత్రింపబడి నదో చూచితిరి కదా? పశువుతో సమానుడు కాక తద్వృత్తి నతిక్రమించినవానికే మనుష్యత్వ మలవడుతుంది. పశువువలె కామక్రోధాదులకు వశుడై మానవుడు మతి పోగొట్టుకొంటే ఆతడు పశుతుల్యు డౌట నిస్సందేహము. ఇంద్రియనిగ్రహము కావించినవాడు పౌరుషవంతుడగు మానవుడౌను, చూడండి:-

కామక్రోధ సమాయుక్తో హింసాద్వేష సమన్వితః
మనుష్యత్వా త్పరిభ్రష్ట స్తిర్యగ్యోనౌ ప్రమాయతే
తిర్యగ్యోన్యాః పృథగ్భావో మనుష్యార్థే విధీయతే.

... ... ... భారతము.

లోనికశత్రువులకు లొంగిన నరుడు
మానుషత్వము నేది మను పశువౌచు
జంతుజన్మము వీడ జను మానవునకు.

ఇందుకు నహుషుడు ప్రమాణము. వేదాంతము (ఉప నిషత్తు) లందు సూక్ష్మరూపమున సూచింపబడిన ఈ విష యము పురాణములందూ కావ్యములందున్నూ స్థూలరూప మున విశదీకరింపబడింది. స్థూలకల్పన ప్రత్యక్షప్రతీతి చెందు తుంది గనుక తత్సంస్కారము మనస్సులో నిలుస్తుంది. అందుకే రాజర్షియైన నహుషుడు రిపుషట్కమునకు లొంగుట చేత స్వర్గభ్రష్టుడై సర్పమై జన్మించెను. శచీదేవి నభిలషించి అధికారమదము తలకెక్క సప్తర్షులచేత పల్లకి మోయించి నందుకు అగస్త్యుని శాపము ప్రతిఫలము ముట్టింది.

అంతశ్శత్రుప్రాబల్యమూ తన్మూలమున గలిగే అధః పతనమున్నూ ధీరోదాత్త వియోగాంతనాటకములయందున్నూ ఐతిహాసిక వీరులయందున్నూ కనబడును. ఆ నాటకముల యందలి ముఖ్యపాత్రములు అరిషడ్వర్గపాటవమునకు లొంగి ఉన్మాదులై నరరూపరాక్షసు లనదగి ఎట్టి దుష్కార్యముల నాచరించిరో ఒకటో ప్రకరణమందు వివరించినాము. ఆ ఖండ మున ఆ నాటకముల ప్రభ హెచ్చి ఆ పాత్రములకు గౌరవ

మెక్కువారైను. అట్టివారే వీరులని ఆ ఖండవాసుల అభి ప్రాయము. జనుల కల్పనాప్రపంచమున నెట్టివాళ్ళు కుదుట పడతారో వారికే సాహిత్యమున చోటు దొరుకును. దానిని పఠించువారు ఆ వీరుల చూచి రోతపడక పైపెచ్చు వారినే ప్రశంసింతురు. లోభాంధవశత మేక్‌బెత్ రాణి వీరవనిత యైనది; కామద్వేషములు కన్నుగప్ప ఒథెలో యున్నా, కౌశలవ్యూహమును పన్ని ఇయాగోయున్నా వీరులైరి. వియోగాంతనాటకములయందలి వీరు లందరూ ఇట్టివారే!

ఈనాటకములయందు ప్రతిష్ఠింపబడిన వీర్యమే ఇతిహాస ములయందెల్ల గౌరవింపబడుతూన్నది. కామపిపాసాపీడితులై, సర్వగ్రాసియైన లోభలాలసకు లొంగి అహంకారమదమున పృథ్వియెల్ల తుచ్ఛమని భావించి, అత్యాశాపరతంత్రత రణా వేశులై, విజయోల్లాసమున దానవుల విడంబించి దేశమం దెల్ల రక్తస్రోతముల ప్రవహింపజేసి నిజప్రభుత్వమును స్థాపిం చినవీరులే విఖ్యాతయశులై సర్వజనాదరణీయులయినారు. సికం దర్, సీజర్, నెపోలియన్, హానిబాల్ ప్రముఖు లిట్టివీరులే; వీరే వియోగాంతనాటకముల నాయకులకు మేలుబంతులు. వీరందరూ పృథ్వీమండలమున రక్తవాహినుల ప్రవహింపజేసిన వారే. ఆర్యసాహిత్యమందుకూడా అసురు లప్పుడప్పుడు ప్రాదుర్భవించి క్రామక్రోధాదులకు వశులై పృథ్విపై రక్త వృష్టుల గురిపించిన ట్లున్నది. వియోగాంతములయందలి వీరుల కును ఆర్యసాహిత్యమందలి అసురులకున్నూ కొంచెమైనా

లేదా లేదు, కాని సాహిత్యమందు వీరికి కలిగెడు గౌరవమున నేనాభేద మున్నది. పాశ్చాత్యవీరులు దేవోపములై ఆయా జాతులకెల్ల తలమానికంబుల'(Heroes of the Nations)వి సదా గౌరవింపబడుచుండ అసురుల దర్పము చూర్ణీకృతమై, గర్వము ఖర్వమై, లోభము నివారితమై, తేజస్సు ఉపసంహృతమై, ప్రభుత్వప్రతాపములు నామావశేషము లయ్యెను. శ్రీరాముడు శ్రీకృష్ణుడు మొదలగు దేవాంశసంభూతులు వారిమద మణచిరి. షడ్రిపుప్రాబల్యమున మానవులకు సంక్రమించిన ఆసురవీర్యమును నాశముచేయు సామర్థ్యము ఇంద్రియనిగ్రహావశమున దేవత్వము సాధించిన వీరులకే కలదు.

వియోగాంతనాటకములయందలి నాయకులూ, పాశ్చాత్యసాహిత్యమందలి వీరులూ, ఆర్యసాహిత్యమందలి అసుర నాయకులున్నూ ఒక్కఅచ్చున పోసిన బొమ్మలని చెప్పితిమి కదా. వీరిలో నొకరిచరితము చదివితే చాలు; తక్కినవారి చరిత లామచ్చుగానే ఉండును. ఆర్యకవివరేణ్యు లీగుణముల నెల్ల కేంద్రీకరించి మహాభారతమున దుర్యోధనుని శ్రీమద్రామాయణమున రావణునీ చిత్రించిరి. భోగపరాయణత క్షణక్షణప్రవర్ధమానమై నరుని వశపర్చుకొను ననుటకు లోభవాగురుల జిక్కి దాయలకు సూదిమొన మోపునంత ధరణి నొసంగని దుర్యోధనుడు సాక్షి; ఇంద్రియలాలన పెచ్చుపెరిగి మానవుని నశింపజేయు ననుటకు రావణుడే దృష్టాంతము. ఈ రెండుపాత్రముల నతినిపుణతతో నిర్మించి అంతతో నూర

కుండలేదు. ఆ వీరులచరిత్రము మాత్రమే పఠించుటవల్ల విష ఫలము ప్రాప్తించితీరును. పాపచరితములనే పఠించుటచేత కల్పనాశక్తి పంకిలమగును; అందుచే వీటికి ప్రతిగా వేరొకజాతి వీరుల చిత్రించిరి. ఆధర్మవీరులు తమ ఉజ్వలాలోకమహిమచే పశువీరుల అంధకారమున అణగద్రొక్కి, వారే చదువరుల కల్పనాశక్తి నాకర్షించి, దానిని ధర్మస్యూతముగా నొనరింతురు. ఈ వీరులే మన కావ్యములందు ఇతిహాసములందును నుతిగన్నవారు. రావణదుర్యోధనుల చరితములు మాత్రమే చదివినవారికి ఐరోపీయవీరుల చరితములు చదివిన ఫలమే చేకూరును, కాని భారత రామాయణములు సాంతముగా చదివిన వారి కల్పనాశక్తి దోషసంకలితము కానేరదు.

పాశ్చాత్యసాహిత్యమున షార్లమేన్, సికందర్, సీజర్, నెపోలియన్, ఫ్రెడెరిక్, ఐదవచార్లెస్, తైమూర్ మొదలగు వారు దిగ్విజయములు చేసి ఘనతకెక్కిన మహావీరులు. ఆర్య సాహిత్యమందున్నూ ఇట్టివారు లేకపోలేదు- రఘువు, శ్రీరాముడు, పాండురాజు, అర్జునుడు, కర్ణుడు మొదలగువారుకూడా దిగ్విజయ మొనర్చినారు, కాని యీ రెంటు తెగలవారియందు తేడా యున్నది. రఘుమహారాజు విశ్వజిద్యాగమునకును శ్రీరాము డశ్వమేధముకోసము, పాండవులూ కర్ణుడున్నూ రాజసూయముకొరకున్నూ దిగ్విజయ మొనర్పు, ఐరోపీయులు లోభమునకు వశులై సర్వమూ కబళించుటకు రక్తప్రవాహములు కల్పించిరి. దిగ్విజయమువల్ల ఆర్జించిన ధనము నార్యులు

యాగములందు దానముజేసిరి. పారమార్థికచింతతో కావించిన ధనసంగ్రహ మంత నింద్యము కాదు.

బ్రహ్మక్షత్రియ వీరత్వము

యుద్ధము లేకుంటే పురుషునకు ప్రతిష్ఠ రాదు, విజయుడు కాకున్న వీరునకు వికాస ముండదు. యౌవనమున రిపుషడ్వర్గము ప్రబలియుండునప్పుడు జితేంద్రియులు సంయములు నైన ఆర్యులు తపోబలసాహాయ్యమున దానిని జయించి ఆభ్యంతరిక వీరత్వమును ప్రతిష్ఠించుచుండిరి. ఈ సమరమున వారిచిత్తమున కేకాగ్రత ఇంద్రియముల కేక నిష్ఠయు చేకూరి విజయమును వారికి కరగత మైనట్లు లొనర్చుచుండెను. తపశ్శక్తిచేత వారికి జయము లభింపగా వారు బ్రహ్మవీరులై దేవత్వము నార్జింపగలిగిరి. అధ్యయనము దమము, ఆర్జవము, ఇంద్రియనిగ్రహము, సత్యమున్నూ బ్రాహ్మణునకు నిత్యధర్మములై యుండెను. అంతర్యజ్ఞానుష్ఠాన మొనర్చుచున్న నారాయణుడు పాశవప్రకృతిసిద్ధములగు అంతశ్శత్రువు లను పశువుల బలియిచ్చినట్లు సామవేదమున చెప్పబడింది. ఈ యంతర్యాగము (సమరము)న జయము లభించుటచేత బ్రహ్మవీర్యము ప్రకటిత మవును. యౌవరాజ్య పట్టాభిషేకమునకు సిద్ధపడుచున్న రామభద్రు డెక్కడ! అతని శరణ్యావాసశిక్ష యెక్కడ? మహైశ్వర్యము, రాజభోగములు-వీటియెడ శ్రీరాముని కెంతలో నిస్స్పృహ జనించెను, ఎంతలో నారచీరెలు గట్టి ఆ యువరాజు అడవికి పోవు

టకు సిద్ధపడెను! పదునాల్గేళ్ళు నాటిగల బ్రహ్మచర్యము నను వర్తించి ధర్మైకనిష్ఠుడై బ్రహ్మవీరత్వ పరమావధి నెట్లు చేరెనో యోచించండి! అరిషడ్వర్గము కానీ, రాజభోగములు కానీ ఆతని చిత్తమునకు చాంచల్యము కల్గించెనా? బ్రహ్మచర్యనిష్ఠకు ఉత్కృష్టోదాహరణమైన భీష్ముడు బలవిక్రమ సంపద నద్వితీయుడైన మహావీరుడు. ఆజన్మబ్రహ్మచర్యము ననుష్ఠించిన శ్రీశుకుడు అమానుషసంయమమున కే కోదాహరణము. సనకాదుల బ్రహ్మచర్యనిష్ఠ క్షత్రియులయందున్నా కనగలము- హిందువులం దసంఖ్యాకులగు బాలవితంతువులు బ్రహ్మచర్యము సల్పి మహాశ్వేతవలె భగవంతున కాత్మసమర్పణ మొనర్చుచున్నారు. ఇట్టి సంయమమే హిందువుల కబ్బిన మహాశక్తి. శ్రీరాముడు నిజపౌరషము క్షత్రియశౌర్యము నెరిగినవాడు కావుననే సీతతోగూడ వనవాసము చేయ సిద్ధపడెను. బ్రహ్మచర్యానుష్ఠానమున కావశ్యకమగు ధైర్యము, ఇంద్రియనిగ్రహము, సహిష్ణుత, సీతను రక్షించుకొన గలనను నమ్మకమూ కలవాడు కావుననే దండకాటవికి ప్రయాణించినాడు. వనవాసమువల్ల ఆభ్యంతరికబలమూ క్షాత్రవీర్యమూ ప్రకటితము లాయెను.

శ్రీరామునియందు బ్రహ్మక్షత్రవీరత్వములు రెండూ ప్రాధాన్యము చెందెను. అరిషడ్వర్గము నదిమి అంతరింద్రియములను వశపరచుకోవడముచేత బ్రహ్మవీర్యమూ, బాహ్యశత్రువుల నదిమి బాహ్యేంద్రియముల వశపరచుకోవడమువల్ల

క్షాత్రవీర్యమున్నూ ప్రకటితము లాయెను. కామక్రోధాదులు ప్రబలమూర్తుల ధరించి రావణదుర్యోధనరూపముల పృథ్వి నెల్ల అడలగొట్టి భూభారము నభివృద్ధి నొందించగా, వారిని నిర్మూలించి జయము గాంచడము క్షాత్రవీర్యము—ఇది బాహ్య సమరము, మన పురాణములయందు విస్తృతరూపమున వర్ణింపబడింది. శ్రీరామచంద్రుడు తన పౌరుషము నిలువబెట్టుకొనుటకున్నూ భూభారము తగ్గించుటకున్నూ రావణునితో యుద్ధ మొనర్చి కుల నిర్మూలము చేయుడమువల్ల అతనివే రాచంద్రార్కము సంస్మరణీయ మవుచున్నది. వనవాసదీక్షయం దాతని వశిత్వము వన్నెకెక్కినదని చెప్పితిమికదా?

ఈ ద్వివిధవీరత్వ మాతని కలవడుటకు అతని విద్యాభ్యాసము తపశ్చర్యమున్నూ ముఖ్యహేతువులు. అతనియందు ధైర్యము, శాంతి, విద్యాబుద్ధు లున్నట్లే అధ్యవసాయము, సాహసము, కర్మనిష్ఠ, వీరత్వమున్నూ కలవు. దశరథుని యందలి ధర్మపరాయణత, సత్యవ్రతమూ చూచి, వసిష్ఠాది ఋషులు తనకు నేర్పిన సంయమబలముచేత వినయసంపన్నుడై బ్రహ్మవీర్యప్రాప్తికి యోగ్యు డయ్యెను; అనన్యసామాన్యబల విక్రమసంపన్నుడై ధనుర్విద్యాపారంగతు డౌటవల్ల క్షాత్ర వీర్యమున కునికిపట్టాయెను. పూర్వకాలమున మనలో క్షత్రియుల కీరెండురకముల శిక్షయూ ఒసగుచుండేవారు, కావుననే రాజర్షు లనేకులు వెలువడుచుండిరి. సంజయుడు

పుత్రశోకకాతరహృదయుడై యున్నప్పుడు తపస్స్వాధ్యాయ నిరతుడైన నారదమహాముని ఆరాజర్షుల ఇతిహాసములను వివరించి అతనికి చిత్తశాంతి చేకూర్చెను.

క్షత్రియులలో ననేకులు బ్రహ్మవీర్యసంపన్నులైనట్లే పరశురాముడు, ద్రోణుడు మొదలగు బ్రాహ్మణశ్రేష్ఠులు క్షాత్రవీర్యము నార్జించి యశస్సంపన్నులైరి. ముచుకుందు డను రాజశ్రేష్ఠుడు ఒక వంక మంత్రశక్తి, తపోబలమూ, వేరొక వంక అస్త్రబలము, బాహుబలమున్నూ ఊతగా గొని ప్రతాపార్జిత పృథ్వీఖండమును పాలిస్తూండెనని భీష్ముడు చెప్పెను. ప్రజాపాలనమున వసిష్ఠుని బ్రహ్మబలము ముచుకుందుని క్షాత్రబలమునకు సహాయమవుచుండెనట. వాస్తవముగా అప్పటి హిందూరాజులకు రెండుతెరగుల బలమూ ఆవశ్యకమై యుండెను. "అనలున కనిలుడు సాయపడితే అరణ్యమంతా అరగడియలో దగ్ధమగులాగున బ్రాహ్మణులు క్షత్రియు లేకమైనయెడల శత్రుచయము నంత మొందింపవచ్చు" నని సనత్కుమారు డన్నాడు. శ్రీరాముని యం దిట్టి రాజాదర్శము చిత్రింపబడెను. యూరపుఖండమున నిట్టి యాదర్శ మెక్కడిది? రోము రాజ్యము వీడి కొందరు రాజులు సరళజీవయాత్ర సల్పినారు, కాని అది రాజ్యాభిషేకసమయమున కాదు. శ్రీరాముని సంయమము తపోబలమును వేరొక చోట కానరావు. అతని కతనే సాటి.

వీరత్వమున సమరము రక్తపాతము—

బ్రహ్మవీర్యము, క్షాత్రవీర్యము, ఆసురవీర్యము—ఈ మూడురకాల వీరత్వము ప్రదర్శించుపట్ల ఒకానొకప్పుడు రక్తపాత మావశ్యక మగును. బ్రహ్మవీర్య మార్జించునెడ కొన్నివేళల ఘోరసంగ్రామ ముపస్థితమై అందు రక్తపాత మావహిల్లును. తపశ్శక్తియందు కర్తవ్యనిష్ఠ, బుద్ధిబలము, విక్రమమున్నూ చూపట్టును. ఇట్టి కర్తవ్యపాలనమున తత్పరుడై శిబిచక్రవర్తి డేగనోటనుండి పావురమును రక్షింప నుద్యమించెను. అతనికర్తవ్యనిష్ఠ ధర్మతేజఃప్రాబల్యము నందు గాంచవచ్చును. ఆతనిచరితము చదువునప్పు డదిసత్యమా కాదా అను ప్రశ్న పుట్టనే పుట్టదు. అతని త్యాగము, తపస్సు, కర్తవ్యనిష్ఠ, ధర్మపరాయణతయున్నూ మానసముల నలరించ కల్పనాశక్తి ప్రబలమై వివేచనాశక్తిని మరుగుపరుచును. ధర్మతత్పరత సర్వవ్యాపి యగును. కావ్యకల్పనమున ఇట్టి ఇంద్రజాలప్రభావము ననుభవింపచేయడము పాశ్చాత్యకవులకు చేతకాదు. మానవ చరితమున ధర్మతేజఃప్రభావ మెంత యున్నతి చెందునో, వీరపటిమ ఎంతవరకూ పెరుగునో ఆ కవు లూహింపలేకపోయిరి. అందుచేతనే షేక్స్పియర్‌కి తగిన వీలు చిక్కినా ఇంతటి మహత్తు కల్పించలేకపోయెను. డేగను బోలు షైలాక్ పట్టెడు మాంసఖండమును లోభించునప్పుడు కవి రక్తపాతము కావింపనేరకపోయెను. కారణ మేమనగ, కావ్యప్రారంభమునుండీ కవి ధర్మానురాగము జొన్పనే

లేదు. అందుచేత ఆ ఘటనాపరంపరయందు రక్తము స్రవించినా అది యాత్మబలి కానేరదు. అందుకే మారువేషమున పోర్షియాను ప్రవేశపెట్టి రంగరహస్యమును కల్పించి కావ్యకల్పన సమాప్త మొనర్చెను.

రక్తపాతము చూడదలచినవారు పరశురాముని మాతృహత్య చూడండి—అతడు మాతృహత్య కెందుకు కడంగినాడు? పితృవాక్య పరిపాలనమున కే కదా! మన శాస్త్రములయందు కర్తవ్యాదేశము రెండు విధములు—శాస్త్రాదేశ మొకటోది, గురుజనాదేశము రెండోది. శాస్త్రాదేశము రెండింటిలో బలవత్తరము. శాస్త్రజ్ఞానపటిష్ఠ చేకూరేదాకా గురుజనాదేశము నిర్వహించి తీరవలెను, అంతవరకూ పిత్రాజ్ఞ అవశ్యాచరణీయము. దీనిని దృష్టాంతీకరించుటకు పరశురాము డట్లొనర్చెను.*

---

* శాస్త్రజ్ఞానము దృఢమై, పెద్దల యానతి అందును విపరీతమైనప్పుడు గురువుల మాట పెడచెవిని బెట్టి శాస్త్రాదేశమునే అనుసరించవలయును. ఇందుకు ప్రహ్లాదుడు, భీష్ముడు నుత్తమోదాహరణములు. తండ్రియైన హిరణ్యకశిపు, తల్లి లీలావతి, ఎంత నొక్కి—చెప్పినా ఉభయతారకమగు హరిభజనము ప్రహ్లాదుడు మానడాయె. పరమభాగవతోత్తముడగు నారదుని ఉపదేశమునం దతనికి దృఢమైన నమ్మకము కుదిరింది. సర్వశాస్త్రోపదేశసారము భగవద్భక్తియే, చూడండి—

" ఆలోక్య సర్వశాస్త్రాణి విచార్య చ పునఃపునః
ఇదమేకంతు నిష్పన్నంధ్యాయే న్నారాయణం సదా.
చదివి చర్చించిన సకల శాస్త్రములు
భక్తియా ముక్తికి పరమసాధనము. "

బ్రహ్మతేజము పరశురాముడై అవతరింప క్షాత్ర తేజము శ్రీరాముడై అవతరించెను. బ్రహ్మతేజ మాభ్యంతరిక సమర మందున్నూ క్షాత్రవీర్యము బాహ్యసమరముననూ ప్రజ్వరిల్లు నని చెప్పియుంటిమి. అందుకే బాహ్యసమరమున పరశురాముడు శ్రీరామునకు తీసిపోయెను.

ధర్మార్థము బలిదానము—

ఆర్యసాహిత్యమున వృథారక్తపాత ముండదు, రక్త స్రావ మున్నచోట్ల ధర్మనిర్వహణ ముండితీరును; దేవకార్యార్థము చేసిన రక్తపాతము "బలి" అనిపించుకొనును. బలిదానము పవిత్రకర్మ అని షేక్స్పియర్ కూడా ఒప్పుకొన్నాడు. సీజరును చంపవలెనని లోభముగ్ధుడై కాసియస్ రోమనువీరుల కుచక్రము (conspiracy) లేవదీసెను. తన చాతురి వినియోగించి బ్రూటసునుకూడా మందలో చేర్చెను. అతడు చేరకున్న ఆకార్యమునకు గౌరవము చేకూరదని కాసియ సెరుగును, బ్రూటు సాకార్యము ధర్మనిబద్ధము కావున బలియగునని వారి కిట్లు బోధించును:—

---

అంబుజోదరు దివ్యపాదారవింద చింతనామృతపాన విశేషమత్త చిత్తుడు కాబట్టి ప్రహ్లాదుడు తండ్రియాజ్ఞ నుల్లంఘించెను.

అంబను పెళ్ళిజేసుకొమ్మని గురు వెంత బోధించినా భీష్ముడు— బహుశాస్త్రవేత్త— బ్రహ్మచర్యవ్రతము పూనుటకు ప్రతిజ్ఞ చేసినవాడు గనుక గుర్వాజ్ఞోల్లంఘనము చేసెను.

ఈ యిద్దరును శాస్త్రోదితాచారవివేక ధనులు. కాబట్టి పెద్దల మాటలు పెడచెవిని పెట్టిరి, వీరిని ప్రమాణముగాగైకొని ప్రతివారూ పెద్దల మాట జవదాటరాదు.

" Our course will seem too bloody, Caius Cassius,
To cut the head off and then hack the limbs,
Like wrath in death and envy afterwards;
For Antony is but a limb of Caesar :
Let us be sacrificers, but not butchers, Caius.
We will stand up against the spirit of Caesar ;
And in the spirit of men there is no blood :
* * * * *

Let us carve him as a dish fit for gods
Not hew him as a carcass fit for hounds
* * * This shall make
Our purpose necessary, and not envious ;
Which so appearing to the common eyes,
We shall be called purgers, not murderers *

ధర్మసంస్థాపనమునకై ఒనర్చిన రక్తపాతము అవశ్యం భావి అవుతుంది కాని విద్వేషవశమున నొనర్చేదట్లు కాదు;

* కిట్టి కోపాన, పిమ్మట కిట్టుకుంటవలెను, తలత్రెంచి కాలుసేతులను కోయు
కయసు కాస్యస, మనమహాకార్య మపుడు ఘోరతరమగు కనుగొనువారికెల్ల
ఆంతోని సీజరుని అవయవము కాడె? చంపవలసెకదా అను చలపుతోడ
చంపుదముకాని, పచ్చికసాయివాండ్రభంగి నరవంగ మడుపుటపాడిగాదు.
సీజరుని అంతరాత్మనే చిక్కబట్ట మనము దలతము; మానవాత్మలకు రక్త
పూరఘోరత లేదు......... ..................................
..............................................దేవతాచక్రమునకు
బలిని పెట్టుద మతనియొమ్ములను; గాని కుక్కలకు నక్కలకు తినగూడునట్లు
చిద్రుప చిద్రుపలుగా వాని చెక్కజనదు.
* * * * * * *

దీన నందరు వైరప్రధాన మనరు మనపని అవశ్యకర్తవ్య మనుచుతోచు:
జనులచూడ్కికి ఈరీతి కనబడగనె హంతలనరు మార్జకులందు రంతెకాని.

వా॥ వా॥ శాస్త్రి.

రామ రావణయుద్ధము కురుక్షేత్రసంగ్రామము నిందుకు ప్రశస్తమైన దృష్టాంతములు. రక్తపాతమును తప్పించుటకు శ్రీరామునిపక్షమున అంగదుడూ, రావణునిపక్షమున విభీష ణాదులూ, పాండవపక్షమున శ్రీకృష్ణుడూ కౌరవపక్షమున భీష్మాదిధర్మపరాయణులూ ఎన్నో ప్రయత్నములను కావిం చిరి, కాని అవి నిష్ఫలమాయెను. పోరుపొసగక సీతనొసంగ నని రావణుడూ "వాడిములు మోపినంతైన వసుధ" నివ్వనని రారాజూ పట్టుబట్టిరి కావున యుద్ధమావశ్యకమాయెను.

షేక్సుపియరునాటకమున యుద్ధమూ కాలేదు, సీజరును వధించుట అత్యావశ్యక మూకాదు. అతని వధింప కాసియస్ మొదలగువారు దళబద్ధులై దృఢప్రతిజ్ఞ కావించుకొనిరి. వారి యుత్తేజనమునకు మూలమగు చిత్తవృత్తి యెట్టిది? "మనము చేసేపనిలో క్రోధముగాని హింసగాని ఉండరాద"ని బ్రూట సన్నాడు. ఆకూరకృత్యముపైని ధర్మమను తెరవేసి క్రోధమున్నూ హింసయూ దాచవలెనని బ్రూటస్ యత్నిం చెను. సీజరును ధర్మమునకు బలిగా నొసంగుచున్నామని జను లనుకొనవలెనని అతని తలంపు. అతని చిత్తవృత్తి స్వదేశాభిమానముచేత ఉత్తేజితమైనదట! కాసియస్మాటో? లోభహింసావేశులై అతడున్నూ మరికొందరు వీరులున్నూ సీజరును చంపదలచినారని బ్రూట సెరుగునా? ఎరుగడు. "ఎలాగో బ్రూటస్ మనలో కలిసినాడు. అతడేమి చేసినా చేయకపోయినా సీజరుచావు తప్పదు" అనుకొని కాపురుషు

డైన కాసియస్ కసాయివానిలాగు చెలరేగి సీజరును చంపెను. "దీన నందరు వైరప్రధానమనరు, మనపని అవశ్యకర్తవ్య మనుచు దోచు" అని బ్రూటస్ సమాధానమిచ్చెను. ఇది సరిగా నున్నదా? సీజరును చంపకుండా దేశమునకు హితముకూర్చు మార్గములను అత డాలోచింపనేలేదే! మొదటనే చంపనిశ్చయించి పిమ్మట ప్రజల కెట్లు సమాధాన మివ్వవలెనో ఆలోచించుకొనెను. ఇట్టియెడ రక్తపాత మావశ్యక మని నిర్ణయించడ మెట్లాగు? కావున ఈరక్తస్రావ మవశ్యంభావి కాదు; అది బలి యనుట వట్టి భ్రాంతి.

ఇట్టివృత్తాంతములే గ్రీకువియోగాంతనాటకములకు ఉత్పత్తిహేతువులు. ధర్మార్థము బలి నొసంగడమే ఆధారము చేసుకొని వియోగాంతనాటకము లుత్పన్నము లాయెను. ఈస్కైలస్, యూరిపిడీస్ అను గ్రీకుకవుల నాటకము లిట్టివే. ధర్మార్థము బలినొసంగుట ధర్మగౌరవహేతువనే వారి యూహ. అట్టి బలి నొసంగకూడ దని ఆర్యసాహిత్యమూ అనదు. కర్ణుడూ శిబిన్నీ ఆత్మజులను బలియిచ్చుటకుకూడా వెనుదీయలేదు. ఇట్టిసందర్భముననే మయూరధ్వజుడు తన దక్షిణబాహువును అతిథికి కోసియిచ్చెను. ఇట్టి రక్తపాతము మనసాహిత్యమున మాయాకల్పిత మనబడును. ఇందు బలి యైనవారు పునర్జీవుతైరి. ధర్మమునకు గౌరవ మాపాదించడము కోసము భగవద్భక్తి వభివృద్ధిచేయడమునకూ ఇట్టి అలౌకిక వ్యాపారములు మనపురాణములయందు కల్పింపబడినవి. వీటి

మూలాన భక్తులభక్తి పరీక్షచేయబడడమేకాక భగవంతుని మాహాత్మ్యముకూడా ప్రకటింపబడును.

గ్రీకుసాహిత్యమందలి ధర్మబలికి పునర్జీవప్రాప్తి లేదు. అదుంటే నాటకము వియోగాంతము కాదు. వియోగాంత నాటకాలకు తుదను నిర్దయాజనితమైన రక్తపాతముండవలెను. దానివల్ల మనస్సులో దడపుట్టునా, లేక ధర్మగౌరవముచేత ఒళ్ళు పులకరించునా? వియోగాంతమున రక్తపాత మావశ్యకమా కాదా అనునంశ మిదివరకే చర్చింపబడింది.

వీరుని ప్రతిజ్ఞాబలము.

అర్జునుడు ధర్మరక్షణార్థము తనకు కర్తవ్యమయిన ద్రోణవధనని దృఢప్రతిజ్ఞ చేసి సంకల్పసిద్ధు డగును. బ్రాహ్మణులయొక్కయు క్షత్రియులయొక్కయు మనుష్యత్వమునకీ ప్రతిజ్ఞాబలమే నిదర్శనము. ఇట్టికార్యము లార్యసాహిత్యమున వేనవే లున్నవి. మానవునకు మనుష్యత్వమూ వీరునకు వీరత్వమూ సిద్ధించడమున కిదే మూలము. కర్తవ్యప్రతిపాలనమందు బ్రాహ్మణు డెన్నడూ పరాఙ్ముఖుడు కాలేదు. పితృభక్తిప్రేరితుడైన పరశురాముడు పితృవధప్రతీకారప్రతిజ్ఞచేసి క్షత్రియరక్తమున పితృతర్పణ మొనర్చి కృతకృత్యుడయ్యెను. ప్రతినపట్టినవా రెంత దుర్ఘటమైన కార్యమైనా నెరవేర్చితీరుతారు; చెరనున్న సీతను ముక్తురాలను చేయడముకోసము శ్రీరాము డెన్ని అసాధ్యపు పనుల నెరవేర్చెను! తండ్రిని తనియింప ప్రతినపట్టి భీష్ముడు రాజ్యమును భోగములున్నూ

విడిచి యావజ్జీవబ్రహ్మచర్య మాచరింపలేదా? అర్జునుని వధింతునని కర్ణుడు ప్రతినపట్టిననాడు పాండవు లెంత గడగడ లాడిరి! ఆప్రతిజ్ఞ కోసమే బ్రహ్మాస్త్రము సంపాదింపవలెనని ద్రోణు నాశ్రయించి అవమానింపబడి మహేంద్రగిరినున్న పరశురామునికి శిష్యుడై పూనికతో నతని సేవించి, మెప్పించి ఎంతోకష్టముతో దాని నాతడు సంపాదించెను. అర్జునుడో, కర్ణుని వధింతునని ప్రతిజ్ఞచేసి శివునర్చించి పాశుపతమున్నూ దేవతల దర్శించి మరికొన్ని అస్త్రాలున్నూ సంగ్రహించెను. అభిమన్యువధానంతరము సూర్యుడస్తమించకుండా జయద్రథు (సైంధవు)ని చంపెదనని అర్జునుడు ప్రతిజ్ఞచేస్తే ఇరు వాగుల వీరుల మానసములూ తల్లడిల్లెను. అది నెరవేరకుండా కౌరవు లెంత ఆయోజన మొనర్చిరి! దుశ్శాసనుని గుండె పగులగొట్టి రక్తపానము చేయుటవల్ల భీముడు, ద్రోణవధచేత ధృష్టద్యు మ్నుడూ, ఉపపాండవుల జంపి అశ్వత్థామా నిర్వర్తితప్రతిజ్ఞు లయినారు. ప్రతిజ్ఞాబద్ధుడౌటనే హంసధ్వజుడు తనకొడుకు సుధన్వుని కాగుచున్న నూనెలో త్రోసెను. ఈవిషయములందెల్ల రక్తస్రావమున్నూ మానవప్రతిజ్ఞాపాటవము స్థిరపడు చున్నది. ఇట్టిశక్తి వీరులయం దుండునంతవరకూ దేశము సురక్షితమని యెంచవచ్చును. పూర్వకాలపు క్షత్రియుల యందూ బ్రాహ్మణులయందున్నూ ఈశక్తి ప్రబలముగా ఉండేది. ఇప్పు డది సన్నగిల్లి పటిమ పల్చనైయింది. ప్రతిజ్ఞా

బలముచేతనే వీరునకు వీరత్వము, మానవునకు మనుష్యత్వము సిద్ధించును.

రక్తపాతములేని సత్యపాలనము—

సత్యవాక్పాలనమున ప్రతిజ్ఞాప్రాభవ ముంది. శ్రీరాముడు వనవాసదీక్ష గొని కొంచెమైనా జంకినాడా? పితురాజ్ఞాపాలనమే విధి అని యెంచిన ఆతనియందు తల్లిగాని, భార్యగాని, బంధువులుగాని, కులగురువుగాని యించుకైనా బిగువు తగ్గింపగల్గిరా? భరతుడెంత బతిమాలినాడు! శ్రీరాముడు వ్రతభంగము సల్పెనా? ఇట్టి దిట్టతనమునకు ధర్మనిష్ఠయే కదా కారణము! ఆనిష్ఠచేతనే రాజభోగములవీడి వనముల కేగెను. రాజ్యసుఖములు తుచ్ఛములని భావించుటలో నిస్పృహా, పదునాల్గేళ్ళు వనవాసము చేయుటలో చిత్తస్థైర్యమున్నూ స్పష్టము కాలేదా? సుఖమూ, కోర్కె, భోగమున్నూ విడిచిపెట్టుట అనితరసులభ కార్యము కాదా? సత్యపాలనమున కిట్టి మనోదార్ఢ్యమే కావలయును. విధినిర్వర్తనమున శ్రీరాముని ప్రాత్పాటవము కనవలెనంటే సీతను వనముల కంపునప్పుడు చూడండి- ప్రజాపాలనము చేయుచున్న రాజునకు తనకోర్కెల కొనసాగజేయు ఆవశ్యకత యెక్కడిది? తనసుఖములను త్యజింపవలయు, ప్రజలయానతి మన్నింపవలయును, అందుకే సీతనుకూడా పరిత్యజించెను. ఇదే రాజనీతికి ఉత్కృష్టాదర్శము, అసమాన రాజధర్మము. కావుననే ప్రతిజ్ఞానిర్వహణనిష్ఠుడై దశరథుడు శ్రీరాముని వనముల కంపి

తాను మృతుడాయెను, రాజధర్మనిష్ఠుడై శ్రీరాముడు సీతను వనములకంపి తాను మృతప్రాయుడాయెను. తండ్రికి తగిన కొడుకు! తనభార్యకిచ్చిన వరములు దశరథుడు క్రమ్మరింప గలడు, కాని అట్లు చేయనొల్లడాయెను.

సత్యపాలన సామాన్యవ్రతము కాదు. బాసయిచ్చినది స్త్రీకైన నేమి, పురుషునకైన నేమి, దేవునకైన నేమి? అది నిల్పుకొనుటే సత్యవ్రతి కావశ్యకము, అదే ఆవ్యక్తికి జీవనము. సర్వసామాన్యములయిన విషయములందుకూడా యుధిష్ఠిరుని సత్యనిష్ఠ విదిత మగుచుండును. జూదమున రాజ్యసర్వస్వము నాత డోడెను—రాజ్యమే కాదు—ఐశ్వర్యము, సోదరులు, ధర్మపత్నియు పరుల పాలాయెను. పిదప పన్నెండేళ్ళు వన వాసము చేయుటకు పందెమొడ్డి అదీ ఓడి అంతా విడిచి అరణ్యమున కేగెను. ఎందుకు? సత్యవాక్పాలమునకేనా? ధర్మరా జొక ప్రతిజ్ఞ జేసెనా, దానికి భంగము రాకూడదు. ప్రపంచమంతా తారుమారైనా అత డన్నమాట తప్పడు. శ్రీరాముడు విజయ మొందిన ఆంతరికయుద్ధమును తుముల ముగా రచించుటకే వ్యాసుడు ద్రౌపదీవస్త్రాపహరణము కల్పించెను. అట్టి ఘోరయుద్ధమున కూడా ధర్మరాజు స్థిరుడై నిలిచెను. తనసర్వస్వ మొకకడ, సత్య మొకకడ నుండ ధర్మ జుని మనమున యుద్ధము ప్రారంభించెను, అం దాత డచ లుడై నిలిచెను. ఈయుద్ధమున స్థిరుడౌటచేతనే అతనికి యుధి ష్ఠిరుడని పేరువచ్చెను. శత్రుసభయం దాతని సామర్థ్యము

పరీక్షింప బడెను, ఆత డుత్తీర్ణుడై సత్యవాక్పాలనాజయ ఘోషము చెలఁగఁజేసెను.

రక్తపాతములేని బ్రాహ్మణప్రతిజ్ఞాపాలనము—

గురుదక్షిణ అర్పించుటకు బ్రాహ్మణులు పలుబాముల పడవలసివచ్చింది. బ్రహ్మచర్య మాచరించుతూ విద్యాభ్యాస మొనర్చునపుడు శిష్యుని కెట్టిధైర్యము, ఎట్టి సంయమము, తితిక్ష అలవడ్డవో పరీక్షించుటకు పూర్వకాల మందలి గురువులు దుస్సాధ్యమైన గురుదక్షిణ కోరుచుండేవారు. తపోధనుడగు ఉతంకుడు గురుదక్షిణ నిచ్చుటకు గౌతమ మహర్షి ఆజ్ఞానుసారము అహల్య చెంతకేగెను. ఆమె ముందు వెనుక లారయక సౌదాముడను రాజు పట్టపురాణి కర్ణ కుండలద్వయమును తెచ్చి యిమ్మనెను. తదాజ్ఞానుసారము ఉతంకుడు ఎట్టికష్టములకు లోనయ్యెనో మహాభారతమున అశ్వమేధపర్వమున విశదముగా వర్ణింపబడినది. అబోధుడగు ఆబ్రాహ్మణవటువు గౌతమమహర్షి కృపచేతనూ తన తపో బలముచేతను వసిష్ఠుని శాపవశమున రాక్షసిరూపము ధరిం చిన ఆమహారాణి కర్ణకుండలముల నతికష్టమున సంపాదించి గురువుగారి ఆశ్రమమునకు తిరిగి వచ్చుచుండ ఆకుండలముల నొకపాము నాగలోకమునకు ఎత్తుకొనిపోయెను. ఆతడు ధైర్యము విడువక వాటిని తిరిగి సంపాదించి అహల్య కర్పిం చెను. గురుకులమున నాత డభ్యసించిన ఆంతరికబలము తత్కఠినకార్యనిర్వహణమున వినియోగపడుటచేత అతడు

కృతార్థుడాయెను. ఇట్టి ఉదాహరణము లెన్నో కలవు.

మహాకావ్యములయందలి వీరత్వము—

ఆర్యసాహిత్యమున నన్ని తెరగుల వీరత్వాదర్శము లున్నవని రామాయణ భారతములు చదినవా రెరుగగలరు. ఈచిత్రములను వేర్వేర వివరించిన నొక్కొక్క గ్రంథ మగును. వాటికి వ్యాఖ్యాన మొనర్చుటకు కీచిన్నపుస్తకము చాలదు. ఒక్క భారతమందే ఇవి కుప్పలుగా నున్నవి. మన వాఙ్మయమున ప్రేమమాధుర్య మున్నట్లే వీరత్వమందలి తేజున్నూ కలదు. సరస్వతీనదివలె ప్రేమ శాంతరూపమున ప్రవహింప, వీర్యతరంగిణి బ్రహ్మపుత్రానదివలె గర్జిస్తూ ప్రవహించును. కాళిదాసూ భవభూతిన్నీ ప్రేమలవారుల ప్రవహింపజేయ వాల్మీకీ వ్యాసులూ వీరప్రవాహముల నతివేగమున పారించి ఉత్తాళతరంగముల జనింపజేసినారు. కురుక్షేత్ర సంగ్రామమున వీరరసమందలి ఉన్మత్తత స్పష్టపడి ఓజస్వినియైన భాషచే ఆ రసము చిప్పిలజేసి సమగ్రభరతఖండము నందు ముంచెను.

మూడు రకముల వీర్యము—

ప్రేమకున్న మూడుగతులూ వీరమునకు గూడా ఉన్నవి. మానవునియం దప్పుడప్పుడు పాశవవీరత, ఉన్మాదమూ కనబడుచుండును, ఒకప్పుడు దివ్యవీరత్వమూ మరొకప్పుడు మానవవీరతయు ప్రకాశించుచుండును:—

మానవుని షడ్రిపువర్గము అత్యంతప్రబలమై—లోభము

పృథ్వినంతా మ్రింగజూచునప్పుడు, కామము అనింద్యచరిత్ర యగు సతీమణిని చెరపజూచునప్పుడు, దర్పము దశదిశల ప్రజ్వరిల్లునప్పుడు, క్రోధము ప్రపంచమునెల్ల కంపింపజేసి రక్తసంసిక్తము చేయనెంచునప్పుడున్నూ—ఆతని వీరత్వము "పాశవ" మనబడును. ఉ॥ రావణుడు, దుర్యోధనుడు.

సద్గుణరాశిచేత వీరత్వమును సాధించి మానవుడు విశ్వప్రేమచేతనూ దయచేతనూ దానవీరుడై, బలిచక్రవర్తివలె పృథ్వినంతా ఒరులకిచ్చినా తృప్తిలేక, రఘుమహారాజువలె తన నిధులనన్నిటిని యాచకులకు పంచియిచ్చినప్పుడున్నూ, యుధిష్ఠిరునివలె దానమందు, దయయందు, ధర్మమందున్నూ, పరమావధి చేరునప్పుడున్నూ, ద్రౌపదివలె పుత్రహంతనైన క్షమించునప్పుడున్నూ, ఆశ్రితులయెడ శిబివలె ప్రాణపరాయణత కనపరుచునప్పుడూ, భీష్మునిలాగు యావజ్జీవబ్రహ్మచర్య మాచరించునప్పుడున్నూ, స్వధర్మజ్ఞానముచే ఉదారుడై సుయోధనుని రీతి తనసర్వస్వము నితరుల కర్పింపబూనునప్పుడున్నూ, కర్ణునివలె శత్రువునకైనా తన జీవనసర్వస్వము ధారపోయునప్పుడున్నూ "దివ్యవీరత్వము" కనబడును.

మానవుడు సత్యవాక్పాలనా నిరూఢప్రతిజ్ఞుడై, స్వధర్మము, కులము, మానము, మర్యాదయు నిల్పుకొనుటకు రిపుకులమును రూపుమాపి, ధర్మసంస్థాపనార్థము ధరిత్రీభారము తగ్గింపబూని. ఋషులు మొదలగు శిష్టుల పీడలు తొలగించుటకు దుష్టుల శిక్షించి, ప్రజానురంజనమునకై

భార్యనైన విడుచుటకు జంకక, యుద్ధమున నెట్టివా రెదురొ్కా న్నా, ఓలమాసగొనక నడుముకట్టి నిలిచి, స్వధర్మానుసారము స్వదేశమునుగాని స్వరాజ్యమునుకాని రక్షించుకొనుటకు బభ్రువాహానునివలె తండ్రితోనైన తలపడి, కర్తవ్యనిష్ఠయు ధర్మానురక్తియునిలువబెట్టుకొనునప్పుడున్నా «మానవవీరత్వ" మగపడును. స్వదేశస్వధర్మరక్షణార్థము ప్రాణముల నర్పించు భక్తులు (Patriots and Martyrs) మానవవీర్యమున నుజ్వల మూర్తులు. వారు మానవజాతికెల్ల గౌరవాపాదకులు.

ఆర్యవీర్యమందలి విశేషము—

ఐరోపీయువీరులకన్న ఆర్యవీర్యుల ఆధిక్యత యేమి? వ్యాసు డీవిషయమును విశదముగా వర్ణించెను. పాశ్చాత్యేతి హాసమున గృహాకలహముల వర్ణన మనము చదివియుందుము, కాని సమరసమయాన హృద్వేదనచేత అర్జునునివలె అస్త్రశస్త్ర ములను విడిచి యుద్ధవిముఖుడగు వీరుని అందు చూడము. యుద్ధోన్ముఖుడై కిరీటి వచ్చునరికి ఎదురుగా భీష్మద్రోణాది గురుజనము సమరోద్యతమగుట చూడగానే, అతని మానస మున శ్రద్ధాభక్తులు ప్రబలమాయెను. యుద్ధమున కాహూతు డగునప్పుడు జంకుట వీరధర్మము కాదు, కాని గురుజనము, బంధుకోటితో పోరుట యుక్తకర్మ అగునా? అర్జునుని హృద యమున అంతర్యుద్ధము ప్రారంభమయ్యెను. బాహ్యయుద్ధము నకు కడంగుటకుముందు ఆంతరికసమర మంతము కావలి సెను. వీరవరేణ్యుల కిట్టి సంశయ మెప్పుడైనా కలిగెనా?

దీని ఫలితార్థ మేమి? ఆర్యవీరుల కెట్టి విద్య గరపబడెనో దీని వల్ల వ్యక్తమైనదా? వారికి నేర్పేది కేవలాస్త్రశస్త్రచాతుర్య మే కాదు, అంతతో ముగిస్తే ఆభ్యంతరిక తపోబలము వారి కలవడదు, వారు జితేంద్రియులు కాలేరు. విద్య నభ్యసించు నపుడు వారి భుజబల మభివృద్ధి చెందినట్లే ప్రేమ, భక్తి, శ్రద్ధ, అనుశీలము కూడా అభివృద్ధి నొందవలెను. బాహ్య శత్రువుల జయించుటకు వా రస్త్రవిద్యయం దారి తేరినట్లే అంతశ్శత్రువుల జయించు సామర్థ్యముకూడా వారు సంపాదించు చుండిరి. అస్త్రబలమున యుద్ధకౌశలమునందున్నూ అసురులను సంహారించుట నేర్చుకొన్నట్లే వారు శమాదిషట్కసంపద చేత కామాదుల జయింప నేర్చియుండిరి. ఈ రెండు తెరగుల విజయము పొందగలిగిన వీరుడే నిజమైన వీరుడని గణింపబడుచుండెను. బాహ్యశత్రువులను మాత్ర మే జయింపగల్గి అంతశ్శత్రువుల నడుమ లేని వారికి సుఖమూ లేదు శాంతీ యుండదు. పృథ్వియంతా చేజిక్కినా వారి దుఃఖము తొలగదు, చిత్తములకు శాంతి చేకూరదు.

వీరుల సంపద—

అంతరంగసమరమున విజయమొంది చిత్తమునకు శాంతి చేకూర్చుకొనువానికి పృథ్వీతలమంతా వశమైనట్లే. అతడు కోరదగు కోర్కెలుండవు—దేవేంద్రుని సింహాసనము, కుబేరుని నవనిధులూ అతనికి కరగతమగును. నిస్పృహావిష్టుడగు నాతని చిత్తమున మోహమూ లోభమూ పుట్టించ దగు

వస్తువే లేదు. తనకబ్బిన రాచగద్దియ భరతుడు త్యజించలేదా? కురుక్షేత్రసంగ్రామమున నెంతో శ్రమపడి జయమునొందిన ధర్మజుడు సింహాసనాసీనుడగుటకు సమ్మతించెనా? వ్యాసుడు ఆతనికి వైరాగ్యమూ, ఇతరపాండవులకు జ్ఞానమున్నా ఉపదేశించి అంతశ్శత్రువుల నరికట్టుట శ్రేష్ఠతమమగు కార్యమను విశ్వాస మాదయింపజేసెను. కావున పంచపాండవులు ద్రౌపదితోకూడా భోగసుఖములు త్యజించి సంసారము రాజధర్మమున్నా నిర్వహింపవచ్చునని నిశ్చయించుకొని, జ్ఞానబలమే నిజమైన వీరత్వమని నమ్మిరి. ఈశక్తిమూలమున జితేంద్రియులై, చిత్తవశీకరణ నిపుణులై, జీవితము సార్థకమొనర్చువారికి భుజబలమున గాని, సైన్యబలమున గాని, సహాయసంపదయందుగాని యేలోటూ ఉండదు. వశిష్ఠవిశ్వామిత్రులు తమ తపోమహిమచేత తండోపతండములగు సేనలు కూర్చలేదా? ఇట్టి సామర్థ్యమున్నా విశ్వామిత్రుడు వశిష్ఠునితో సమానశక్తిశాలి కాలేకపోవుటచేత సంగ్రామమున జితుడై బ్రహ్మర్షి కావలెనని దృఢప్రతిజ్ఞచేసి తీవ్రమైన తపస్సువల్ల జ్ఞానబలము సంపాదించి బ్రహ్మత్వము పొందగలైెను.

ఆదర్శ రాజ్యము—

యుద్ధభూమిని ప్రాణములు బాసినవారికి వీరస్వర్గము లభించునని ఆర్యుల విశ్వాసము. అవసానకాలమున దుర్యోధనుడు కృష్ణునితో నిట్లనెను—

1. అధీతం విధివద్దత్తం భూః ప్రశాస్తం ససాగరా
మూర్ధ్న్యస్థిత మమిత్రాణాం కోను స్వంతతరో మయా॥
2. యదిష్టం క్షత్ర బంధూనాం స్వధర్మ మనుపశ్యతామ్
తదిదం నిధనం ప్రాప్తం కోను స్వంతతరో మయా॥
3. ససుహృత్సానుగశ్చైవ స్వర్గం గంతాహ మచ్యుత
యూయం నిహత సంకల్పాః శోచంతో వర్తయిష్యథ॥

1. చదివితి నెల్లవేదములు జన్నము లొప్పగ జేసితిన్ రమా
స్పదమగు వృత్తి బొల్చి నరపాలకు లెల్లను గొల్వ గంటి దు
ర్మదరిపు గాఢగర్వ పరిమర్దనకేళి యొనర్చితిం దగం
దుది నని మిత్రబాంధవులతో త్రిదివంబున కేగు టొప్పదే?
2. సమరము శమంతపంచక సమీపమున ధర్మవృత్తి సలుపగ నత్యు
త్తమలోకము సమకూరెను విమలాత్ముడనైతి నింక వేయును నేలా!

...తిక్కన

పాండవులూ శ్రీకృష్ణుడున్నూ ఈలోకమును స్వర్గముగా నొనర్చిరనీ, వారికి స్వర్గమునకు పోవలయునన్న ఆందోళనమే లేక, స్వర్గముకన్న నెక్కుడగు బ్రహ్మపదమును వారు పొంద యత్నించుచున్నారనీ ఆత డెరుగడు. మహాత్ముడగు ముద్గల ముని స్వర్గమునుండి వచ్చిన విమానము తుచ్ఛమని యెంచి జ్యోతిర్మయమగు బ్రహ్మపదము నాశించి జ్ఞానము శమము నవలంబనములుగా నొనర్చుకొనెను. అట్టి జ్ఞాన మార్జింపవలెననే పాండవులు ప్రాణములు బాయలేదు. ఇంకా వారు రాజర్షులు కాలేదు. జనకచక్రవర్తివలెనే సంసారము వీడి భగవత్ప్రేమాసక్తులై, సిద్ధి పొందలేదు. అందుకే సకలరాజర్షి వృత్తాంతము శ్రీకృష్ణుడు ధర్మరాజు కుపదేశించెను, అట్టి యాదర్శము

లనే భీష్ముడున్నూ బోధించి తనువు చాలించెను. భగవద్గీత లందు శ్రీకృష్ణు డుపదేశించిన నిష్కామనివృత్తిమార్గమూ విశ్వప్రేమయూ పాండవు లింకాపొందలేదు, నిష్కామభావమున వారు యుద్ధ మొనర్పలేదు, అట్టి యత్నమూ చేయలేదు. అట్టివారు శ్రీరామజనకాదులవలె నిర్లిప్తభావమున రాజ్యము చేయగలరా? క్షత్రియాదర్శమగు ఉన్నత రాజధర్మమును వా రనువర్తింపలేదు, విశ్వప్రేమ చూపించనేరని క్షత్రియులు రాజ్యశాసనమున కర్హులు కారు. ఇట్టి ప్రేమాన్వితులైన దశరథ శ్రీరామపాత్రములను నిర్మించి వాల్మీకి సింహాసనాసీనుడయిన రాజు ప్రేమరాజ్యమును స్థాపించు తెరగు రామరాజ్యదృష్టాంతమున లోకమునకు వెల్లడిచేసెను. మహారాజాధిరాజైన రాముడు ప్రజానురంజనతత్పరుడై ప్రాణాధికయగు సీతను పరిత్యజించెను; లోకహితము కూర్ప తనసుఖము బలియొసగెను. అట్టిరాజ్య మెచ్చటనైన తిరిగీ స్థాపింపబడునా? అట్టి రాజశేఖరుడు తిరిగీ అవతరించునా?






## ఏడో ప్రకరణము

---

### సాహిత్యమున దేవత్వము

#### సతీత్వాదర్శము—

ఆర్యకవులు రచించిన ఆదర్శములలో కర్త్రాదర్శములే కాక కార్యాదర్శములు కూడా ఉన్నవి. వీటితో తక్కినకవుల ఆదర్శములు తులతూగనేరవంటే మనకవుల కల్పనాశక్తి విరివి ఉన్నతీ తెలియగలవు. సతీప్రతిమ నేకవి రచించినా అది సీత ప్రతిమకు వెనుకబడుతుంది; పతివ్రతాప్రతిమ నిర్మిస్తే అది దమయంతికి సాటిరాదు. ఆవిరి వోడలముందు చేపలబట్టు చిన్నచిన్న కలములతీరున, దివిటీముందర దీపాల లాగున, హనుమంతునెదుట కుప్పిగంతులపోలికను వ్యాసవాల్మీకులు నిర్మించినఆదర్శచరితములముందు ఇతరకవిచిత్రములు రాణించ నేరవు. కాళిదాసు, భవభూతి, శ్రీహర్షుడు మొదలగు కవులు పైని చెప్పిన కవిద్వయము ననుసరించి వారి యాదర్శములనే పుష్టిచేసి అలంకరించి చెన్ను వహింపజేసినారే కాని నూతనా దర్శములను సృజింపలేదు.

విద్య.

మానవప్రకృతిలో స్వాభావికముగా పశ్వంశ ప్రధాన మయి యుండును, కావున దానిని పోగొట్టుటే విద్య యొక్క ముఖ్యోద్దేశము. పశుత్వముకు ప్రాధాన్యము తగ్గించి మనుష్యత్వ దేవత్వములకు ప్రాధాన్యము సిద్ధింపజేసేదే క్రమ మైనవిద్య. ఇట్టివిద్య మనసంఘముయొక్కయు, కుటుంబముల యొక్కయు రీతినీతులమూలాన సిద్ధిస్తుంది. స్త్రీజాతిని అడ్డుఆజ్ఞ లులేక దానిచిత్తమువచ్చినట్లు పెంపొందనిస్తే అదెంత నింద్య స్థితికి వచ్చునో, క్రమమైన విద్యాప్రభావమువల్ల అది దివ్యత్వము నెట్లుపొందునో మనశాస్త్రములందు వర్ణింపబడి ఉంది. బాల్య మునుండీ సుపరిష్కృతము కాకుంటే మానవప్రకృతియొక్క సౌందర్యము భాసమానము కాదు. అందుకే మనయిళ్లలో బాలులతోపాటు బాలికలకున్నూ చిన్నప్పటినుండీ క్రమశిక్ష ప్రారంభింపబడును. ఈ శాసనప్రణాళి కఠినము-పితృగృహము విడిచి గురుకులము ప్రవేశించేదాకా బాలులకు నయశిక్ష ఒనగినట్లు బాలికలకు కూడా పుట్టినిల్లు వదలి మెట్టినిల్లు చేరే వరకూ నయశిక్ష నొసగుచుండేవారు. సుశీలలగుటకు తరుణావ స్థయందే వారి నత్తింటికంపేవారు-బాలుడు గురుకులమున్నూ బాలిక అత్తిల్లూ ఇంచుమించుగా ఒకయీడునే చేరేవారు, కాబట్టి యిద్దరికీ పితాలయమందు మొదలుపెట్టిన విద్య అన్య గృహమున పెంపొంది సమాప్తమయ్యేది-తరళమతులైన బాల కులను తగినరీతిని శాసించి భావిజీవితమున కుపయోగించే

గుణములు గురు వేలాగు నేర్పునో, ఆలాగే అబోధలగు బాలికలను అర్హరీతిని శాసించి గృహిణీధర్మములు అత్తింటి పెద్దలు నేర్పుతూండేవారు. ఇట్టిశిక్ష స్వగృహమున కొనసాగక పోవడము చేతనే మనసంఘమున పైనుదహరించిన వ్యవస్థ యేర్పడింది-దానివల్ల బాలికాబాలకులు సుశిక్షితులై సంసార సంబంధములగు పనిపాట్లలో నిపుణులై సుఖముగా జీవించు చుండిరి-వీరు గృహస్థులుగా పెరిగి నప్పుడు తమబిడ్డల కిట్టిశిక్షే యొసంగుతూ సంసారవృక్షమును నలువైపులా వ్యాపింపచేసి తత్ఫలముల ననుభవించుచుండేవారు-మనవాళ్ళు తమ మానుషత్వము నభివృద్ధిచేసుకొని స్త్రీపురుషులయందు దానిని పెంపొందించి సంసారముల నేలాగు సాగిస్తూ ఉండిరో, ప్రేమచే తను స్నేహముచేతనూ అందరి నెట్లు ప్రసన్నుల చేయగల్గినారో దానికి ప్రత్యక్షనిదర్శనములును మనగ్రంథములలో చూడవచ్చును.

సంసారాశ్రమములు ప్రవృత్తిమార్గమునకు విస్తృత క్షేత్రములు. తద్ఘోర లహరులయందు నిరాటంకముగా కొట్టుకొనిపోయేవాళ్ళు ఆ తరంగములయందు మునుగుతూ తేలుతూ, కాలవశమున పోటుదెబ్బలు తింటూ, ఆ ప్రవృత్తి స్రోతమున ఒక సంసారతరంగము నుంచి ఇంకొక తరంగమునకు కొట్టుకొనిపోయి, జన్మజన్మాంతరములా వాత్యాచక్రమున తిరుగుతూ ఉందురు. సంసారమందలి సుఖదుఃఖములే వారికి భోగభాగ్యములు. ఆసుఖ మెంత హెచ్చినా దుఃఖము దూరము

కాక క్రమముగా పెరుగుతూ ఉండును. ఇట్టి సహోవాముఖ విషకుంభమునుంచి వెలువడే మార్గము మనఋషులు చూపినారు; అదే నివృత్తిమార్గము. ప్రవృత్తివేగమును అరికట్టడమువల్లనే సంసార గతిరోధము ఘటిల్లును. ఇది సంభవమా? సంసారాంబుధిలో లోతుగా మునిగినవారికిన్ని విషయసుఖములను నాచులో చిక్కుకొన్నవారికిన్ని ఇది అసంభవము-కనుకనే మనము కూడా అట్టి లోతైన గోతులలో కూరిపోకుండా ఏదైనా ఆసరా దొరకబుచ్చుకోకుంటే కృతార్థుల మగుట సున్న. పూర్వోక్తశిక్షాప్రభావ మనే ప్రాపు దొరకొన్నవాళ్లు సంసృతిప్రవాహమున కెదు రీదగలరు. యోగ్యమైన విద్యకు ఫలములు మూడు:—అరిషడ్వర్గము లొంగదీయుట, యౌవనోన్మాదము నరికట్టుట, భగవంతు నారాధించుట-బాలికలకిట్టి చిత్తశుద్ధి కల్గడమునకే సతీత్వాదర్శమూ శిక్షావ్రతమూ కల్పింపబడినవి; బాలకులు గురుకులమున శుశ్రూషచేస్తూ వేదాధ్యయనము, శాస్త్రపఠనము చేసేటప్పుడు నివృత్తిమార్గచోదకములైన శమదమాదిగుణగణము *నభ్యసించకతప్పదు. అధ్యయనము, శాస్త్రపఠనమున్నూ క్రమమైనశిక్షకు

---

'Tis beauty that doth oft make women proud;
'Tis virtue that doth make them most admired;
'Tis government that makes them seem divine.

... ... ... Shak.

స్త్రీల తరుచుగ గర్వింప జేసెడునది
సొగసు, వారల మిక్కిలి పొగడబడగ
సలుపునది సద్గుణంబు, వేల్పులుగ వారు
తెలియబడజేయునది జితేంద్రియత చూవె.

ఆ॥ వా॥ దా॥

కేవల సహాయములు (auxiliaries), మానవులు సచ్చరిత్రులు కావడమే విద్యయొక్క ముఖ్యోద్దేశము.

మైత్రి—

సతీధర్మమే స్త్రీల కుత్కృష్టాదర్శము, కావున సతీత్వ నిర్వహణమునకు సాధనమగు విద్యయే వాళ్ళకి నేర్పేవారు. ఇదిగాక ఉత్తమఫల మింకొకటుంటే దానికి తగిన విద్య నేర్పి యుందురు. బాలులకు గురుకులవాస విద్యాప్రణాళి విధిబద్ధము చేసినట్లే మనువు స్త్రీశిక్షాప్రణాళిని కూడా నిర్ణయించి యుండును. సీత మన కాదర్శసతీమణి కదా? అయోధ్య నామె ప్రవేశించునప్పటికి పుట్టింటిచదువు పూర్తియై యుండును. ఆవిద్యాక్రమము వాల్మీకి వర్ణింపలేదు, కాని తద్వారా ఆమె కలవడిన గుణసంచయమునుబట్టి ఆమెకు న్వేరిన విద్యావిశేషమును మన మూహించవచ్చును. పుట్టింట రాజర్షియైన జనకమహారాజుయొక్క సాంసారికవ్యవస్థకు తగిన శిక్ష ఆమె కబ్బియుండును. అచ్చట సుశీలలగు సతులదృష్టాంతముల నామె చూచియుండవలెను. వ్రతములు, నియమములు, పాతివ్రత్యము, సంయమము, గురుభక్తి, దైవభక్తియూ చిన్నతనమునుండీ ఆమె నేర్చియుండును. ఇట్టిభక్తితోనే పతి తన జీవనసర్వస్వమని భావించియుండును. భక్త్యావేశమున ఏకనిష్ఠ, నిస్స్వార్థత, నిరాకాంక్షయున్నూ కలదై పతిసేవ చేయగల్గు సతీమణి అట్టి భావములతో భగవంతుని కొలువ గలదన్న వింతా? పసితనమునుండీ గురువులకు శుశ్రూష

చేస్తూ దేవతలను భక్తితో నారాధించుతూ ఉన్న బాలకు పాతివ్రత్యపాలన మొకలెక్కా? బాల్యమునుండీ భక్తిశ్రద్ధలం దారితేరినవాళ్ళు వయోవృద్ధి నొందినకొద్దీ వాటిని పెంపొందించగలరు; బంధువులయెడ వాళ్ళుచూపే అనురాగమూ ప్రేమయున్నూ అట్లే దినదినాభివృద్ధి నొందును.

వేదశాస్త్రజ్ఞానము లభించనివారికి భక్తే ఉత్తమ మార్గమూ ప్రధానవిద్య తపస్సు నగును. బాలిక బాల్యావస్థయందే పత్యారాధనము నేర్చుకొనును. అశిక్షితులైనవాళ్ళకు ప్రత్యక్షదైవమే అధికతమభక్తిపాత్రము. ప్రత్యక్షదేవతారాధనము భగవదారాధనముకు తొలిమెట్టు; భక్తిమార్గ మవలంబించేవాళ్ళు స్థూలదేవతలనే మొదట పూజింతురు, తరువాత అది సూక్ష్మదేవతారాధనముగా పరిణమించుతుంది; ఇందుకే పతిప్రేమ పెంపొంది జగత్ప్రేమ అవుతుందని చెప్పితిమి! జగత్ప్రేమ పూర్ణమై విస్తృతముకాగానే విశ్వవ్యాపి యగును. క్షాంతి, దానము, ధర్మము మొదలైనవాటిచేత ప్రాశస్త్యము పొంది నారీప్రేమ ప్రకటిత మవుతుంది. అతిథులు, అభ్యాగతులు భగవద్రూపులని యెంచి వారిని సత్కరించుటవల్ల ఔదార్యము హెచ్చును. పతియందలి అనురాగము భగవత్సృష్టమైన జంతుజాలమున ప్రసరించును. జీవుల యెడ దయజూపకున్న అనగా భూతదయ లేకుంటే భగవత్పూజ సార్థకముకాదు. చూడండి:—

"............................ ......దయావిహీనతన్
చేసినకర్మముల్ ఫలముజెందునె? కర్మము లెన్నియేనియున్
చేసినవాని సద్గతియె చేకురు భూతదయార్ద్రబుద్ధినో..."
..................అ॥ పెద్దన్న

మొట్టమొదట సంసారమున సంకీర్ణభావమున బయలు దేరిన ప్రేమ క్రమముగా విశ్వవ్యాప్త మవుతుంది. విశ్వవ్యాప్తమైన ప్రేమను "మైత్రి" అంటాము, దాని నభ్యసించిన సతీమణి పతివెంట దుర్గమారణ్యములకైనా ప్రయాణముచేయ సిద్ధపడుతుంది. యాజ్ఞవల్క్యుని భార్యలలో మైత్రేయి మాత్రమే ఇట్టి ఉదారప్రేమపథగామిని అయింది. కావుననే ఆత్మజ్ఞానము పొంద నామె కర్హత కద్దని యెంచి—"నీవు నీపతిని ప్రేమించుచున్నంత మాత్రాన అతడు నీకు ప్రేమపాత్రము కాడు, నీ వాత్మను ప్రేమిస్తూన్నావు కావుననే నీపతి నీకు ప్రేమాస్పదు డవుచున్నాడు: ధనమును నీవు వలచుచున్న హేతువుచేత అది నీకు ప్రియము కాదు; నీ వాత్మను ప్రేమించుటచేతనే ధనము నీకు ప్రేమపాత్ర మగుచున్నది; నీపుత్రుని నీవు ప్రేమించడముచేత వాడు నీకు ప్రేమస్థానము కాడు, నీ వాత్మను ప్రేమిస్తున్నావు కనుక వాడు నీకు ప్రియతము డవుచున్నాడని" * యాజ్ఞవల్క్యుడు ఆమెకు బోధించెను.

---

* వ్యక్తమైన ప్రతిపదార్థమందున్నూ అవ్యక్తమైన ఆత్మ నిహితమై యున్నదనిన్నీ, "ఏకమే వాద్వితీయ"మ్మని మనమెరిగి ప్రేమించవలసిన పదార్థ మదే అనియు, ప్రతివస్తువునకు సత్తా దానివల్లనే కలుగుననియు, వస్తువునందు మనకుగల ప్రేమ ఆత్మయందు నిహిత మొనర్చవలెననియు ఋషి అభిప్రాయము.

ఇట్టి మైత్రిని సాధింపగలిగినందుకే గార్గి ఆత్మజ్ఞానోపదేశమున కర్హురాలైంది. పాతివ్రత్య మాచరించి దివ్యత్వము సాధించిన సతీమణి ముక్తినిదానమైన ఆత్మజ్ఞానమున కధికారము పొందగలదు. అందుకే పాతివ్రత్యము స్త్రీలకు ముక్తిమార్గమని మన శాస్త్రములు చెప్పుచున్నవి. పాతివ్రత్యము గౌణరూపమున ముక్తిసాధన మవుతుంది, పతియే సతికి ముక్తిసాధనము. ఇట్టి దివ్యాదర్శమున కిప్పటి హిందూ నారీమణు లెంతదూరమున నున్నారో కొంచెము పరికించండి. దివ్యాదర్శములను ధిక్కరించినవారు పతితులౌట సహజమే!

దేవతాదర్శము—

ఉజ్జ్వలమైన దేవతాదర్శ మెప్పుడూ మనస్త్రీల కళ్లకు కట్టినట్లుండును. లక్ష్మి, సరస్వతి, గౌరియూ నిట్టి ఆదర్శదేవతలు. సిరుల తులతూగుచున్న స్త్రీ లక్ష్మివలె మార్దవము, ధైర్యము, పతిభక్తియూ అభ్యసిస్తూండును; బుద్ధిమతియైన స్త్రీ సరస్వతిని బురుడించును. గౌరివలె పత్యనురక్త లవుట కందరూ కోరుచుందురు. పతిపరాయణ, ధీర, శాంతస్వభావ, సుశీలయు నగు నవలామణిని లక్ష్మియనీ గుణవతిని సరస్వతియనీ, అందరియెడ దయచూపే సాధ్విని అన్నపూర్ణయనీ భావిస్తూంటాము. దీనికి హేతువేమి? ఈ దేవతాదర్శములు మనహృదయఫలకములందు చెక్కియుండబడుటచేతనే గదా! నారీజనమునకు దివ్యత్వము సిద్ధించు సూక్ష్మమార్గము మహాభారతమున "సత్యాద్రౌపదీసంవాదమం"దు వివరింపబడింది.

పంచపాండవు లొకరొకరికంటె ద్రౌపదియందు అనురక్తు
లౌట అత్యద్భుతమని యెంచి సత్యభామ ద్రౌపది నిట్లడిగెను.
నగుమొగంబులేకాని నాతీ, నీదెస నెప్పుడూ పతులకు
కినుక లేదు. ఇది—

*వ్రతము పెంపొ మంత్రౌషధవైభవంబొ సరస నైపథ్యకర్మకౌశలమొ చతుర
విభ్రమోల్లాసరేఖయో వెలది నీ విశేషభాగ్యహేతువు సెపుమ నాకు.

అనేటప్పటికి ద్రౌపదికి వచ్చినకోపము నడచుకొని
యిట్లనెను:—

1 అలయక మంత్ర తంత్ర వివిధౌషధభంగుల జేసి ఎంతయుం
బలతురు నాథులంట మగువా కడు చేలతనంబు, దానమున్
గలిగిన ప్రేమయుం బొలియు, గాని యొకండును సిద్ధిబొంద, ద
ప్పొలతులతోడి మన్కి అహిపొత్తుగ చూచు విభుం డెరింగినన్
పాండవులయెడ నే నెట్టిదాననై యిట్టి సౌభాగ్యంబు నందితినో
అది నీకెరిగించెద వినుము:—

2 పతులకు నెప్పుడు కొవింపందగు కపటకర్మంబులు త
ద్భావమెరిగి వశవర్తిని యై వనిత చరింపనదియయగు నెల్లవియున్॥

3 పతులాత్మ నొండొక పడతులగలిసిన, నలుగ నెయ్యడలనహంకరింప
మదము ప్రమాదంబు మాని వారికి చిత్త, మేక ముఖంబుగ నెల్లప్రొద్దు
భక్తి సేయుదు, చూపు పలుకులు కోర్కియు జెయ్వులు వింతగా
చేయ నెపుడు,

అమరగంధర్వయక్షాదులందైనను, బురుషు నన్యుని తృణంబుగదలంతు
స్నానభోజనశయనాదిసంప్రయోగమర్థి పతులకుమున్నెందునాచరింప

పతులు వచ్చిన నాసనపాద్యవిధుల భక్తితో నేన కొలింతు పనుప నొరుల॥

4 అత్తకుభక్తిగల్గి మది నాయమ సెప్పినమాడ్కి చేటికా
కృత్యము లాచరింతు గురువిప్రసురాతిథిపూజనంబు ల
త్యుత్తమభక్తి నేన తగ నొపి యొనర్తు ప్రియంబు తాల్మియున్
మెత్తదనంబు సంతతము మేలగ దాల్తు సమస్తభంగులన్॥

............సకలభృత్యజనంబుల జీవితంబుల నరసి నేన నడుపుదును,

పాండునందనులు తమకుటుంబభారంబు సర్వంబును నాయంద సల్పి వారు నిర్భరులై యిష్టవిహారంబుల నుందురు. రే నెల్ల వెంట నప్రమత్తనై వర్తింతును.

6 పతి గడవంగ దైవతము భామల కెంచును లేదు ప్రీతుడై
పతి కరుణించెనేని కులభామిని భాసురభూషణాంబరా
న్వితధనధాన్యగౌరవము విశ్రుతసంతతియున్ యశంబు స
ద్గతియును గల్గు నొందుమెయి గల్గునె యిన్నితెరంగు లారయున్॥

ద్రౌపది గృహకృత్యములందు అత్యంతధీరయు, వ్యవహారమున అత్యంతనమ్రయు, అభ్యర్థనమున సంభాషణయందున్నూ వినయవతియు వంటింట దమయంతియు, అతిథిసంతర్పణమున అన్నపూర్ణగానూ వర్తించడము చూచి చాల అచ్చెరువొంది సత్యభామ "ఆహా! ఈమె సాక్షాల్లక్ష్మి, దశభుజయగు లోకమాత" అని నుతించి పతివశీకరణమంత్రమూ ఔషధమున్నూ కన్నులారగాంచి సంతసించి ద్వారక కేగెను.

ఆదర్శ దంపతులు.

ఆర్యసాహిత్యమున సత్యాదర్శము చిత్రించినట్లే కవులు పత్యాదర్శనమును కూడా నిరూపించినారు. అనాదినుండీ పత్యనురక్తలగు ఆర్యసతీమణుల చరితము ననుసరించి సత్యాదర్శము

నిర్మింపబడింది. దివ్యాదర్శములే అవశ్యా నుసరణీయములు, మన యాదర్శము లట్టివే. వీటిలో భవాని యొకర్తె, ఆమె స్త్రీరూపధారిణియగు ప్రకృతి.

పురుషాదర్శ మెట్లు లభింపును? ప్రకృతి పురుషులు సృష్టిలోని మూలతత్వములు. పురుషుని సత్త ప్రేమయం దుండును, ప్రేమయే సంసారమునకు మూలభిత్తి; వ్యక్తులు కలియుటకూ వేరగుటకూ ప్రేమ ప్రధానకారణము. పురుషుని ప్రేమ మయమూర్తే ప్రకృతి. ప్రకృతి పురుషు లనాదినుండీ పరస్పరానక్తులు, వారిద్దరికీ సత్త ఒకటే. ప్రకృతి పురుషు నాశ్రయించుటచేతనే అతనికి విశ్వేశ్వరుడనీ ఆమెకు విశ్వేశ్వరి అనీ పేర్లు వచ్చినవి. అతడు ప్రకృతిలో చొచ్చి విలాసార్థము విశ్వమంతా సృజించి రక్షించి ధ్వంసము చేయుచుండును. విశ్వమే లేకుంటే ప్రకృతిపురుషులకు నెలవేదీ? ఈలోకమంతా మాయామయము, విశ్వప్రకృతి మహామాయ, ఆమె పురుషుని ప్రేమాధీనయై యుండును. సతి పతిని విడుచునా? ఆమె కతడే సర్వస్వము, ఏకాశ్రయము. ఆమె కాతనితోటే సంసారము, ఆతని పరిచర్యయే ప్రధానలక్ష్యము. ఆతనియెడ నామె యాసక్తి గాఢము, ఎప్పుడు నుండు పదార్థము సత్, దాని నాశ్రయించి యుండునది సతి.

ఆదర్శరూపుడగు పతి—

పైనవివరించిన సతి ఆర్యుల కాదర్శరూపిణియైన సతి, ఆమె భర్త ఆదర్శరూపుడగు పతి. ఆ జగత్పితరుల ననుక

రించి ఆర్యదాంపత్యము సంఘటిత మయ్యెను. ఆదర్శదంప తులు ఉమామహేశులు, వారి కవినాభావసంబంధ మేర్పరచ బడినది చూడండి—

వాగర్థావివ సంపృక్తౌ......
" జగతఃపితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ"...కాళిదాసు

ఆర్యబాలికలు తమభర్తలు సదాశివులనీ, సదాశివుడు పార్వతియెడ నెట్టి యాసక్తితో మెలగెనో తమ భర్తలుకూడా తమపై నట్టి అనురాగము చూపవలెననీ కోరుతూ బాల్యము నుండీ శివునారాధిస్తూ "జన్మజన్మాంతరములందు నిన్నుబోలు పతిని సమకూర్చుమని" ప్రార్థింతురు. ఇట్టి కౌమారీ వ్రతము నే కాళిదాసుగారికి నిర్మించెను, ఆ గౌరీపూజే ఇప్పటికీ పెళ్లికూతుళ్ళు వివాహకాలమున చేయుదురు.

పసితనముందే సతీదేవి శివు నర్చించి ప్రసన్నుని చేసుకొని పెళ్ళియాడి సుఖముగా నుండెను, ఆమె మరణించి తిరిగీ సదాశివునే పతిగా బడయవలెనని పార్వతియై కౌమారీవ్రత మాచరించెను, ఈ తపోదృశ్య మతిసుందరము మనోహర మగునట్లు కాళిదాసు వర్ణించెను-పార్వతి శివుని పూజించుటకు కావలసిన పువ్వులు కైలాసగిరిని పూస్తూఉంటే వాటితో తన్నర్చించినందుకు శివుడు సంతసించి తత్పూజాఫలముగా నామెను భార్యగా గైకొనెను.

1 ప్రేమమయుడు (భోలానాధుడు.)

ఆర్యనారీమణులకు నిరూపించిన వ్రత మీతపశ్చరణమే. పార్వతి శివునర్చించినతీరుననే సతులందరూ సృష్టికర్త నారాధి

స్తూఉంటారు. సృష్టికర్త ప్రేమమయుడూ ప్రేమాధారుడని చెప్పనేచెప్పితిమి. ఆప్రేమవల్లనే నారీమణుల హృదయమును తనవైపు లాగుకొని అత్యాదరముతో నాప్రేమను వృద్ధిచేయును. ప్రేమప్రభావమున నారీమణులు తమ్మునుతాము మరచి ప్రేమించువారియందు మనస్సు లగ్నముచేసి ఏకనిష్ఠతో వారికి తోడునీడలై వర్తింతురు. పత్నియెడ అనూనాదరమూ, ప్రేమయు చూపి ఆదర్శరూపుడగు పతి ఆమెకు స్వర్గసుఖము చేకూర్చును. అందుచేత ఆమె కాతడు ప్రేమమయుడగు దైవమగును, అట్టివానియం దేకనిష్ఠ సహజముగా కుదురును. పతిప్రేమ నిరాకాంక్షము, నిస్స్వార్థము, ఏకనిష్ఠము, గౌరవపూర్ణము కావున ఆమె తనప్రేమను కూడా అట్లే యొనరించి పత్యనురక్తయగును. ఇట్టిపతి ఆదర్శపతియని మనువు శాసించెను. వశిష్ఠుడు, మందపాలుడూ ఇట్టి పతులే. అతినికృష్టమగు కులమున పుట్టిన అక్షమాలను సారంగిని మాన్యలూ సతులు నగు లలనామణులుగా గావించినారు-సత్యవతి మొదలగు నిమ్నజాతి నారీమణులు పతుల గుణసంపదచేత గుణవతులై సతులైరి. స్త్రీల నుద్ధరింప సమకట్టువాళ్ళు వారిమూలముననే తమవంశము, చారిత్రము, ధర్మమును రక్షించుకొందురని మానవధర్మ శాస్త్రము చెం దున్నది. కులనాథులు గుణవతులౌటవల్ల వారి కులమూ, శీలమూ, ధర్మమున్నూ ఉద్ధరించడమునకు సందేహము లేదు. మహాదేవుడు సతీప్రేమను మెచ్చి దానికి వశుడయ్యెననుటకు ప్రత్యక్షప్రమాణమాతడు అర్ధనారీశ్వరుడు కావడమే.

ఇట్లైనచో నిక ఆ దంపతులకు వియోగ మెక్కడిది ?

2. ఆశుతోషుడు (ఉబ్బులింగడు)—

శివు డాదర్శపతి కావడము సన్నుతపత్నీప్రేమయున్నా పత్నీరక్షణచేతనే కాదు. రూపగుణసంపదచేతకూడా అత డార్య యువతీవతంసముల మానసము లాకర్షించును. రూపమున నాత డద్వితీయుడు, ప్రేమస్వరూపుడు, సర్వాంగసుందరుడు. రాధిక క్కు శ్యామసుందరుడు మదనమోహనుడు, భవానికన్నులకు పరమేశ్వరుడు లోకైకసుందరుడు; ఇద్దరూ వారివారి భార్య లకు జగన్మోహనసౌందర్యసారరూపులు. అట్టి ప్రేమమయుడగు పతి తనకు లభించవలెనని ప్రతిహిందూబాలికయూ కోరు చుండును. పతిప్రేమను బడసినవెన్క తదితరప్రపంచమంతా సారహీన మనిపించజాలు పతిలబ్ధికై నుంచినుంచివ్రతములూ నోములూ సల్పుదురు. ప్రేమమయుడగు భర్త ఎట్టివాడు? శివుని గుణములే ఆతని కందము తెచ్చెను. అందు ముఖ్యమైనది సహజప్రసన్నత. ఆశుతోషున కన్యములగు అందములేల? అవగుణము లెన్ని ఉన్నా ఆశుతోషణ మఖిలసుగుణముల కా కరము. అల్పసంతుష్టుడగువాని సరసనుండుట సకలసుఖములను జూరగొనుటయే; అతడు: సంతతప్రఫుల్లుడు, అనవరత ప్రస న్నుడు; అట్టివానితోటి కాపురము అమిత సుఖావహము; అల్పసంతోషి నారాధించుట అతిసుకరము, సుఖకరము-అందు చేతనే ఉబ్బులింగనివంటిభర్త తమకు ప్రాప్తించుగాక అని మెల్లమెల్లనూ హిందూబాలిక లాశవహించి యుందురు.

3. ఆనందమయుడు (నిత్యానందుడు)—

అల్పసంతోషి దినమంతా పాటుబడి యింటికి వచ్చి తనకోసము తగిన ఏర్పాటులు తక్కినవాళ్ళు చేసినందుకు చాలా సంతసించును. జీవనోపాధి నార్జించడమునకు పగలెల్ల శ్రమపడి చీకటిపడేటప్పటి కింటికి వచ్చేసరికి వానిభార్య ఇల్లంతా శుభ్రముగానుంచి సాపానును సర్ది వంటచేసి ఎప్పుడువచ్చునా అని ఎదురుచూస్తూ ఉంటుంది. ఆమె నట్లుచూచి సదానందుడైన భర్త సంతసమున గెంతును. అతనిపాలి కామె గృహలక్ష్మి! లక్ష్మి యున్నచోట సౌఖ్యమునకు కొదవా? అందున్నూ గృహిణి సానుకూల మైనట్లైతే సంతుష్టి కేమి తక్కువ! అట్టి దంపతు లాదర్శదంపతులని మానవధర్మశాస్త్రమందుంది-తృప్తి సకలసద్గుణములకు నిధానము; చూడండి-

1. సంతుష్టుడీ మూడు జగముల పూజ్యుండు,సంతోషి కెప్పుడు జరుగు సుఖము.
సంతుష్టి గాకున్న సంసార హేతువు, సంతసంబున ముక్తిసతియు దొరుకు,
పూటపూటకు జగంబున యదృచ్ఛాలాభ తుష్టిని తేజంబులోన పెరుగు
పరితోష హీనత ప్రభ చెడిపోవును జలధార ననలంబు సమయునట్లు...
...................................................భాగవతము.

2. My crown is in my heart, not on my head;
Not decked with diamonds and Indian stones,
Nor to be seen: my crown is called Content;
A crown it is, that seldom kings enjoy.
........Shak

నా కిరీటము నాదు డెందమున నుండు, నాతలన్గాను, వివిధరత్నముల జెక్క-
బడగ లే,దద్ది యున్నాక బడగ బోదు,తనివి నా మౌళిశ్రీచెర లది కనుటయరుదు.

...ఆ॥నా॥దా॥

౪. అవ్యభిచారి (ఏకపత్నీ వ్రతస్థుడు)—

"యావజ్జీవమూ అవ్యభిచారులై యుండుట స్త్రీపురుషుల ధర్మము; వివాహితులగు దంపతులు వియోగములేక త్రికరణశుద్ధిగా వ్యభిచారులు కాకుండా వర్తింపవలె" నని మన ధర్మశాస్త్రము శాసిస్తూన్నది. ఆదర్శపతి ప్రేమమయుడూ, ఆశుతోషుడూ, సదానందుడూ, పత్నిని గృహలక్ష్మిగా భావించువాడు నాటచేత వ్యభిచారలిప్తుడై భార్యను బాధించడు. స్త్రీలు దుస్సాంగత్యమువల్ల చెడిపోదురని అతనికి తెలుసును. దుష్టచారిత్రయైన స్త్రీ పుట్టింటికీ అత్తింటికీ కూడా మచ్చ తెచ్చును. అంతేకాదు-

"స్త్రీషు దుష్టాసు కౌంతేయ జాయతే వర్ణసంకరః,"...భగవద్గీత

వర్ణసంకర మయ్యేడు వనిత చెడిన

కావున చెడుసావాసమునుండి చేడియను కాపాడవలెను.

భార్యాభర్తలు కలిసి గృహకృత్యములను నిర్వహిస్తూంటే వా రన్యోన్యశాసితులౌటే కాక అన్యోన్యప్రీతిపాత్రములై ఒకరిమాట నొకరు జవదాటరు. ప్రేమమయుని ఒళ్ళో ప్రేమమయి సంతతసమున నుండును, ఆమె తన్ను సేవించుతూ

ఉంటే గృహస్థు స్వర్గసుఖ మనుభవిస్తూ ఉండును. వారికి హామే పర మవుతుంది, వారు దివ్యులౌతారు.

వ్యభిచారమునకు కారణములు-మద్యపానము, దుస్సాంగత్యము, భర్తృవిరహము, ఇల్లిల్లుతిరుగుట, అకాలనిద్ర, పరగృహవాసమనునారని మానవధర్మశాస్త్రమం దున్నది. ఇవి స్త్రీపురుషులకు వర్తించును. ఈ పరిస్థితులను రూపుమాపుట వలన వ్యభిచారము కొంత తగ్గును. మేల్కొని యున్నంత కాలమూ పురుషుడు కుటుంబపోషణమునా స్త్రీ గృహకృత్యనిర్వహణమునందున్నూ కాలము వినియోగించవలెను. చేతినిండా పని ఉంటే చెడుతలంపుల కవకాశ ముండదు. పైని చెప్పిన సాధనముకన్న ఉత్కృష్టమైనది భార్యాభర్తల పరస్పరానురాగము- ఇది హెచ్చినకొద్దీ వ్యభిచార మేహ్యా మని పించును. వృథావాగ్వాదమువల్లనూ చికిలిజగడములవల్లనూ కలహములను పెంచుకొని మనసు విరుచుకొనక క్షాంతి, దాంతుల నభ్యసించి సమానురాగులై యున్న దంపతుల చెంత వ్యభిచారము చేరనేరదు.*

---

* వ్యభిచారమునుగూర్చి మనవారు చేసిన కట్టడి చాలా గట్టిది. ఇది కేవలము కాయికముగా నే తలపబడలేదు. మనసులోనూ మాటయందైనా స్త్రీపురుషుల చిత్త మన్యాయత్తము కాగూడదని మనవారి నియమము. స్త్రీలను మూడు తెగలుగా భాగించవచ్చును:—

కలనైనా అన్యపురుషుని దలపక, సర్వము పతియే అని భావించు నారీమణి "సతి" అత్యుత్తమురాలు. పతినిగాక అన్యుల దలచినా వారి

— ధర్మాశ్రయము—

దోషనివారణ మెంత ఆవశ్యకమో భక్తిప్రేమపోషణ మంత ఆవశ్యకము, కావున ఆదర్శరూపుడగుపతి తన భార్యను ధర్మానుష్ఠానమున సహకారిణిగా నొనర్చుకొనును. బ్రహ్మ యజ్ఞమునందు తప్ప ఇతర యజ్ఞములందు భార్యాసహాయ మావశ్యకము—పితృ, దేవ, భూత, మనుష్యయజ్ఞములలో సర్వమూ నిర్వహించేది సతి. అతిథిసేవ అన్నదానము లామె లేకుంటే జరుగనే జరుగవు.

ఈ యజ్ఞములవల్ల పురుషుని భక్తిప్రవృత్తులే చరితార్థము లగునా? స్త్రీచిత్తమున వీటి ప్రసారమే లేదా? హిందువుల గృహములే ధర్మక్షేత్రములు, అందు పతిపత్నులే కాక ఇతరులున్నూ పాల్గొందురు—కుటుంబమంతా ధర్మాసక్త మగును. ఇట్టి ధర్మప్రభావము లేని గృహములు హిందూ గృహము లనిపించుకొనవు. మనయిళ్లలో నిత్య నైమిత్తిక మాసిక వాత్సరిక ధర్మానుష్ఠానము జరుగుచుండుటచేతనే భక్తి, శ్రద్ధ, ప్రేమ, క్షాంతి మొదలగు ఉత్కృష్టప్రవృత్తులు స్ఫూర్తిచెందును. ధర్మ మెంతశ్రద్ధతో ఆచరిస్తే అంతత్వరలో

నందరినీ సోదరభావమున జూచునామె ఉత్తమురాలు. ఇతరులయెడ నింత ఉత్కృష్టభావనలేక అందరూ ఏమనుకొందురో అను బిడియము చేతకాని వీలు చిక్కక పోవడము చేతకాని వ్యభిచరించనిది మధ్యమ. పతిని పూరికైన కొనక ఇతరులతో సంచరించునది అధమురాలు. పతి నగౌరవపరచు కాంత పశువుతో సమానము. ఈ పద్ధతి పురుషులకుకూడా వర్తించును

గుణస్ఫూర్తి వర్ధిల్లుచుండును. ధర్మానుష్ఠాన మెప్పుడూ నిర ర్థకము కాజాలదు, దానిమూలాన యింటివారందరూ భగవ ద్భక్తు లగుదురు. మహత్కార్యముల ఫలము వాటి నొనరిం చిన వారికే కాక ఇతరులకు కూడా చెందుచుండును. గృహ స్థులగు దంపతుల ప్రేమప్రవాహము సంసారసాగరమున పడును. భగీరథుడు శివుని జటాజూటమునుండి గంగను భూలోకమునకు తేగా గంగాయమునలు కలిసి కపిలాశ్రమ మందలి ఋషులచే పూతము సగరకుమారుల నుద్ధరించి సాగరమున బడెను. సంసారమున పుట్టిన పతిపత్నుల ప్రేమ పవిత్రమై విశ్వరూపుడగు భగవంతునియందు చొచ్చి సర్వ ప్రాణుల యందున్నూ సంక్రమించును. దీనినే "మైత్రి" అంటాము. యాజ్ఞవల్క్యమహర్షి తన సహధర్మచారిణి యైన మైత్రేయి ప్రేమను భక్తి మార్గమునుంచి తప్పించి మైత్రిగా పరిణమింప జేసెను. ఆప్రేమ ఋషి పూతము, యాజ్ఞవల్క్యుడు సంసారమందుండి తాను ఋషియగుటే కాక తన భార్యకు కూడా ఋషిత్వము ప్రాప్తింపజేసెను.

దేవతల సంసారము—

హిందూ దేవతలకు కూడా సంసారబంధము కల్పించ బడినది. ఈ ప్రపంచమే వారిల్లు, ఇందలి కృత్యములే వారి గృహధర్మములు, పరబ్రహ్మ మొకటైనా ఈశ్వరుడు ఈశ్వరి అని రెండువ్యక్తు లయ్యెను. సహజముగా నిర్గుణమైన పదా ర్థము సగుణమైనది; నిర్లిప్తుడు సంసారలిప్తు డయ్యెను-త్రిపాదు

డగు విరాట్పురుషుడు ఒకపాదమున సంసారలిప్తుడాయెనని ఋగ్వేదమునందు. మహేశ్వరుడు సంసారియూ సన్న్యాసియునై వెలయుచున్నాడు. దుర్గ సంసారిణి, త్రైలోక్యతారిణి ప్రేయమయియునైన వైష్ణవి. ఈ రెండవమూర్తియే మహిషాసురమర్దని యని పిలువబడుచున్నది. మహిషాసురుడు సగము మానవుడు సగము పశువు; దుర్గాదేవి వాని పశుత్వము బాపెను. దేవబలము పశుబలమును నిర్జింపగలదు-పశుబలము నెదుట భగవతి అపరాజిత యగును. జగద్రక్షిణి వైష్ణవి యైన శక్తి ఈ ప్రపంచమందలి పాపమును తొలగించును. శివపేరిరణమున నామె ఈ సంసారమున తగులువడనెంచి మహాశక్తి రూపమున నవతరించింది-అందుచేతనే—

„యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా
సర్వభూతములందు శక్తిరూపంబున నిలిచియుండును దేవి నీలవర్ణ''

అని ఋషివాక్యము. ఈశక్తియందు నిరతుడై మహాదేవుడు నిర్లిప్తుడగు సంసారి అనిపించుకొనెను. అతని సంస్కృతి నిష్కామపవిత్రక్షేత్రము. ఇట్టి విశ్వపతి హిందువుల కాదర్శరూపుడగు పతి. అనగా ఆదర్శరూపుడగు హిందువుడు గృహస్థాశ్రమము ప్రవేశించి ధర్మాచరణమున దేవత్వము సాధింపవలెను. ఈధర్మములు శిష్టాచారములని విశదముగా వర్ణింపబడ్డవి—118 వ పేజి చూడండి—.

6. గురుజన సేవ—(శుశ్రూష)

దేవత్వ మెట్లు లాభకరము? హిందూగృహము గొప్ప

ధర్మక్షేత్రమని చెప్పియుంటిమి, అచ్చటనే దేవత్వము ప్రాప్తిం చుటకు వీలుంది. హిందూకుటుంబములయందు పతిపత్నులు మాత్రమే ఉండక వారి ఆత్మీయులు, కుటుంబము, పరిజనము, గురుజనమూ కాక ఇరుగుపొరుగువారు, ఆశ్రితులు, అతిథులు, పశుపక్ష్యాదికమున్నూ ఆకుటుంబము నాశ్రయించుకొని యుం డును-వీరందరూ గృహస్వామి ప్రేమకు పాత్రులు కావున అందరికీ అతని ప్రేమ పంచబడును. ఐరోపీయ కుటుంబముల కింత పరివార ముండదు- హిందూగృహస్థు తనప్రాపు గొన్న వారియెడ నిష్పక్షపాతబుద్ధితో వర్తించవలెను. ఒకదెస దార పుత్రాదుల ప్రేమరజ్జువుతో బంధించి, ఇంకొకదెస వృద్ధులౌ జననీజనకుల సుఖపెట్టవలయును. ఇం దెవరి నుపేక్షించినా మూర్ఖు డనిపించుకొనును, అట్టివాని నందరు నేవగింతురు. స్నేహ మధోగామి, భక్తి ఊర్ధ్వగామి. పైకెగయు టెంత కష్టమో క్రిందికిజారు టంతసులభము. హిందూగృహస్థెప్పుడూ పైకెగుర జూస్తూండవలయును. ఐరోపీయులలో నిట్లుకాదు. తలిదండ్రులు పుత్రులతో కలియరు, వీరి గార్హస్థ్యముతో వారి కెట్టిసంబంధ ముండదు. ఇద్దరి కుటుంబములూ వేరుగా నుండును. గృహిణి పతిమరణానంతరము ఆ సంతానము వీడి యింకొకని పెట్టుబట్టవచ్చును, కావున ఎవరిసంతానము వారి దే. హిందూగృహస్థునివలె ఐరోపీయుడు ఇంటనున్న వారినెల్ల సమదృష్టితో చూడనక్కరలేదు.

భార్యాపుత్రాదులను మాత్రమే ప్రేమశృంఖలమున

తనకు బద్ధులుగా చేసుకొన్నంతమాత్రాన గృహస్థు దేవత్వ మును సాధించగలడా? కల్ల. భార్యాపుత్రుల తగులాటము కేవల పశ్వంశ, దీని తెంచినగాని దేవత్వలబ్ధి కానేరదు. హిందువుల గార్హస్థ్య మత్యంత కఠినము, ఇది కేవల మైహిక సుఖసాధనమే కాదు, పరమం దక్షయస్వర్గసౌఖ్య మబ్బుటకు కూడా గార్హస్థ్యధర్మాచరణ ముపయోగపడును. ఇందు సంయమ మత్యావశ్యకము, కావున ఇంద్రియదౌర్బల్యముకల వారీఆశ్రమనియమపాలన మాచరింపలేరు. స్త్రీసాంగత్యమున ప్రాబల్యము నొందిన రిపుషడ్వర్గమును సదమదము చేయ వలెను. ఇందు శాంతి చేకూరినపిదప గురుజనమును సేవిస్తూ తపశ్చరణ మాచరించవలెను. "తలిదండ్రులు, తదితర గురుజన మూ జీవించి యున్నన్నాళ్ళు గృహస్థు ధర్మకర్మాచరణమున నెట్టిస్వాతంత్ర్యమూ వహింపరాద"ని మనువు శాసించెను. వారికి శుశ్రూష చేస్తూండే టప్పుడువిఘ్నము లేవీ రాకుండా చూచుకొని, పారలౌకికకర్మ నాచరింపవలసినప్పుడు వారికి నివేదించితీరవలయును. పితృసేవ, ఐహిక పారమార్థిక ధర్మా చరణమూ అను మూడుపనులు చేయుటవల్ల పురుషజన్మ సార్థక మవును, ఇదే పరమధర్మము, తక్కినవన్నీ ఉపధర్మములు.

ఇట్టి కఠినతపశ్చరణమువల్ల దేవత్వము సాధించవలెను, అట్టి సాధనలో పత్ని పతికి తగినసాయము చేయును; అట్లు చేసేటప్పుడు సంతానముపై మోహము విడిచి, స్వార్థము త్యజించి, భక్తికి స్నేహమును, దేవతలకుసంసారాసక్తియున్నా

బలిచేయవలెను. ఇది సులభమైన పని కాదు-పిమ్మట గురుజన మును సేవించుటవల్ల ప్రేమ పరార్థపరమై భక్తిగా పరిణత మవును. పసితనమునుండీ దేవతల నారాధించువారియెడ భక్తి గన్పరుస్తూ, త్రికరణశుద్ధిగా దేవతారాధనము చేస్తూ సర్వ మున్నూ వారి కర్పించి అనురాగమంతా వారియందే నిక్షిప్త ము చేయవలెను. "విశ్వమున కంతటికీ పతి సర్వేశ్వరుడు, మే మతనివారము"ని అందరూ భావించవలెను. ఇట్టిపరార్థప్రేమకూ గురుజనసేవకూ నుతికెక్కిన దృష్టాంతములు శ్రీరాముడు, భీష్ముడు, ధర్మరాజు. తండ్రిని తనియించుటకు శ్రీరాముడు సింహాసనము వీడి వనములందు వసింపబోయెను; అట్టి సంద ర్భముననే భీష్ముడాజన్మబ్రహ్మచర్యవ్రతము నల్పెను-ధర్మ రాజుకూడా పితృసేవాపరాయణత చూపెను. కురుక్షేత్రసంగ్రా మమున కులమెల్ల నశింప వృద్ధదంపతులగు గాంధారీధృతరా ష్ట్రులను పోషించు భారము ధర్మజునిపై బడినప్పుడు వారి నత్యాదరముతో నాతడు గౌరవించెనని భారతమున నున్నది- ఇం దాతని ధర్మపరాయణత స్పష్టము కాలేదా? ఇట్టి యుదారచరితము ఐరోపీయులలో గాంచబోము.

7. ధర్మాచరణము.

గురుశుశ్రూషయందు ద్యోతకమైనట్లు దానధర్మముల యందున్నూ ప్రేమ ప్రకటిత మగును. వీటిమాహాత్మ్యము మన గ్రంథములయందు పుష్కలముగా కీర్తింపబడినది. వివిధదాన ముల నొసగుటచేత మానవుని హృదయము ఉదార మగును.

అతిథిసంతర్పణమువల్ల నాతడు పుణ్యాత్ము డగును. ధర్మజునకు దానమాహాత్మ్యము విను కౌతూహలము హెచ్చు; దాత కాని వాని కిదియుండదు. ఆర్తరక్షణముకూడా దానమని చెప్ప వచ్చును. ప్రాచీనార్యుల గృహములు దానలీలాభూములు, అతిథిసేవాలయములు. ఆర్తత్రాణపరాయణులగు వీరులు మనలో చాలామంది కలరనుటకు మనవాఙ్మయమే సాక్షి.

8.—క్షమ

గృహస్థుని ప్రేమ గృహధర్మముల ద్వారా పెంపొంది విశ్వవ్యాపిని యగునని తెల్పియుంటిమి. ఇట్టి భావన యిప్పటికీ పూర్తిగా నశించక మన సంఘమున నచ్చటచ్చట్లకద్దు. పురా తన సంప్రదాయము లింకా నమసిపోలేదు, మూలనియమాలు మూలబడక ఆచరణలో నున్నవి. ప్రాచీనకుటుంబవ్యవస్థలగు బంధువుల్ను, దాసదాసీజనము, అతిథ్యభ్యాగతు లింకా పాడు వడలేదు. హిందువుల కివన్నీ ప్రేమభాజనములే. అప్పటివలె కాకపోయినా గార్హస్థ్యధర్మములు ఇప్పటికీ అచ్చటచ్చట నిర్వహింపబడుతూ ఉన్నవి. అందు శ్రద్ధ, భక్తి, ప్రీతి, మమత యున్నా ఇప్పుడూ ఆచరింపబడుతూ తన్మూలమున క్షాంతి అభ్యస్తమగుచున్నది. క్షమాశీలుడు కాకుంటే గృహస్థు పనికి రాడు. గార్హస్థ్యమం దందరికీ ఆదర మున్నది; అందుచేతనే చనువు హెచ్చి కుటుంబములోని చాలామంది స్థిరచిత్తులు కానందున పొరపాటు లెన్నో చేయుచుందురు, వాటి నన్ని టినీ యజమాని క్షమించవలెను; లేకుంటే ఎవ్వరూ వానిదరికి

చేరరు, అట్టివారిని ప్రేమచేత వశులను చేసుకొను టెట్లు తన్నాదరించనివారిని తా నాదరించుట సంభవ మగునా? ఆదరించనివారియెడ ప్రేమజూపుటకు వీలేదీ? ఆదరముంటేనే కదా ప్రేయసుల దోషములు లెక్కకు రావు. ప్రేమ, శ్రద్ధ, దయ, భక్తి, ఇవి నరుని పక్షపాతిగా నొనర్చును. బంధుగులయెడ నెట్లో భగవంతునియెడ నట్లే. హిందూకుటుంబమువంటి క్షమారాజ్య మింకొకచోట నుండబోదు. క్షమ మానవునకు సుభూషణము. *

శ్రీరామునియందలి క్షాంతి చూడండి—కైకేయి ఆతని నెంత బాధించినది! వనవాసము తెచ్చిపెట్టడమే కాక తండ్రిని కూడా చంపింది-శ్రీరాముని వియోగము ప్రాప్తించి నప్పటినుంచీ పాప మాదశరథుడు విషాదసాగరమునబడి మరి తరింపనేలేక మృత్యువు వాత పడినాడు. దీని కంతటికీ హేతు వామెయే కదా! క్షమాశీలుడగు శ్రీరాముడు దాని నెంత మాత్రము పరకుచేయలేదు, ఆమెను పల్లెత్తుమాటాడలేదు,

---

* Not the king's crown, nor the deputed sword,
The marshal's truncheon, nor the judge's robe,
Become them with one half so good a grace
As mercy does.................................. Shak.

కాచున్నృపాలమౌళియును, కాదధికారికిగల్గు కత్తియున్,
కాదుచమూనియంతృగద, కాదుసభాపతిమేనిఅంగియున్,
కాదరవీసమైన దయకైపడి శ్రేష్ఠవిభూషణంబు.

..........................................................

ఆ|| నా|| దా||

సకలేశ్వరా లక్ష్మణుడు కోపోద్రేకమున నామెను నిందింప బొచ్చిన ఆతని మందలించెను. శాంతిచేత ఆతని చిత్తమునకెట్టి శాంతి చేకూరెనో, అది యెంత స్థిరమైయుండెనో కొంచెము భావించండి.

ధర్మరాజునందు కూడా ఇట్టి శాంతే కానవచ్చును. పుత్రప్రేమచేత వివేకదూరుడై తండ్రిలేని పాండవులయెడ ధృతరాష్ట్రుడొనర్చిన దుండగముల గూర్చి ధర్మజుడు పెదవి కదల్పలేదు, ఆతనియెడ ననాదరము గానీ ఔదాసీన్యముకానీ చూపలేదు; అతని ఆగడములు సైరించుటే కాక అతనిని దైవమువలె నారాధించు చుండెను. భీష్ముడు ధీరోత్తముడు, సత్యవాది, దానశీలుడు, శాంతిపరుడు. శ్రీకృష్ణుడు శిశుపాలు నెడ చూపిన శాంతి అందరూ ఎరిగినదే. ఆర్యులలో పురుషులు మాత్రమే కాక స్త్రీలుకూడా క్షమాసంపన్నలే. పుత్రశోకోప హతమానసయైన ద్రౌపది అశ్వత్థామయెడ నెంత శాంతి వహించెనో వినియున్నారు. సౌదాసుడనురాజు వశిష్ఠునిపై కనలి శపింప నుద్యుక్తుడగునప్పుడు ఆతనిసతి వారించెనని రామాయణమున నున్నది.

హిందూసంఘమున క్షమ సర్వసాధారణధర్మము కాని అలౌకికము కాదు. మానవధర్మము లలో నిది ప్రధానము ఆధర్మమున కంగములు పది:—ధృతి, క్షమ, దమము, అస్తేయము, శౌచము, శమము, బుద్ధి, విద్య, సత్యము, అక్రోధము— అని మానవధర్మశాస్త్రమం దున్నది. పూర్వమున ఆర్యు

లందరూ (విశేషించి బ్రాహ్మణులు) ఈ పదిగుణములూ కలిగి యుండేవారు. ఇప్పటికీ నవనాగరికత చొరకున్న హిందూ గృహములందు కుటుంబసమష్టికి క్షమయే మూలబలముగా నున్నది-యూరోపీయ సంఘముల శిక్షాప్రణాళి, సంఘనిర్మాణమూ స్వతంత్రము లగుటవల్ల క్షాంతి కందు చోటులేదు. వారి నీతిశాస్త్రానుసారము శమము క్షాంతీ అలౌకికధర్మములుగా గణింపబడినవి చూడండి— 178 పేజి—

To err is human, to forgive is divine.
తప్పుచేయుట మానవధర్మ మగును, క్షాంతి ధర్మంబు స్వర్గవాస్తవ్యులకును.

మనము శాంతిని క్షాంతిని మానవధర్మములుగా గణింప వారవి దేవతాధర్మములందురు. వారిమతప్రవర్తకుడు ఏసుక్రీస్తు అవసానకాలమున—“తండ్రీ, నా హంతకుల క్షమింపుము, వారనేది వారే ఎఱుగర”ని సర్వేశ్వరునిప్రార్థించెను.

ఐరోపీయసాహిత్యమున క్షమాగుణభూషితుల చరిత్రము లత్యంతదుర్లభములు- పోర్షియా ఇసబెలాలు క్షమాగుణదివ్యశోభను హృద్యముగా కీర్తింతురు, ఇది వినువారలను క్షణకాలము వెరగుపడ జేయునేకాని వారిమానసములందు నెలకొనదు-ఇట్లుకావలెనంటే ఆగుణమును మానవచరితములందు చేర్చి కల్పన చేయవలెను. ధనలుబ్ధుడగు షైలాకు చరిత్రమున తరువుకానితనము, నిర్దయ, మాటపట్టుదలయు, ఏంజిలో చరిత్రమున దండనీతికఠోరనియమపాలనము న్నూ కూర్చినట్లే, క్షమాగుణము నేపాత్రమునందైనా షేక్స్పియరు

రచించెనా ? షైలాకు భీషణక్రూరత నిర్దయుల సరస పోర్షియా వక్తృత మధురముగా నుండును కాని, అది క్షణికము కావున ఆరస మంతతో ముగియును. అదృశ్య మంతమగుసరికి నింద్యుడగు యూదుని చరిత్రము మరింత నీచముగా నొనరించుటకు క్రైస్తవులచే క్షమాభిక్షను కవి అడిగించెనని తోచును. అట్టి క్షమను క్రైస్తవులు యూదులయెడ గన్పరచినారా ? అదే జరిగియుంటే ఆ రెండుజాతుల కంతపగ పుట్టనే పుట్టియుండదు సొమ్ము పుచ్చుకోవాలని షైలాకు కోర్టుకు రాలేదు-క్రైస్తవుల దుష్కృతములచేతనూ, అత్యాచారముల చేతనూ పీడితులై క్రోధావేశులైన యూదుల కసి తీర్చుకొను ఉద్దేశముతో నతడు వచ్చెను. క్రైస్తవుల పక్షమున వాదించుటకు వకీ లుండెనుకాని యూదుల పక్షమువా డేడీ ? యూదుడే ఆ నాటకము వ్రాసినట్లైతే ఘటనాచక్రము మారియుండదా ? షైలాకు పాత్రమున మానవుని యందలి పశ్వంశ ప్రబల రూపమున చిత్రింపబడినది. తగవు తీర్చుటకు క్రైస్తవులందరూ గుమిగూడినారు. యూదుని కెదురుగా విజాతీయులందరూ దళబద్ధులైనారు కాని షైలాకుపక్షమువారిని కవి దళబద్ధులను చేయలేదేమి ? ఇది పాత్రరచనయందు పక్షపాతము కాదా ? క్రైస్తవకవి నాటకకర్త కావున యూదుని నింద్యచరిత్రునిగా నిర్మించి అతనిపక్షమున వాదించువానినైనా నియమించలేదు. పోర్షియా దయావిషయికోపన్యాసమిచ్చినప్పుడు యూదులు ప్రతివాదించుటకు సబబు లేదా !

"క్రైస్తవులగు మీరు హింసాపరులై సంతతమూ మమ్ము పీడించుచున్నారు; ప్రస్తుత మొక్కసారి మీయెడ మేము క్రూరత వహించేటప్పటికి మీకు ఆశ్చర్యమూ దిగులూ పుట్టినవా ? మేమెన్నో ఏళ్ళనుంచి సైరిస్తూన్న దానిని మీ రొకనాడు సహింపలేరా ? నేటికి పన్నెండేళ్ళనుంచి ఎంటోనియో మా షైలాకును గర్హించుచుండెనే! ఇంతకాలమూ అతనిని తిట్టడము చాలక నేడుకూడా మానడాయె మమ్మేవగించి కనబడినచోటులనెల్ల అవమానించక మానరు. ఈనాటికి మీచేయి క్రిందయినదని దయాసరణిగురించి శ్రీరంగనీతు లాడజొచ్చినారు! పోనీ, ఇట్టిదయ మీరెన్నడైన మాయెడ చూపినారా ? మీదయాపరత్వము మేమెరుగమా ? అట్టి మీపై మాకు జాలిపుట్టునా ? చాల్చాలు! మీమాటలు విన్న నెవ్వరైన నవ్విపోదురు" అని యూదులు ఎత్తిపొడువజాలరా ?

షైలాకంత పట్టుబట్టడానికి హేతువేమి ? అతనికంత అసహన మెందుకు పుట్టింది ? అదంతా క్రైస్తవులు యూదులయెడ కనపర్చిన ధిక్కారము, బాధలయొక్కయూ పర్యవసానము. కవి మాత్రము వారియెడల గన్పరచిన కరుణ యెట్టిది ? దావాతీర్పును బట్టి ఎంటోనియో శిక్షింపబడలేదు సరేకదా షైలాకుప్రాణముమీదికి వచ్చింది. తగవంతా తబ్బిబ్బైనది. న్యాయాధికారి దయతలచి షైలాకుప్రాణము నిల్పెనుగాని, జీవనాధారము, గౌరవదాయకము నైన అతని

సాత్తంతా తన అధీనము చేసుకొనెను. యూదులు క్రైస్తవ న్యాయస్థానముల కెక్కినపుడులకు లభించే ఫలము చూడండి!

పోర్షియానోట వెలువడిన దయావాక్యములు మూడు కారణములచేత పొల్లుపోయెను:—

1. క్షమాచిత్రము మనసు కెక్కునట్లు కవి చిత్రింప లేదు.

2. షైలాకుపక్షమున చెప్పవలసిన విషయములు స్ఫురణకు వచ్చును.

3. విచారణానంతరముకూడా షైలాకునెడ క్రైస్తవులు నిర్దయచూపుదురు.

క్షమాగుణమును వృద్ధిచేయడము కవిఉద్దేశ్యము కానే కాదు, మానవుడు ఒకరిని వంచింపబోయి త్రవ్విన గోతిలో తానే పడునని నిదర్శనము చూపదలచినట్లున్నది; అందు కృతకృత్యుడాయెను.

8—9 అక్రోధము—అహింస—

క్రోధము నణగదొక్కకున్న క్షమ ఉద్రేకింపదు. స్నేహము, మమత, ప్రేమయున్నా విన్యాసము చెందినట్లైతే క్రోధము తనంతనే ఉడిగిపోవును. క్రోధమునకు తగిన విరుగుడు ప్రేమయే. ఇందుచేతనే హిందూగృహమందక్రోధము నభ్యసించుటకు తగిన పరిస్థితులేర్పరచి యుండును; ఋషి ప్రతిష్ఠితమగు నచ్చోటు దేవత్వము సాధించుటకు ముఖ్యావ

లంబనము. ఇది నిర్వహించు తెరం గీవిధమున మహాభారత మం దున్నది:—

తత్ర వై మానుషాల్లోకా ద్దానాదిభి రతంద్రితః
అహింసార్థ సమాయుక్తైః కారణైః స్వర్గమశ్నుతే॥
దానాదుల పూనికతో నేనరు ధర్మార్థములు యహింసాయుక్తిగ
తా నభ్యసించుచుండును,వానికి దేవత్వ మొగిని వశమౌ నిలలోన్॥

దానధర్మము లభ్యసించుటవల్ల అక్రోధము, క్షమా అలవడి హింసాప్రవృత్తి హీనమగును. సామాన్యప్రేమ ప్రసారమున అహింస యావహిల్లదు. ఇతరునిసుఖము చూచి తాను సుఖించడమే ప్రేమ. హింస స్వసుఖాభిలాషిణి-ప్రేమ పరసుఖాభిలాషిణి-ప్రేమాలోక ప్రసార మతిశయించినకొద్ది హింసాధకారప్రసారము సంకుచిత మగును. ప్రేమ పొంగి వెల్లివిరిసి విశ్వవ్యాపిని కాగా సమదృష్టి యవతరించి హింసా పరత్వమును సమయించును. ఇట్టి సమత్వము మైత్రేయికి లభించినతోడనే "సంసారమందు నీకు ప్రేమ కల్గినంతమాత్రమున నది నీకు ప్రేమపాత్రమని యెంచకు, ఆత్మ నీ కత్యంత ప్రీతిపాత్రమగుటచేతనే సంసారము ప్రేమాస్పదమయ్యెను." అని యాజ్ఞవల్క్యు డామె కుపదేశించెను. తోడనే వారు సంసారమును త్యజించి వనములందు వసింపనేగిరి, స్వర్గము వారికి కరగతమౌటచేత ఈలోకమునుండియే వారు ముక్తులైరి, బ్రహ్మప్రాప్తికై సన్యాసమార్గము నవలంబింపవలసి వచ్చెను.

అహింసాప్రశస్తి ఆర్యసాహిత్యమున నన్నికడల నావరించియున్నది. శ్రీకృష్ణుని చరితమున నీధర్మ ముజ్జ్వలరూపమున గాంచనగును. భీష్మవిదురాదులు హింసాహీనులు, శ్రీశుకుడు నారదుడు మొదలగు ఋషులచరితములం దహింస ప్రత్యక్షరూపమున పరిఢవిల్లుచున్నది. ఇదే హిందువులకు ప్రధానధర్మము, దానిచేతనే వారి ప్రకృతి కోమలతరము నమ్రతరము నగుచున్నది. అది వారిని క్షమాశీలురను కావించి వారిగృహములను శాంతినికేతనముల నొనర్చుచున్నది. శాంతిమయమైన అహింసావతారమే బుద్ధదేవుడు, అతని కహింస నేర్పినది హిందూమతము; అహింసామహాధర్మము నుపదేశించుటవల్లనే బుద్ధుడు జినుడును శాంతిస్థాపనాసము ర్థులైరి. క్రైస్తవులం దీధర్మమునకు తగినంత ఆధారము దక్కలేదు, అందుకే ఐరోపీయసాహిత్యమున నది అరుదుగా దోచును. ఆమతమున న్యాయపరతకు లభించిన ప్రాచుర్యము ప్రాముఖ్యతా క్షమాగుణమునకు చిక్కలేదు. కఠినశిక్షావిధాన మార్యసాహిత్యమందూ కద్దు. ధర్మక్రోధ మెచ్చునపుడు పాపమునకు కఠినశిక్ష ప్రాప్తించకపోదు. కాని దీనికి తోడుగా క్షమయూ పుణ్యజ్యోతిస్సీ ఆయాచోట్ల స్ఫురణ వహించి యుండును.

స్వర్గము—

శ్రద్ధ, భక్తి, ప్రేమ, క్షమ, అక్రోధము, అహింస మొదలగు గుణములచే పూరితములైన దేవతాదర్శములు

ఆర్యసాహిత్యమున కొల్లలుగా నున్నవి. దేవతల కునికిపట్టగు స్వర్గము సౌఖ్యమునకు పాదు. అచ్చటికి పోవుమార్గ మతిసంకీర్ణమే (Strait is the gate to Heaven) కాని శ్రద్ధాభక్తు లలవడినవాళ్లే కది సుగమము. స్నేహ మమత లను దిగువమెట్టులపై నుండి గురుజనులను భక్తితో నర్చించువారి దృష్టులను దేవతలు తమవైపాకర్షింతురు. దేవతలను మూర్తివంతుల నొనర్చి ఆర్యకవులు మానవాభివృద్ధికి మార్గము చూపిరి. లక్ష్మీ కమనీయ స్వర్ణప్రతిమ, వేదమాతయైన సరస్వతి జగన్మోహినియగు శ్వేతమూర్తి, అసురవిజయినియగు పార్వతి దశభుజ, శక్తిరూపిణి, నీలమూర్తి. జగదుత్పత్తికి కారణభూతుడు సూర్యుడు; దాని నావరించియుండువాడు వరుణుడు; తేజమున కాధారభూతుడు అగ్ని; జగత్ప్రాణస్వరూపుడు వాయువు. అద్వితీయుడగు భగవంతు డన్ని జీవులయందూ వర్తించును. అనంతవిభూతి కాధారుడై స్వర్గమున రాజిలుచుండు దేవదేవుడు స్వప్రకాశవికాసమున అనంతబ్రహ్మాండమం దంతర్హితుడై యుండియు సామాన్యదృష్టికి గోచరుడు కాడు. అతని విభూతివికాసము గనకున్న అతని నారాధించు టెట్లు? ఆతడు విశ్వవ్యాపి కావున అనంతమూర్తులం దతని జూచి అనంతు డనుకొనవలెను.

యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతే పి వా
అంత ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః॥
కన్న జగమెల్ల మరియును విన్న జగము నిండియంతట నారాయణుండు వెలయు

ఇట్టి విశ్వరూపసందర్శన మర్జునునికి లభించినది.

దివ్యాదర్శములను రచించి ఆర్యకవులు తమకావ్యము లకు దివ్యసౌందర్యమును గడనచేయగల్గిరి. వాటిని పఠించు వారిఎదుట దివ్యాదర్శములు సాక్షాత్కరించి యుండుటచేత వారువాటిని పూజించి, ఆ మోహనరూపసందర్శమున తనిసి స్వర్గప్రాప్తికై ఎల్లవ్వడు నాకాంక్షింతురు. శూరులు యుద్ధభూమి నురుకజూచుట కిదే హేతువు. వీరస్వర్గము నాశించే కదా కురుపాండవులు ఘోరసంగ్రామ మొనర్చిరి! సతులు సహగమనము చేయుట-బలిచక్రవర్తి పాతాళమునకు కుంగుట-శిబి తనమేనికండలు చెండియిచ్చుట, బృహదర్భకుడు తన సుతుని బ్రాహ్మణసేవకు బలిగా నొసంగుట—మొదలగు కృత్యముల కన్నిటికీ స్వర్గకాంక్షయే ప్రధానము. స్వర్గసభను నారదుడు ధర్మజు నెదుట వివరముగా వర్ణించెను. అష్టదిక్పాలుర ఐశ్వర్య మత్యధికముగా నందు పలసిల్లుచుండును. ఇంద్రుని కాపదవి ఎట్లు లభించెను? నిస్తులపరాక్రమసంపన్నుడగు నాతడు దేవతల కధీశ్వరత్వము లభింప బ్రహ్మచర్య మాచరించెనని మహాభారతమం దున్నది. జితేంద్రియులకుగాని దేవత్వము ప్రాప్తించదు. ఆసురప్రవృత్తి నణగద్రొక్కి జితేంద్రియులై సంయమివ్రతాచరణ పరులకు మాత్రమే స్వర్గము కరగతమగును.

ప్రాణ ప్రతిష్ఠ (దేవతావాహనము)—

దేవతాదర్శముల నన్నిటినీ ఆర్యకవులు సజీవములు మూర్తివంతములుగా నొనర్చి రంటిమి. దేవత లట్టిమూర్తులే.

ఈయాదర్శములను మరచినవాళ్ళు దైవోపాసన చేయలేరు; ఒకవేళ చేసినా అది ధర్మసంగతము కానేరదు. ఆదర్శము లను త్యజించినట్టైయితే దేవతలు నిర్జీవు లగుదురు. ప్రాణ ప్రతిష్ఠ కావింపబడిన దేవతాప్రతిమలందు దివ్యశక్తిని గాంచు వారే దేవాదర్శముల గాంచగలవారు. ప్రాణప్రతిష్ఠామంత్రము చేత దేవాదర్శము సజీవమగును. ప్రాణప్రతిష్ఠ యన నేమి? శక్తివంతము సజీవమూ అగు దేవతామూర్తిని ధ్యా నించి అనుభవములోనికి దెచ్చుకొనుట. ఇట్టిమూర్తులనే మన వా రుపాసింతురు.

దేవతా చరితము—

ప్రాణప్రతిష్ఠ చేసిన దేవతాప్రతిమ అనంతదివ్యశక్తులకు నిధానమని భక్తులు భావింతురు. ఈ శక్తులే దాని విభూతి యనబడును. ఒక్కొక్క దేవత ఒక్కొక్క విభూతిరూపమున ఉపాసకుల హృదయములందు నిహితమగును. దివ్యప్రేమ, దివ్యనిగ్రహము, దివ్యబలము, దివ్యవిభూతియూ ఆర్యసాహి త్యమున దేదీప్యమానముగా వర్ణింపబడినవి. అన్నిమూర్తు లూ సగుణేశ్వరుని రూపములే. ప్రేమమూర్తి ఒకప్పుడు ప్ర చండరూపము ధరించి అధర్మపరులను శిక్షించి, శిష్టులను రక్షించి ధర్మసంస్థాపనము చేయుచుండును.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥ భ॥ గీ॥

రక్షింపగ సజ్జనులను శిక్షింపగ దుష్టజనుల సేమమెలర్పన్
వీక్షింపధర్మ మాహావ దక్షా నేనవతరింతు దగ యుగయుగముల్

తా॥ల॥న॥

ఒకప్పు డదే జగన్మోహనమగు శ్రీకృష్ణరూపమున గోపికలను భక్తుల తృప్తినొందించుచుండును, అన్నపూర్ణరూపమున విశ్వాత్మ ప్రేమను జీవరాసులకు పంచిచ్చును. ఇట్టి అనంతకరుణామయమగు రూపము ఆర్యసాహిత్యమున శ్రీరామ కృష్ణావతారములదాల్చి విలసిల్లుచున్నది. ఇతరసాహిత్యములందు ఇట్టి భగవదవతారములే కానరావు. చిత్తవశీకరణములగు నవతారములు భగవంతుని అలౌకికవ్యాపారములు. భీతిగాంభీర్యములు మానవచిత్తములయందు భాసమానమగునట్లు అలౌకికశక్తివంతుడగు భగవంతుడు పృథ్వి కవతరించి మానవులతోపాటు వ్యవహరించెనని విదేశసాహిత్యమున నెచ్చటా చెప్పబడలేదు. ప్రేమమయుడగు పరమాత్ముడు లోకసంగ్రహార్థముపృథ్వి నవతరించి ఎట్టికార్యముల నాచరించుచుండునో మన మెరుగలేము. పాపులను శిక్షించి పాపనివారణ మొనర్చి, పుణ్యాత్ములకు దర్శనమిచ్చి వారిని స్వర్గమునకు కొనిపోవునని మనగ్రంథములం దున్నది. మానసమున భావించిన యీ ఉదహారణములు కావ్యములయందు ప్రత్యక్షమగును.

ప్రపంచపరిపాలనానియమములను గని నివ్వెరపడనివారుండరు. అట్టి యాదర్శముల నభివర్ణించిన కావ్యములు సఫలములు కావా? ఈవర్ణనలందు కల్పనాశక్తికి కావలసినంత అవకాశము లభించును. భగవంతుని అద్భుతలీలలూ అపురూపక్రియాకలాపమున్నూ గాంచినతోడనే మానవుడు చకితు

డగును. భగవత్ప్రేమరస మార్యసాహిత్యమున కావలసినంత కలదు. హోమర్, వర్జిల్, డాంటే, మిల్టన్ మొదలగు కవులు తమకావ్యములయందు భగవదవతారములు రచింపనే లేదు, వాటిని చదువుటవల్ల దైవభక్తిప్రభావమే యెరుకపడదు; భగవంతునిప్రభావజ్ఞానమే కలుగదు. బ్రహ్మజ్ఞానము మన వేదములం దుండినట్లు పిదేశగ్రంథములయందు కానరాదు, వైదికజ్ఞానము కొంచెము ప్రసరించిన దేశములయందుకూడా అది రూఢము కాలేదు, కావున ఇతరదేశీయులకు బ్రహ్మజ్ఞానము ప్రాప్తించలేదు. కావ్యసృష్టికి కావలసిన సాధనసంచయము మన వేదవేదాంతములందు విపులముగా నుంది. వేదములన్నీ దివ్యుల విపులరాష్ట్రి మనవచ్చును, దివ్యసుందర కాంతి అం దుజ్వలరూపమున భాసిల్లుచున్నది; వేదాంతము (ఉపనిషత్తు) లందు దేవతలూ లేరు, స్వర్గమూ కానరాదు, అందు నిర్మలము పవిత్రము నగు చైతన్యమూర్తి భాసిల్లుతూ ఉండును. వేదములు కర్మప్రధానములు, వాటి ఫలము స్వర్గప్రాప్తి; వేదాంతములు జ్ఞానప్రధానములు, వాటి పరిణామము ముక్తి.

ఋషి చరితము—

ఆర్యసాహిత్యమున వెలయు దేవతాదర్శములు మానవులకు సిద్ధించునా? మానవుల కవి అప్రాప్యములని ఏసుక్రీస్తు అభిప్రాయము, కాని వైదికార్యు లవి ప్రాప్యములనే చెప్పిరి; మానవులందు దేవత లంతర్హితులై యున్నారనీ, బాహ్య

చ్ఛాదనములను తొలగించినతోడనే దేవతారూపములు వ్యక్తములగుననిన్నీ మనఋషులు చెప్పినారు. మానవదేహము లందాత్మ రూపమున పరమేశ్వరుడు వర్తిస్తున్నాడు, మోహావరణము తొలగించగానే తద్దివ్యజ్యోతి ప్రకాశించును. మనుష్యులు దేవత్వమును పొందగలరనుటకు ఋషులు ప్రమాణముల నిచ్చినారు,తపోబలమున ఎట్టి అసాధ్యమైన పనియైనా సాధ్యమగును. సామాన్యులందు దైవశక్తి ఆవిర్భవించు మార్గములను సూచించడానికే కవులు మనసాహిత్యమున ఋషిచరితములను జొన్పినారు. ఆచరితములు చదివితే మనుష్యులకు దేవత్వము సాధ్యాతీతము కాదని స్పష్టపడును. రామాయణమున భారతమునా దివ్యశక్తుల నార్జించిన ఋషులనేకు లీయభిప్రాయమును దృఢపరుస్తున్నారు.

మానవ చరితము—

దేవతలయొక్కయు ఋషులయొక్కయు చరితములే కాక అనేకమంది భక్తులు సాధకులు మొదలగువాళ్ల చరిత్రములూ మనసాహిత్యమున కలవు. ఒకవంక దేవతలమహిమావంతములు ఉన్నతములగు నాదర్శములు, వేరొకవంక తపఃప్రభావమున దివ్యశక్తుల నార్జించి దేవత్వసిద్ధి గాంచిన ఋషుల చరితములు కలవు, ఇంకొకవంక తపశ్చరణ మొనర్చుచుండు మానవులు కానవత్తురు. అరిషడ్వర్గమును వశపరుచుకొని చిత్తమును తపముచే నాయత్తపరుప సంయమిత్వము సిద్ధించును. ఇటి తపోబలమువల్లనే ధ్రువుడు తరించెను. దానిచేతనే

ప్రహ్లాదుడు పరమభాగవతోత్తముడై చిరస్మరణీయుడయ్యెను. ఆత్మగౌరవాహంకారములు ప్రబలుటచేతనే కదా యయాతి స్వర్గభ్రష్టుడై మర్త్యలోకమున కొంతకాలము తపస్సుచేసెను. యుధిష్ఠిరుడెంతో తపస్సుచేసి భీష్మునిచేత ధర్మతత్త్వముప దేశింపబడినా అహమిక పూర్తిగా నశించకపోవడముచేతనే శ్రీకృష్ణుని కటువాక్యములు వినవలసివచ్చెను. ధర్మరాజుచరిత మంతా ఉగ్రమైన ధర్మతపశ్చరణమందు లగ్నమైనట్లు తోచును. అతడు సంతతము బ్రాహ్మణుల సంసర్గముచేతా ఋషుల ఉపదేశముల మూలానా చిత్తశాంతి చిత్తశుద్ధిన్ని సమకూర్చుకొనడానికి యత్నిస్తూ ఉండెను. తపః ప్రభావము వల్లనే ధర్మవ్యాధుడు దివ్యత్వము పొందెనని మహాభారతమం దుంది. ఆతడు వృద్ధులగుతలిదండ్రుల దేవతలవలె పూజిస్తూ ప్రేమవ్రతము నాచరించెను, కావున కౌశికునకు దేవతాదర్శ రూపమగు పితృభక్తి మచ్చు చూపగల్గెను. ఆవృద్ధదంపతులు ప్రేమకున్నూ భక్తికిన్నీ నిధానములై ప్రత్యక్షదేవత లయి నారు. ధర్మవ్యాధుని చూచినవెంటనే కౌశికునికి కూడా తన పితరుల పూజించు నిచ్ఛ వొడమింది. సతీమతల్లియైన బ్రాహ్మ ణుని భార్య యిందుకే కౌశికుని అక్కడికి పంపింది. ఆమె ఏకాంతచిత్తముతో సతీవ్రత మాచరిస్తూ ఉన్న సాధ్వీమణి. కుంతి గాంధారి మొదలగు పతివ్రత లిట్టి తపస్వినులే.

ఆర్యసాహిత్యమున చిత్రింపబడిన మానవపాత్రములు సామాన్యములు కావు. అందరూ దేవత్వము లభించడమునకై

తపోవ్రతధారులై యత్నించేవారే. వారిప్రకర్ష చక్కగా కన బడుటకు వారిప్రక్కనే దైత్య దానవ రాక్షసుల చిత్రము లమర్చబడ్డవి- ఈ పాపచిత్రములు కూడా మానుష చిత్రములే కాని వాటిలో అరిషడ్వర్గము అత్యధికముగా చెలరేగింది. ఇంద్రియవశుడైన మానవుడు సంయమము కోలుపోవడము, వానికి స్వేచ్ఛాచరణము స్వాభావికము కావడమున్నూ దానవచరితములందు స్పష్టమగును. ఆర్యసాహిత్యమున చిత్రితులైన స్త్రీపురుషులను నాలుగు తెగలుగా విభజింప వచ్చును:—దేవతలు—ఋషులు—మనుష్యులు--దానవులు.

ఈ మనుష్యచిత్రములే యథార్థమైన మానవపాత్రములు. అంతశ్శత్రుప్రాబల్య విశిష్టమగు సాధారణమానవచరితములకన్న అవి ఉత్తమములు. అందు క్రమముగా దేవత్వము వికాస మొందును. వారు ఇంద్రియ నిగ్రహముచేత చిత్తైకాగ్రతను సాధించి విశ్వప్రేమ నతిశయింప జేయుదురు. దేవతలున్నూ సంసారులే, వారికీ పుత్రమిత్రకళత్రాదులు కల్పింపబడ్డారు, సంసారులైనావాళ్ల ప్రేమ విశ్వవ్యాపిని కావడముచేత వాళ్ళెప్పుడూ విశ్వరక్షణమందు వ్యగ్రులై ఉంటారు. వాళ్ల చరిత్రలే మానవుల కాదర్శములు. ప్రేమను సర్వజంతువులకూ సమముగా పంచి యివ్వడమే దేవత్వము సాధించడము. ఇది కఠినవ్రతము, దీని ప్రభావముచేతనే ప్రేమభక్తిమిశ్రితమై పెద్దలందు ప్రసరించును. దీనినే పాశ్చాత్యులు Hero-Worship అంటారు. పెద్దలు లోకాంతరగతులైన వెన్క

తర్పణములు, శ్రాద్ధములు మొదలగు కర్మలమూలాన వారు మృతజీవు లగుదురు. గురుజనమందు లగ్నమైన ప్రేమ భగవదర్పితమై తద్వారా సర్వభూతములందున్నూ వ్యాపించును. భగవంతుడు సర్వాంతర్యామియైనట్లు జ్ఞానదృష్టికి ప్రత్యక్షు డగునప్పుడు భక్తు డిట్లు స్తుతించును:—

పశ్యామి దేవాం స్తవ దేవ దేహే సర్వాం స్తథా భూతవిశేష సంఘాన్
బ్రహ్మాణ మీశం కమలాసనస్థ మృషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్॥
అనేక బాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతో నంత రూపమ్
నాంతం నమధ్యం నపున స్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప॥

భగవద్గీత.

కనియెద దేవ నీదు ఘనకాయమునందు సమస్త దేవతా
లిని, మరి పద్దెరంగుల వెలింగెడునట్టి అశేషభూతకో
టిని, సభ పద్మపీఠమున శివిని దీర్చినయట్టి బ్రహ్మదే
వుని, తగ దివ్యమౌ నురగపుంజము, సర్వమునిప్రపంచమున్.
పెక్కు చేతులు పెక్కు కడుపులు పెక్కు మోములు నేత్రముల్
పెక్కు దాలిచి కానిపించెదు పెక్కు రూపుల నెల్లెడన్
నిక్కమిప్పుడు విశ్వరూపుడ నీకు నంతము మధ్యమౌ
యిక్క యాదియు గానిపింపవ దెందు నో జగదీశ్వరా—

..........తా॥ల॥న॥

సమాప్తము.



# సవరణపట్టిక:—

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 17 | లీనమయి | లీనమయింది |
| 9 | 16 | ఐనచో | వాటియందు |
| 13 | 11 | ప్రేరిత్రమున | ప్రేరణమున |
| 41 | 1 | రోతాయు | ంోతా |
| 53 | 21 | పృధుల | పృథుల |
| 55 | 5 | జుగుప్సాహార్ | జుగుప్సాహా |
| 58 | 1,2 | గహార్య | గర్హ్యా |
| 64 | 10 | త్రావుచున్నాన | తాగుచున్నాడ |
| 75 | 5 | కల్గగలేదు | కల్గలేదు |
| 89 | 1 | కన్నా | ... .. |
| 95 | 5 | కవి | కది |
| 101 | 11 | విరోధము | నిరోధము |
| ,, | 18 | చేయువచ్చును | వచ్చును |
| 109 | 10 | యోగ్యఔ | యోగ్యజ్ఞా |
| 127 | 5 | కృష్ణా | కృష్ణ |
| 141 | 3 | నూన్యతమై | న్యూతమై |
| 193 | 8 | పూతము | పూతములై |